శ్రీధరాయనమః.



శ్రీరామచంద్రచరణారవింద మిళిందాయమానమానస

సకలశాస్త్రార్ధ్వరిరంస

పైడిమఱ్ఱి పద్మనాభాధ్వరిరంసకృపాభూషణ

పర్వతరాజతనయ

# వేంకటపతి

విరచితంబగు

# చంద్రాంగదచరిత్రము.



ఇది

శ్రీమదముద్రితగ్రంథచింతామణ్యధిపతియగు

పూండ్లరామకృష్ణయ్యచేఁ బరిష్కరింపఁబడి

టీకాసహితముగ

శ్రీమత్సరస్వతీనిలయముద్రాక్షరశాలయందు

ముద్రితమై

పూండ్లరామకృష్ణయ్యగారిచేఁ

ప్రకటితమయ్యెను.

నెల్లూరు.

1897

# ప్రకటనము.



ఇట్లు,

పూండ్ల రామకృష్ణయ్య.

శ్రీ "అముద్రితగ్రంథచింతామణి"

పత్రికాధిపతి.

నెల్లూరు.

శ్రీ

లక్ష్మీనృసింహాయనమః.

---

1. క॥ శ్రీపూండ్లవంశరత్నక । లాపా హృతకాకవిప్రలాపా గోప
శ్రీపార్థ్యాపకృపాయు । ద్దీపితసాహిత్య రామకృష్ణామాత్యా॥

2. తే॥ అవధరింపుముచంద్రాంగదావనీంద్ర
చంద్రచరితప్రబంధముఁజదివిచదివి
యస్మదీయాశయమువ్రాసియంపినాఁడఁ
గానఁబ్రకటింపుమయ్యతద్గ్రంథమునను॥

3. క॥ సంకటములుడిపివ్రజసు । కంకటమైభక్తజనులఁగాచురఘుపతిన్
వేంకటపతికవినృపతివి । శంకటమతిఁగొల్చియిట్టిసత్కృతిఁజేసెన్॥

4. ఉ॥ ఉత్తమసత్కథాళిఁజెలువొందెడుస్కాందమునందెసంగు బ్ర
హ్మోత్తరఖండమందలరుచుండెడునిక్కథఁబెంచియేనాగిన్
గోత్రగనాకకబ్బమునుగూర్పఁదలంచియుఁదత్ప్రయత్నమే
నిత్తటిమానికొంటి నది యీకృతిసాటిగఁజెప్పఁజాలమిన్॥

5. క॥ సీమంతినీశిరోమణి । సీమంతినివర్ణనంబుసేయఁగఁబుణ్య
శ్రీమహితులు దగుదురు గా । కేమహిఁ దులువలకుమాకదెట్లు లభించున్॥

6. ఉ॥ అంగద లేఖకాఘమకృతామితదోషములెల్ల దిద్ది,చం
ద్రాంగదగాథ ముద్రితమొనర్చిసమీకు విరించిభోగి~
ద్రాంగదవారిదాంగుల కృపాతిశయంబుననబ్బుగాక
ద్రాంగదముఖ్యసర్వబిరుదాంకములోనికవీంద్రచం।

ఇట్లు,

పర్లాకిమెడి, గంజాముమండలము. } విన్నవించుచున్న మచ్చ వేంకటకవి, శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనకుశచరిత్రాద్యనేకాంధ్రగ్రంథకర్త

# శ్రీ శ్రీధరాయనమః.

---

## విషయానుక్రమణిక.

### (ప్రథమాశ్వాసము.)


| | |
|---|---|
| అవతారిక. | ౧ |
| కృతినాయకవర్ణనము. | ౩ |
| షష్ఠ్యంతములు. | ౫ |
| కవివిషయికము. | ౬ |
| కథాప్రారంభము. | ౬ |
| నిషధాఖ్యపురవర్ణనము. | ౬ |
| సౌధవర్ణనము. | ౯ |
| విప్రవర్ణనము. | ౧౦ |
| క్షత్రియవర్ణనము. | ౧౦ |
| వైశ్యవర్ణనము. | ౧౦ |
| హాలికవర్ణనము. | ౧౧ |
| చాతుర్వర్ణవర్ణనము. | ౧౧ |
| గజవర్ణనము. | ౧౧ |
| తురగవర్ణనము. | ౧౨ |
| వారనారీవర్ణనము. | ౧౨ |
| పుష్పలావికావర్ణనము | ౧౩ |
| ఉద్యానవర్ణనము. | ౧౩ |
| సస్యవర్ణనము. | ౧౩ |
| మరుద్వాలజాలవర్ణనము. | ౧౪ |
| రాజవర్ణనము. | ౧౪ |
| ఇంద్రసేనుఁడుతనయాభికాంక్షం దన సతితోఁ దెలుపుట. | ౧౫ |
| విష్ణ్వర్చనాభివర్ణనము. | ౧౬ |
| ఇంద్రసేనుఁడుమనోభీష్టసంసిద్ధిందనకాంతతోనుడువుట. | ౧౭ |
| సాక్షాత్కరించినవిష్ణువర్ణనము. | ౧౭ |
| విష్ణుస్తవము. దశావతారాదికము. | ౧౮ |
| దౌహృదవర్ణనము. | ౨౧ |

పుత్రోత్పత్తి. నామకరణము.

( ద్వితీయాశ్వాసము.

చంద్రాంగదుబాల్యదశాభివర్ణనము. ౨౫
యౌవనవర్ణనము. ౨౬
నిదాఘవర్ణనము. ౨౭
మృగయులేతెంచి కానుకలిడి తమపగ్గెలుగ్గడించుట. ౩౦
తలుచగుమెకము లేవనింగలవని రాజడుగఁ జెంచులుబదులిడుట. ౩౩
వేఁటకాయత్తపడి ప్రయాణమైపోవుట. ౩౪
అటవీవర్ణనము. ---
మృగయావిహారవర్ణనము.
చంద్రాంగదుఁడొకగౌలవకం దలుముకొని పోవుచు నొక చిన్నారింజూచి చొక్కుట.

( తృతీయాశ్వాసము. )

తాఁదలుముకొనివచ్చినగోరువంకయొక స్త్రీయైమంచవలించుట ౪౯
చిత్రసేనపుత్రికోదంతము. ౫౦
సత్యప్రతిజ్ఞుఁడనువిప్రుఁడొకఁడు రాజుంజూడవచ్చి సీమంతినిందీవించుట ౫౧
విప్రుఁడుతనవాక్యపాలనముకైమర్గంగూర్చికలధౌతగిరిం దపమాచరింప నింద్రుండులికి తపోవిఘ్నమొనర్ప రతిపతిసహితముగ మేనకాదుల నంపుట. ౫౧
మునియాశ్రమ వనమహిమన్నంటునకు వసంతుఁడు వర్ణించిచెప్ప నాలించుచు మేనకమునింగాంచుట. ౫౭
మునింగాంచిమేనక ప్రతినలుపలుకుచు సమీపించయందఱుఁజేరి తపముఁజెఱుప వివిధోపాయంబులఁబ్రవర్తిల్లివిఫలులై తన్మహత్త్వమునకు వెరగంది యింద్రునకావృత్తాంతముందెల్పజెగ్గిలి త్రిదివంబువారఁదఱు వలసలుసాగుటకు యత్నించుట. ౫౯
ఈశ్వరుఁడుపార్వతికి నింద్రాదులతెఱంగెఱుంగింప నయ్యుమ తపసికోరిక నెఱవేర్పఁ బ్రసన్నయై వరంబొసంగుట. ౬౭
శారికారూపంబుననున్న చిత్రరేఖోదంతము. ౬౮
చంద్రాంగదుఁడాచెలిం దనకుఁగూర్పఁజిత్రరేఖచే నొప్పించుకొని సేనాసమేతుఁడై పురంబునకేగుట. ౬౯

## ( చతుర్థాశ్వాసము. )


చంద్రాంగదుఁడు విరహమున వితర్కించుట.

వర్షర్తువర్ణనము.

శరత్కాలవర్ణనము

హేమంతర్తువర్ణనవ

శిశిరర్తువర్ణనము.

వసంతర్తువర్ణనము.

నర్మసఖుఁడు చేరంగని వేఁటకుఁబోయినతఱిఁదాఁజూచిన
చెలిని చంద్రాంగదుఁడు వర్ణించి చెప్పుట.

చిత్రసేనపుత్త్రీవివాహవర్ణనము.

వనవిహారవర్ణనాదికము.

వార్విహారవర్ణనాదికము.

మనోజపూజాభివర్ణనము.

విమలతనపుత్త్రియగు సీమంతిని విరహిణియగుటఁదెలిసి
తనసఖియగు చిత్రరేఖం దలంప నది యేతెంచుట.


## ( పంచమాశ్వాసము. )


నిషధన్విరహమునఁ గుందువాక రాకొమరు
వాని చిత్రఫలకమును చిత్రరేఖ యొసంగుట

చిత్తరువుంజూచి సీమంతిని పరితపింపననున

సూర్యాస్తమయవర్ణనము.

సాయంసమయాదివర్ణనము.

తారకోదయాదివర్ణనము.

చంద్రోదయవర్ణనము.

వెన్నెలవచనము.

వెన్నెటసీమంతినీకాంత యలయుట.

చంద్రదూషణము.

మన్మథదూషణము.

మలయమారుతోపలంభనము. ౧౨౮.

వేకువ వర్ణనc

సూర్యోదయవర్ణనము. ౧౩౧

స్వయంవరాగతరాజవర్ణనాదికము. ౧౩౧

స్వయంవరాగతసీమంతినీవర్ణనము. ౧౩౩

సీమంతిని చంద్రాంగదుని వరించుట. ౧౩౬


( షష్ఠాశ్వాసము. )


వివాహాదికము. ౧౪౧

చిత్రసేనుఁడుతనయల్లునకుం గూఁతునకు నరణముళిచ్చుట. ౧౪౫

విమలసీమంతికి బుద్ధులెఱింగించిపంపఁ జంద్రాంగదుఁడు నిజపురంబునకైబయలువెడలుట. ౧౪౬

స్వయంవరాగతులగు రాజు లసూయచేఁ దెరువాఁగి కయ్యమొనర్ప సేనానియగు యుగంధరుండు జన్యంబునవారినెల్ల నోడించుట. ౧౪౮

చంద్రాంగదుఁడు తనరాకను గెలుపును తండ్రికిఁజెప్పి పంపఁ బురమలంకరింపఁ దత్ప్రవేశమొనర్చుట. ౧౫౫




శ్రీ శ్రీధరాయనమః.

# చంద్రాంగదచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

### అవతారిక.

శ్రీగౌరీపతికార్ముకంబునిజదోర్వీర్యంబునన్గూకుడం
బై గాఢేయమునీశ్వరప్రియతరంబై భార్గవామేయబా
హాగర్వాతిశయంబుడా నరణమియ్యజ్ఞానకీకాంతతో
రాగంబొప్పగృహప్రవేశమగుశ్రీరాముడన్మదిన్గొల్చెదన్ ॥

మ॥ శమిమూర్ధన్యునిరాణిరాపడినమైజాడ్యంబుముక్కంటిచా
పమునన్గల్గుగురుత్వమూమరవరాపత్యంబుకన్దలప్పివా
ర్థిమహోద్యద్వివదోషముగ్రదశవక్త్రిభృచ్ఛిరోభారము
న్శమమొందింపఁగవెజ్జురాలయినకాంతన్భక్తిభావించెదన్

ఉ॥ ఆర్జవమొప్పనన్నమనమారసిరత్నసహస్రగూఢపా
దూర్జితశక్తిభారముసహోదరుఁడూనిచరించులీలఁదా
నార్జవమొప్పనన్నమనమారసిరత్న సహస్రగూఢపా
దూర్జితశక్తిభారమిలనూనినయాభరతున్భజించెదన్ ।

శా॥ శ్రీరామానుజనామధేయముభళీ రేసార్థతంజెందఁజ
త్పూరాభ్యస్థితిమైమెలంగిశరభంగోద్యద్గతింగాంచిదు
ర్వారప్రక్రియనున్నయప్పతికపారపేరిమఁగల్పించువి
స్మేరాగ్ర్యస్తుతమిత్రమైత్రినలసౌమిత్రింమదిన్గొల్చెదన్ ॥

ఉ॥ విఘ్నములేకయెల్లయెడవీరులలోపలనెవ్వఁడేనిశ
త్రుఘ్నసమాఖ్యమించనొకరుండుఁజరించెనెయంచుశూరతా
నిఘ్నగతత్రయీభటులునెమ్మదినెన్నఁగఁబేరుఁగాంచుశ
త్రుఘ్నుమనంబులోనఁదలఁతున్గొలుతున్వినుతుల్ఘటించుచున్ ॥

సీ॥ శ్రీవత్సభవశోభచెలువుమీఱెనయారెయంగజాతవిలాసమనువుపఱచి
ప్రకటచక్రజఘనప్రభమించెమఝూరెయతనుప్రతాపంబులందఁజేసి
ఝ
నందకోరుద్యుతులందమొందెభళిరెసతతదర్పకరణోద్ధతిఘటించి
కృష్ణవేణీచ్ఛాయగెరలెమేలౌరారరక్తినానంగవిభ్రమముఁగొల్పి
యనుచునగుచుందునిజకాంతనపుడుజూచి ... అనిసైఫలికికిలిభళిభళికలతెఁ

లనుచునట్లనెపలికినవ్వోలయఁజేయు। నంబుజాక్షుండుమముఁబ్రోచుననుదినంబు॥

మ॥ ప్రళయాభీలఘనాఘనారవసమారంభంబులౌపోటుఁగూఁ
తలదైత్యోదరముల్పగిల్చిమఱియుంతన్మోకతద్రక్తధా
రలుగ్రోలన్గమకంబుగాఁదెఱచువక్త్రింబోయనంబెజ్జమిం
పలరందాలుచుపాంచజన్యముమదీయాభీష్టముల్సేయుతన్॥ ౮.

ఉ॥ కన్నులకింపునింపుటకుఁగైకొనునా బలుసాహసంబునీ
కన్నులకింపునింపనివగన్ఘటియించెనటంచునేరము
ల్సన్నగిలంగఁజేయుటకుశౌరికరంబునవ్రాలిమన్నన
న్గన్నశితారనిర్మథితనక్రముచక్రమునాశ్రయించెదన్॥ ౯.

మ॥ అలమార్తాండుఁడితఃపురాహతమదాప్తాళీవినిర్భిన్నమం
డలుఁడైయాతనికేలవ్రాలెమనలన్దండించబోధించులీ
లలనంచున్వెఱదానవుల్బెదరిపోర్లంబారయుద్ధాగ్రకుం
డలితంబైతగుశార్ఙ్గిశార్ఙ్గమొసఁగున్మాకోరుకోర్కుల్వెసన్॥ ౧౦.

సీ॥ అఖిలలోకాధిపత్యనిధానమనుదినంబరసికాపాదుకాలాహియనఁగ
విమతకాంతలలోచనములసీరొదవించుదోఃప్రతాపకృశానుధూమమనఁగఁ
దతకీర్తివల్లీమతల్లికయల్లుకొనంగనిల్పినయుపఘ్నంబనంగ
జయలక్ష్మిసమదరాత్రుసబలార్ణవమునకొదుకకీఁదెడుతెప్పకొయ్యయనఁగ
సాహసపుమల్లుఁడడరియుత్సాహలీల। సతతమునులాగుఖురళికాస్తంభమనఁగ
విశ్రుతంబయిజగములవినుతికెక్కు। మాధవునిచేతిగదమమ్ముమనుచుఁగాత॥

మ॥ తళుకుంబైఁడిపరుంజుపైమొసలివాదర్పాంధరక్షోధిరా
డ్బలహృన్మారణహేమకుండహుతభుక్ప్రాదుర్భవజ్జ్వాలిక
న్దలపింపంబెడిదంపుపయ్యలుఁగుదన్మథ్యోదయత్కృత్యనా
వెలుగొందన్జైలువొందునందకముగావించుంజయోత్సేకమున్॥ ౧౧.

సీ॥ నిజపురాణత్వకర్ణేజపాతినిగాఢపలితాయితాననపాండిమంబు
దంష్ట్రికార్గళితాహితతఘనోగ్రకవాటకుంచికాయితశాతచంచుకంబు
గ్రసనార్థహృతనాగకచ్ఛపాధికభారనమ్రీకృతనిశాతనఖముఖంబు
లక్ష్మీశచేలాంచలత్యక్తసక్తకాంచనదళాయితగరుత్సముదయంబు
పరమతేజఃపరాభూతహరిరథంబు। నిరుపమానత్వరాతీతహరిరథంబు
నీరరుహగృహారక్తమనోరథంబు। సారెఁజేకూర్చునస్మన్మనోరథంబు॥ ౧౨.

సీ॥ కర్బురవరగోత్రకాండాసనప్రౌఢిదనుజపురోద్యానదమనగరిమ

విషరాశిలోఁగొనువిక్రమక్రమశక్తివిజయవేద్యసమీకవిభ్రమంబు
సుదృగంజనాంబకస్ఫురదాత్మవిఖ్యాతిఘనమారపురదాహకరణపటిమ
కలధౌతరుచిఁగేరుకాయసంపదకల్మిరామానుబంధగౌరవవిలాస
మెన్నఁబ్రత్యక్షహరవృత్తినెఱుఁగఁదెలుప।వసుధమునిరాజవర్ణితవర్ణితాను
భావసంపదనాశ్చర్యమావహిల్లఁ।దనరుపావనిఁదత్కృపావనిఁదలంతు॥ ౧౩.

సీ॥ గాయత్రినడఁకువఁగావించువచనంబుపంచమవేదాఖ్యఁబరగుభాష
వరలబ్ధవర్ణతవాసికెక్కినమాటయర్థగౌరవవృత్తినలరువాక్య
మధితసూర్యామోదియైయొప్పుభాషితమార్యాత్మపరితోషియైనలపిత
మానర్ఘురాఘవంబైనవాక్పటిమంబుసదలంకృతిఘటించుసరసవాణి
గలకవుల నాకుభవ వ్యాస కాళిదాస। భారవి మయూర బాణ మురారి దండి
ముఖులనఖిలవైదుష్యసమ్ముఖులనమృత।సఖసుఖాస్పదకవితాభిముఖులఁదలఁతు

తే॥ గీ॥ ఎన్నదంధ్రభాషాచార్యునన్నపార్యు। సుగుణకవితావిధాభాజిసోమయాజి
ననఘవిద్యావితంద్రునెఱ్ఱనకవీంద్రుఁ। బరకళాధాముసలచెదల్వాడభీము॥ ౧౪.

సీ॥ ఉసికొల్పశబ్దంబులొకకొన్నిపచరించికూర్మిమార్గాన్వేషరూఢిఁగాంచి
యర్థచోరక్రియహారితఁబెనుపొందికడిమిమైపట్టుపట్టెడలనరిగి
ఘసపాకశయ్యలేకడలేకచరియించివడిమీఱుకలవార్తవలనమించి
రసదాళిసరిపదరచనగానకపోల్చియనువైనతలఁపులుగనకనిల్చి
యడరుకాకవిగ్రామసింహములుగవియ। పతులునిజవచోదండసంహతులబెదరు
పరుపకుండినధారుణీపాలసభల।కలఁగఁబాఱకసుకవులుమెలఁగుటెట్లు॥ ౧౫.

వ॥ అనియిష్టదేవతా నమస్కారణంబును; సుకవిమతపురస్కారణంబును; కుకవితిరస్కారణంబునుంగావించి చంద్రాంగదచరిత్రానుబంధంబగు నాకృమహాప్రబంధంబునవరస నిబంధబంధురంబుగా రచియింపఁబూని తత్కృతికి నిఖిలలోకైకకర్తయెకానిభర్తయగుటకునొరుఁడర్హుండుగాఁడని విచారించిసకలజగన్నాయకుండునుమదభీష్టదాయకుండునునగుసీతానాయకుంగృతినాయకుంగాఁబ్రార్థించి భక్తజనదురితలతాలవిత్రంబగుతదీయచరిత్రంబభివర్ణించెద॥ ౧౬.

## కృతినాయకవర్ణనము.

సీ॥ భార్గవిప్రోషితపతికయైవిహరింపగరుడుఁడెక్కుడువేగగతులుమఱవ
దివ్యయానులమతుల్ధ్యేయశూన్యతనొందహరుబత్తళికటిత్తయగుచునిలువఁ
దసరుప్రామినుకుబొదలగాటసరిమాయభాస్కరమధ్యంబుపాడువడఁగ
వెల్లనైతెల్లదీవియరాజకముగాఁగబలివాకిలియదక్షకలనఁజెంద

నవనికామోదమొసఁగనమ్రామరవృష। భరతలక్ష్మణశత్రుఘ్నపరమసహజ
ధామనిస్తంద్రుఁడగుచుశ్రీరామచంద్రుఁ। డజభవానందకారియైయవతరించె॥

క॥ ఆరామవిభుఁడుదశరథ। భూరమణునిపంపుఁబూనిపూర్వసుపర్వ
స్ఫారభుజాధికగర్వని। వారితమునిసప్తతంత్వవనదీక్షితుఁడై॥ ౧౯.

మ॥ వడితోఁబుట్టువుతోడఁగూడియఁటవిశ్వామిత్రునాజ్ఞప్తిఁగా
రడవిందాఁబ్రతిపక్షులన్దునిమివేఁటాడంగనూహింపుచున్
నడిపించెందనచేతిపత్రికిమదాంధీభూతయైతోవనై
కక్కడుజూపంబ్రతిపక్షితాటకదిదృక్షుల్ చూచివర్ణింపఁగన్॥ ౨౦.

మ॥ అరుదారన్ రఘువీరుఁడొక్కతఱిబాల్యక్రీడమారీచము
వ్కరుమేనాతుగయుక్తిగాలిపటముంగావింటనాడింపుచున్
సోరిదిన్ దక్కినదైత్యకోటితలబంతుల్ గోర్చిమెప్పించెస
త్వరబాహాకుశలత్వమేర్పడఁగవిశ్వామిత్రమహామునీశ్వరున్॥ ౨౧.

ఉ॥ శ్రీవెలయంగనాత్మపదరేణులవంబులఁదోవ ఱాతి ల
జ్జావతిఁజేసిరాఘవుఁడుజంభవిభేదిసహస్రనేత్రిల
జ్జావతియైగనుంగొనఁగసానుజుఁడైమునిరాజసన్నుతు
ల్లావుకొనంగఁజొచ్చెమిథిలాపురిఁగౌశికువెంటనర్మిలిన్॥ ౨౨.

మ॥ గురునాచాదమనోజ్జ్వలన్నిటలదృక్కోడఁడమహాకేలదు
స్తరదోశ్శౌర్యశిఖిస్ఫురజ్జనకరాట్సంధాసువర్ణాతిభా
స్వరసంభూషితజానకీపరిణయోత్సాహంబునన్భార్గవా
దరణీయాధికతేజుఁడైప్రమదమందంజేసెసాకేతమున్॥ ౨౩.

శా॥ వాల్లభ్యంబుఘటింపఁదండ్రిపనుపవ్యాజప్రమోదంబునన్
విల్లుందమ్ముఁడుఁదోడుగాఁబెడలెనుర్వీజాతచిత్తంబురా
గిల్లంజేయుచురామభూవిభుఁడుసాకేతంబుసాకేతమై
యొల్లంబోవఁగఁజూచుపౌరసుజనవ్యూహంబులాహాయనన్॥ ౨౪.

చ॥ అపరిమితానురాగమనునాతరమిచ్చిగుహుండుపంపని
మ్నాపట్టకిరాతసూతియనిసావరవాహినినద్వితీయుఁడై
తపనకులప్రదీపకుఁడుదాఁటిదృఢవ్రతపాలితాత్ముఁడై
కృపమదిఁదోపఁబావలొసఁగెన్భరతున్పురికిన్మరల్చుచున్॥ ౨౫.

చ॥ ఒకపొలదిండితొయ్యలికినొయ్యననవ్వులనాసకోఁచియో
ఒకనదియిచ్చరానెదురుపెట్టుఖరప్రముఖాదితేయకం

టకవరబంధుజీవనధనంబఖిలంబుహరించి పల్లవా
ధికవరులీలఁ జెందివినుతింగనియెన్ రఘురాముఁడత్తఱిన్ ॥ ౨౬.

మ॥ కితవాచారముఁబూని పెద్దలయెడంగీడ్పాటు నొందించుదు
ర్మతిదానుం జెడునంత దాఁ జెడు నొకాగ్ర గ్గించు నాత్మీయసం
తతియన్మాటనిజంబు జేయుటకునో నాఁగూలెమారీచుఁడు
ద్ధతిహాలక్ష్మణయంచు రామమహీభృన్నారాచపాతంబునన్ ॥ ౨౭.

మ॥ అతులప్రాభవధామరామనృపపాదాంగుష్ఠసేవాగరి
ష్ఠతమైదుందుభియస్థికూటమెగిరాడంజొచ్చెఁ దద్బాణసం
గతమై తెంపువహించెఁ దాళములు పాకద్వేషిబాహాతిఘు
ర్ణితముల్గానసహాయముంబొరయసుగ్రీవాప్తబంధుల్ బలెన్ ॥ ౨౮.

శా॥ తారాపద్ధతియోగ్యసంచరణమాత్మంగోరునిందాత్మజుం
దారాపద్ధతియోగ్యసంచరణమందం జేసిసంప్రీతిమైఁ
దారాపద్ధతియోగ్యసంచరణమాత్మంగోరుసుగ్రీవునిన్
దారాపద్ధతియోగ్యసంచరణమందం జేసె రాముండిలన్ ॥ ౨౯.

సీ॥ దనుభవాధికబలధ్వంసనంబదియెంత యధికతమస్ఫూర్తి యణఁచు టెంత
తామసావలిఁబట్టి దండించుపనియెంత దివిజులకండలు దినుట యెంత
ప్రతివాహినీశగౌరవములోఁగొను టెంత గురుపలాశులఁ బడఁగొట్టు టెంత
పరసార్వభౌమసంపదలు గైకొను టెంత యధికదర్పకతేజమార్చు టెంత
యనుచునడచిరి పతిమౌళి నగచరులు । జిష్ణులు ప్రతాపులుద్దండశీలఘనులు సా
ధ్వసులుగుణోగ్రులు ప్రభంజనులితనవ। సంఖ్యనిధులు రావ్రికారచరులునగుట॥

క॥ ఈరీతిఁ జేరి వనచర । వీరులు దశకంఠకంఠవిదళనకలనా
ప్రారంభపచోజ్జృంభణ । రా రాముఁడు శరధిమదహరస్థితిఁ జూపెన్ ॥ ౩౦.

మ॥ మును పేరాఁకలిఁ దాటకాంగరుధిరంబుం గ్రోలి వెన్కన్సుబా
హునిమాంసంబు భుజించియంతనశనాయోదన్యలం బాసియు
న్మనముప్పొంగ ఖరాది రాక్షసుల కండల్మెక్కి జీర్ణింపకుం
డిననుప్పొంగడలిన్గపాయముగ నానెన్ రామబాణంబిలన్ ॥ ౩౧.

సీ॥ నానటద్భ్రుకుటిభృన్నఖరాయుధధ్వస్తదశకంఠబిరుదకేతనమనంగ
వనచరాకృష్టరావణబాహుపాలితవిజయాంగనామణివేణియనఁగ
బ్లవగకల్పితముక్తివివరిపాలోలవైశ్రవణనైవాహికాసనమనఁగ
బాపముఖాబద్ధపౌలస్త్యభూసమాక్రమణసోసూచితోరణమనఁగ

గపిగజవిపాటితోదన్వదుపరితలగ । తాసురేశసామ్రాజ్యలక్ష్మీసమగ్ర
కేళికావాసలంకాబ్జనాశమనఁగఁ । గట్టె సేతువు జానకీకాంతుఁడపుడు॥ ౩౩

క॥ దశముఖునినాకనిఁదునిమెన్ । దశరథతనయుండునిశితనారాచములన్
దశముఖులుసహస్రముఖులు । దశదిశలన్నిగుడియద్భుతస్థితిదోఁపన్॥ ౩౪

మ॥ దివిషన్నాథుఁడుజిష్ణుఁడై శిఖికడున్దేజస్వియై మిత్రసం
భవుఁడుద్దండభుజాగ్రుఁడై పిశితభుక్పాలుండునిర్జాతిశా
త్రవుఁడై యప్పతివాహినీశ్వరఘనస్థానీయుఁడై గాడ్పుగం
ధవహుండై ధనిశ్రీదుఁడై గిరిశుఁడుద్యద్భూతియై ముఁగలన్॥ ౩౫

క॥ నిచిచినుతింపఁగనిందాని । దులతోఁడంగూడిదశరథుఁడుగనుఁగొనను
జ్జ్వలకీర్తిరఘుప్రవరుం । డలఘుపరాక్రముఁడులక్ష్మణాగ్రజుఁడెలమిన్॥ ౩౬

మ॥ జలదంబున్నిరసించుక్రొమ్ముడిపయిన్సంపంగిపూదండలై
కళలందేఱుమెఱుంగుఁజెక్కులపయింగాశ్మీరపత్త్రంబులై
యలరుంగెంజిగిమోవియావకరసంబై మేనఁజెంగావియై
వెలయంగీలలువహ్నివెల్వడినబృథ్వీసంభవంగైకొనెన్॥ ౩౭

చ॥ సరసిజబాంధవుండుప్రభచంద్రుఁడుచంద్రికశబ్దమర్థమం
బరమువిభుత్వమంబుధియభంగతరంగములట్లునీవుమ
చ్చరితమునంటినిచ్చధ్రువుచాట్పుననున్నతిఁగాంచుమంచున
ప్పరమఁడురాఘవేశ్వరుఁడుపట్టముఁగట్టెఁగృపన్విభీషణున్॥ ౩౮

చ॥ గురుతరలీలలక్ష్మణునిఁగూడికుబేరరథాధిరూఢుఁడై
ధరణిజకెంతయున్మదిముదంబుఘటింపఁగబాల్ప్రియోక్తులన్
సరణినచింపుచున్ప్లవగనాథవిభీషణులంటివెంటరా
నురుగతినేగెరాఘవుఁడయోధ్యకుమంజులమార్గమధ్యకున్॥ ౩౯

మ॥ శమిరాడ్వర్గముపొల్లిసత్కరగతస్వర్గాపవర్గంబుడా
సీమహానర్గళవేదమంత్రములనాశీర్వాదముల్సేసిప
ట్టముఁగట్టెన్రఘురాముసద్గుణగణాఢ్యుప్రేమనేఁడాదిస
త్యములైమించుమనుక్తులంచుమఱిబ్రహ్మంబట్టఁగావేదముల్॥ ౪౦

## షష్ఠ్యంతములు.

క॥ ఏవంవిధగుణతతికిన్ । సేవకరక్షాతిదక్షసీతలమతికిన్
గోవిదవినుతాకృతికిన్ । బావనకరకృతికినాకుభవకృతకృతికిన్॥ ౧

క॥ ఘోరారాకారావిర్భవ । పారావారాభిమానభంజకశరవి

స్ఫారాచారాదృతికిఁ । దారాదారాపహప్రతాపోన్నతికిఁ॥ ౨.

క॥ శర్వాణీహితనుతికిఁ । గీర్వాణీకృతవిరోధినృపసమితికినం
తర్వాణీడ్యధృతికిఁగిం । కుర్వాణీభూతకీశకుంజరపతికిఁ॥ ౩.

క॥ శాఖామృగలేఖానుగ । రేఖాశుగదమితరిపుశరీరునకుఁ గుభుజా
శాఖాజయలేఖాకర । శాఖానఖరునకు విజయశరనికరునకుఁ॥ ౪.

క॥ ధారాధరవర్ణునకును । గారాసినికృత్తకుంభకర్ణునకుఁ శ్రీ
కారసదృక్కర్ణునకును । ధీరారిప్రాణవాతదృక్కర్ణునకుఁ॥ ౫.

క॥ శ్రితగాధేయునకు మహా । యతయతికులమౌళిమణిదృగాధేయునకుఁ
హతదైతేయునకుఁ బదా । నతకేకయజేయునకు వినయజేయునకుఁ॥ ౬.

క॥ నుతధామునకును బాణా । కృతసీతారామునకు నకించనరక్షా
చితవీక్షాపేక్షాసం । తతవరకరుణాభిరామునకు రామునకుఁ॥ ౭.

 కవివిషయికము. 

సీ॥ సకలసత్కవిపూజ్యసుకవిత్వసామ్రాజ్యనిర్వాహకుఁడు పెద్దపర్వతన్న
వివిధభాషావార్యవిరచనాచాతుర్యసర్వంకషుఁడు బోడిపర్వతన్న
వరపద్యదాకారవాచాచమత్కారనిరుపమమతిశాలి తిరుమలన్న
అవధానకృతిగర్భకవితాచ్ఛసందర్భకీర్తితప్రజ్ఞుండు కేశవన్న
తనకు నన్నలు గాఁగ నుదనరు గృష్ణ । రాయభూషణకులరామరాజతనయ
కేశవాత్మజపర్వతాధీశు వేంక । టాద్రి సేకావ్యమే నిత్తునంకితముగ॥

 కథాప్రారంభము. 

వ॥ ఇవ్విధంబున సకలగుణాభిరామునకు సీతారామునకు నంకితంబుగా నాయొన ర్పంబూనిన చంద్రాంగద చరిత్రంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన॥

నిషధాఖ్యపురవర్ణనము.

సీ॥ ఐరావణద్విపకృజ్జిఘ్నాసనహానుపమానదంతావళోత్కరంబు
అలఘువాతూలవత్యసహిష్ణుమానసజిత్వరత్వరజాతిసింధుజంబు
ప్రథితపుష్పకకల్పప్రహసమానానూనసముదగ్రతరవరస్యందనంబు
కేసరిడింభకక్లిబసోధనిరుపమాచరణవిక్రమదృప్తసైనికంబు
నగుచుఁ దగు నప్సరోజనతాగతాద । నర్తకీభానదాయకనాట్యనిలయ
నానటన్నటినూపురనవ్యచరణ । ఘట్టనంబైన నిషధాఖ్యపట్టణంబు॥ ౧.

సీ॥ జవజితపవనవైజయకేతురంగికమిందుపాణింధమహేమవరణ

మభ్రంలిహోదగ్రభూవిభ్రమసౌధంబుపరలోలుపవృపాలభాసితంబు
నాగేశయప్రియాభోగగేహముకోరకత్తారకోద్యానకలితశాఖి
ఉరరీకృతాధికామరపురీసఖ్యంబుపరిమరిమృజమనఃపండితంబు
రటదళిఘటాసముత్కటకటకటాహ । జటిలమదఝురీకృతనటీవిటఘటుత్వ
నటదహార్యదవార్యశుండాలజాల । మోదనంబగునప్పుటభేదనంబు॥

క॥ పురకాంతలకానులకున్ । సరిపడదనిబ్రహ్మయాకసమునారసివే
సరిదానిఁగుండలించిన । సరణిందివిమట్టియచటిసాలంబలరున్॥

మ॥ అలరున్బంగరుకోటయచ్చటననంతావాసకల్లోలినీ
జలసంక్షాళితపాదవక్త్రమగుచున్ సంత్యక్తవిద్వేషితా
కలనన్విష్ణుపదంబులోనవెడలంగానీకనెక్కొల్పిని
ర్మలభావంబునగాంచునార్యపురసామాన్యంబునైశ్వర్యమున్॥

తే. గీ॥ భూమినశ్రుతస్మృతదృష్టపూర్వమైన । బహుళసంపత్పరంపరబాదుకొనిన
గరి[illegible]నఁగోటమించఁగగణనకెక్కు । నందుపైనుంచునిలువారమనదివంబు॥

ఉ॥ ఎన్నికకెక్కనవ్వరమదేభముసెక్కితదీయసాలసం
ఛన్నమరుత్పురిన్ వెడలిసందడిసేనుఁగునెక్కిదిడ్డిదూ
రన్నునవ్వరేయనిపురందరుఁడప్పురిపెద్దవాకిట
న్గన్నపుఁగూటికైయరుగుసారెబహిస్థితయజ్ఞవాటికిన్॥

ఉ॥ ఆనగరంబునిర్మలవియన్ముకురంబునబింబితంబుగా
దానిసురాలయంబనుచుఁదన్నరులన్సురులంచుఁదన్మహీ
జానిఁబురందరుండనుచుసారెవచింతురుగానివానికీ
ల్గానకమెచ్చటన్నిరవలంబననుండునెయెట్టివేనియున్॥

చ॥ సరనిజసంభవుండుపురసారసగేహినికిన్ రచించన
చ్చెరువగునీలపుంగుబుపుజెక్కినమేలిపసిండిముద్దుటుం
గరమనమింటితోనాఅయికన్గనుపట్టెడుగోపురస్ఫుర
ద్గురుతరశాతకుంభరుచిగుంభితసాలమువీటమీటుగన్॥

చ॥ పగడపుఁగోత్తడంబుజిగిపాకవిరోధిశరాసనంబుగా
నిగరుపుఁగెంపుకొమ్మ నునునిగ్గుమెఱుంగుమెఱుంగుచాలుగాఁ
దగుహరినీలగోపురముతళ్కుఘనాఘనమైచెలంగనే
వగఁదలయెత్తిచూచుఁబురవప్రమునప్పరహంససంఘముల్॥

మ॥ అరుదారన్నిఖిలంబుఁదల్లికినిమున్నాస్యంబునంజూపుటల్

బరులెన్నన్గనరంచుఁదండఱకుఁజూపన్ గృష్ణుఁడుద్యుక్తుఁడై
వురదంభంబుననిల్చిదాఁదెఱచువిప్పంగొప్పనెమ్మోమనన్
వరణంబొప్పసమస్తవస్తువులలోనన్నిండిగన్పట్టుటన్॥ ౧౦.

## సౌధవర్ణనము.

పరిఖాంభోనిధిలక్ష్యమాణపురసౌభాగ్యంబుమించున్మహా
త్తరసౌధాగ్రవిలాసినీవదనచంద్రద్రావితేందూపలో
త్కరసాలామృతకూలముద్రుజవియద్గంగాతరంగాహతిన్
దరులుర్లంబడికెల్లగిల్లిపడునానాకంబుచందంబునన్॥ ౧౧.
రమమాణామరయూధనాథకటనిర్యద్దానగంధానుబం
ధమరుత్పట్టణసాలమెంతయునుగిన్కన్ దత్పురీమత్తనా
గములొక్కుమ్మడిఁగ్రుమ్మపీఁగునెడనాగఁబూన్చుబలోప్పటికం
బములోనావిలసిల్లుసౌధములవాప్తస్వర్గసంసర్గతన్॥ ౧౨.
పరబలభీకరంబగునపారసముద్ధతిగాంచివజ్రిగ్రైయై
పురవరణంబుమూఁడుజగముల్ గయికొన్నమహాభయమ్మునన్
గరకరిమానియొక్కటడొకారముఁజొచ్చుమహాద్రులోయన
న్నిరుపమలీలసౌధములనేకములుల్లసిలున్పురంబునన్॥ ౧౩.
తలతలపారుపత్యములఁదద్దయుమించెగిరీశుజెంగట
న్నిలువఁగనంచునెంచియతనిన్విడనాడితనున్భజించుద
త్కళలవహించెనొక్కతలగాననమేడరహించుజాళువా
కలశముచుట్టుజెక్కినచొకాటపుముత్తెపురేకులప్పరిన్॥ ౧౪.
అక్కటదిక్కులేమిరజతాచలమొక్కఁడుపెల్లగించెవే
ఱొక్కఁడువంచెమేరువటియొక్కఁడువింధ్యమునేలఁబాచెయొం
డొక్కఁడుదూపునన్గైశపె నుక్కునఁగ్రౌంచమునంచునప్పురి
న్డుక్కినగట్లయోజనగడున్నవరత్నవినూత్నసౌధముల్॥ ౧౫.
జతనన్ దత్పురిజంభభిన్నగరమున్ సాధింపఁగాఁగోరియో
ప్పితముల్ చేకుఱనెత్తుబల్మకరబిబ్బిలోయనన్మించునం
చితశక్రోపలసౌధజాలములపైజీమూతసంఘాతము
ద్ధతిమైనెత్తినయెత్తురాలగమిచందంబందిఁజెంపొందఁగన్॥ ౧౬.
పురసౌధోన్నతసేతుఘట్టనలనంభోజారిపద్మాప్తులం
దిరపైకప్పదలిర్పఁబద్మవదనల్ హేలాగతిన్మిత్రుఁడం

చురవిన్గుంకుమునింపఁగానరుణుఁడైజాపట్టెఁగాదేనిభా
స్కరబింబంబునఁగందుజెందునెగడా జాబిల్లియందున్నలే॥ ౧౬.



## విప్రవర్ణనము.

సీ॥ విషమదర్శనవృత్తిపీడుసర్వజ్ఞులుకావ్యచాతురిమెచ్చుఁగాంచుబుధులు
కలయుక్తివాదించఁగలచతుగాననుల్పరమంత్రములకాసపడనిగురులు
శ్రోతసంపదమించఁజాలుమహాశయుల్ఘనశబ్దవిస్ఫూర్తిఁదనరుకవులు
జ్యోతిర్వరస్ఫూర్తిసాగరయుకళాధరుల్సదలంకృతిఘటించిపాడలుసూరు
లుర్విపళితాపశబ్దములుజ్జగించి।సభఁజరించుసరస్వతీవిభులుదలఁప
దృఢతరబ్రహ్మవిజ్ఞానధీప్రవరులు । విషమురగవిప్రవరులుదద్విప్రవరులు॥ ౧౭.

సీ॥ కనివైచుటయెకానికఁజాతసంభవుండుద్ధరించుటకునైయోపఁడయ్యె
నుద్ధరించుటెకానియుదధిరాజశయానుఁడునికినిచ్చుటకుఁబెంపూనఁడయ్యె
నునికినిచ్చుటెకానివనజాతబాంధవుండేరుపాటొనరింపనేరఁడయ్యె
నేర్పరించుటెకానియిలఁబరాశరసూతియుష్టార్థవిస్ఫూర్తులియ్యఁడయ్యె
వెలయననితమ్ముఁజెందినవేదములకు । సకలశాస్త్రరహస్యభాస్వన్నిరూఢిఁ
బ్రభుతఁగల్పించిదక్ష్క్రియాపరతనెఱపి।సురులమెప్పింతురచ్చటిధరణిసురులు॥



## క్షత్రియవర్ణనము.

సీ॥ కమ్మియొంటిరిగానిదొమ్మినొంచుయశంబువైటిపల్లెలుగూల్చుబలిమికలిమి
అనిఁబారుపోతురొతునడంచికొనుగెల్చుపాలపాపనిఁదాఁచుప్రాభవంబు
సూనాస్త్రిఁదెగటారఁజూచినవిక్రమంబంధకుఁదునుముబాహాతిశయము
బొడ్డుపీడనిబిడ్డపునుకఁదొంచినలావుమొగపుఁగేల్దానిపైఁదెగినపెంపు
మహినినక్షత్రవరశిఖామణితఁదెలుప । రాజశేఖరనామమర్థంబెతనకు
ననుచునగునిండుమగఁటిమిహరుననింద్య। జన్యసమితియప్పరమురాజన్యసమితి॥

సీ॥ ఒకనిచేదబ్బఱకొడిగట్టిగురులఁజంపించినధర్మజుపెంపురోసి
యొకనిమాటునవైరినుక్కణంగించిన నరుశౌర్యమెన్నఁగన్నడయొనర్చి
యొకనితోఁబెనఁగనోపకభంగమొందినవడముడిసత్వంబుగుదుసుపఱచి
యొకటిచ్చిలోనవేఱొకటిఁగోరినయట్టికానీనుగర్వంబుఁగాఁడుఁజేసి
యహతధర్మనిరతియసహాయశౌర్యమ । హిమయభంగబలసమృద్ధియసమ
దాతృతానిరూఢిఁదాల్తురప్పరిమహా । క్షత్రవరులువిబుధకల్పతరులు॥ ౨౧.



## వైశ్యవర్ణనము.

క॥ వినువానికసహ్యంబై । కనఁబడిననిధానసంఖ్యగలగర్వమునకా
ధనపతిననుకొన్నకుచే । రునసంఖ్యానిధుల్హసింతురుపురీవైశ్యుల్॥ ౨౨.

సీ॥ ఇల్లుమంచము లేకవెల్లిపైఁ దేలాడ శ్రీనాథుఁ డౌట వానింప నేల
కడబిచ్చు మిత్తుకకడ్డుపుఁ బోసికొనంగ నైశ్వర్యవంతుఁ డౌటడుగ నేల
తిరిపెంపుఁ గౌఱగంటిదొర పంచవసియింప ద్రవిణాధిపతియౌటఁ దడవ నేల
యప్పులవార్మొచియడ్డగింపులనుండ సిరిఁ గన్నవాఁ డౌటఁ జెప్ప నేల
ననుచుఁ బకపకఁ బ్రహసించు నతులమహిమ । హరిహరకుబేరనిమ్నగావరుల నెప్పు
డొచ్చములు లేనిసంపదనుల్లసిల్లి । పీటవిహరించు మేటి కిరాటకోటి॥ ౨౩.

### ✻హాలికవర్ణనము.✻

మ॥ బలిచూడామణితంత్రివియ్యముదలంపన్లచ్చిఁ గన్నయ్యని
ర్మలతోఁ బుట్టినవాలుఁ గంటియన సర్వజ్ఞావతంసంబుని
శ్చలదానైకధురంధరుండు బుధరక్షాదక్షుఁ డల్లుండు ధ
న్యులుగా రే పురిహాలికప్రవరులెందున్వర్ణనాపాత్రముల్॥ ౨౪.
చ॥ అలవిబుధాలయాహిపనిలయంబుల నెప్పుడుఁ దోడఁ బుట్టువు
ల్దలకొనియుండఁ గాగరిసెలన్గణజంబుల కెత్తరామిచే
నిలిచినకుప్ప కావలికి నిల్పుదురప్పురిఁ గొంగుబత్తెపుం
గొలువునకీయుకొల్పి హలికుల్పికిరంబు బొసంగు వేలుపుల్॥ ౨౫.

### ✻చాతుర్వర్ణవర్ణనము.✻

మ॥ హరిభక్తుల్ద్విజులొందనందచలధర్మారూఢి సర్వజ్ఞతన్
ధరభూపాలురు గాంతురయ్యరిపురధ్వంసస్థితిన్ రాజశే
ఖరతన్ వైశ్యులు నాత్మభూతిపరతన్గా బేరసఖ్యంబుఁ దా
ల్తురు దామేరువహించుటన్హాలికులెంతో గాంతురైశ్వర్యముల్॥

### ✻గజవర్ణనము.✻

సీ॥ పాకమర్దనలీలఁ బాల్పడి విహరించి యాశ్రయాశవిహారమధిగమించి
సహజపంగుక్షయోత్సవకారియై మించి యసురహితోద్వృత్తి నాక్రమించి
ఘనసంచలనదీనకటకోద్ధతి మదించి కడుమహాబలపరాక్రమముఁ గాంచి
కదిసియక్షమహీనపదముఁ దొక్కి చరించి యంధకహరకేళి నాశ్రయించి
తనరు నాశాగజంబులఁ దలఁచి తలఁచి । వమథుకైతవమున రోసియుమియు దెసల
బలవదరివీరదుర్వారబలనికార । కారణమ్ములు దత్పురీవారణములు॥ ౨౭.
మ॥ పరిఖావారిధిమేరమీఱితమముంపన్ధారుణిన్దాల్పదు
స్తరమంచున్రవిమధ్యవర్తియగునాసర్వంసహాభర్తకున్

హరికొప్పింపఁగ వచ్చు దిగ్గజములో నాభాను పాణింధమో
పరిభాగస్థపరాగము ల్వెలయఁగ న్వట్టున్ఖురీనాగముల్ ॥ ౨౮.



## తురగవర్ణనము.

మ॥ అకటా తమ్ముల కాలివేగమున డాయన్లేని పక్షీంద్రుకా
లికిలోనా మిడినాగుకూనలకు జాలింబొందు గాలిన్గకా
పికలై వచ్చు మనోజభల్లములకు న్భీతిల్లు చిత్తంబు సా
టికి రానేర వె హేమ పేరఁ బురఘోటీ ఘోటకవ్రాతముల్ ॥ ౨౯.

చ॥ ప్రముదిత సాదివిభ్రమిత పాణికృపాణియునాతపత్రదం
డము బిగియన్గ ఢన్నడుమ నాఁటిన గూటములై తగన్నగం
టిమి వడి వేడెముల్గొడుగునీడల సల్పున రాతిజాతి ధై
ర్యము పొడిగా వెసన్విసరునట్టి ఖురట్టములై పురాశ్వముల్ ॥ ౩౦.

చ॥ తలఁపున కన్న మున్నఁ ద్వరితంబుగ నేగితి మేని మమ్ము సా
దులుగడు వెక్కసంబులని దూరక మానరు వారు దూరుట
ల్దలఁచి తలంపులోన న మెలంగినఁ గ్రుంగ దొకో మనోజయో
జ్జ్వల బిరుదంబు టంచుఁ దలవంపులఁ ద్రవ్వికొనున్ఖురాశ్వముల్ ॥ ౩౧.



## వారనారీవర్ణనము.

సీ॥ గళలిప్తకస్తూరికా రేఖలౌరిజలు నును వెక్కలజవాది మొనపు మదము
వ్రేలుఁ గొప్పులు నల్లవిడిపట్టు గద్దియల్ హారమ్ములలఁతి పోలా నిగంటు
లలరు నంఘ్రులఁ బైడిగొలుసులు బారీలు నెమ్మేని కొమ్రించు నిండుజాజు
పక్కలెత్తిన గోటిపసలు సిబ్బెపుఁ బొడల్ భ్రమరకంబులు మొగరంబములును
గానభంగశృంగార సంగతులఁ గతులఁ । గది సిసరసులయంతరంగములు గలఁచి
యంగసంభవు మదపు టేనుంగులనఁగ । వఱలు దురువీటఁ బణ్యాలావణ్యవతులు ॥

ఉ॥ హెచ్చిన బొమ్మఱిండ్లఁ గదియించిన చూపుల కోరికోలల
న్మెచ్చు ముదుంగ నేయుచుఁ జనుంగవ దుర్గము క్రింది సీమల
న్బచ్చని వింటిబోయదొర పంపునఁ దెంపునఁ బాంథకోటుల
న్గచ్చెలపట్టున న్దెరువుఁ గొట్టు దురప్పురి వారభామినుల్ ॥ ౩౩.



## పుష్పలావికావర్ణనము.

సీ॥ కైదండనొసఁగ లెక్కలు నేసి పలికెదు కైదండ నీదు లెక్కలకు రాదు
చనుగుత్తులూరకగనుఁగొనఁ దివియేదు చనుగుత్తులూరక గనఁదరంబె
వను నెత్తుకొను వేడ్క నైన సీమాటాడెదు నను నెత్తుకొను వేడ్క నైన యవశమె

నారదచ్ఛదము నానఁగఁ జాలఁగొ సరెదు నారదచ్ఛదము నానంగ నసదె
యనుచుఁ దరితీపుఁ జెనుచు నెయ్యంబునినుచు। కలికిపలుకులు నేర్పులుగులుకరింపఁ
బలుకుదురు పల్లవులతోడఁ దళుకునగవు। వెన్నెలదలిర్పఁ బుప్పలావికలు వీట॥

చ॥ పలువరుసల్గ నంబడన పారచమత్కృతినారదచ్ఛదం
బలికుచ గ్రుచ్చియెత్తులిడు మన్ననుటక్కులవన్నెకాఁడ వై
కలయ మెలంగు బల్సొగసుకానికి నెత్తులు వెట్టలేము జా
ణలకడ కేగుమంచు విటునవ్వుదురప్పరిపుప్పలావికల్॥ ౩౫.

చ॥ పొలుపగు సౌరభాతిశయము న్గడు శైత్యము నేటిచంద్రమం
డలమున కెట్టుగల్గె చెలి నా కెఱుఁగింపుమటన్న వానిపైఁ
గలవలపింత నే సెననఁ గా నది గాదు నిమిత్తమీవయిం
దులకనగట్టు వాల్చెలికనుంగవ నవ్వు విటోక్తి చాతురిన్॥ ౩౬.

## ఉద్యానవర్ణనము.

సీ॥ కలకంఠసముదాయములకు భోజనశాల జగహజారంబు వసంతమునకు
నష్టాలయాసూతికాయుధాగారంబు గరిడిమందసమీరకాండమునకు
నళిపోతసమితికి నాపానసదనంబు సంకేతభవనంబు శైత్యమునకు
శుకముఖద్విజరాజులకు ధర్మసత్రము నృత్యగేహము బర్హినికరమునకు
మానినీజాతసంజాయమానమాన। దానకలనాధురీణవచోనిదాన
శారికానూనవివిధచేష్టావితాన। జీవనంబన దగుఁ దత్పురీవనంబు॥ ౩౭.

సీ॥ మదనాశుగవికాసకృదనాహతవిలాస సదనానిలసమాస సాలవాస
మతివేలమధుపూరశ్రుతివేగసముదారరుతిపేదిపికవారయుతమయూర
మమితారిసముదాయనమితాంబుజనికాయగమితాసవనమేయవిమలతోయ
మసమాంచితపరాగరసమానమహిమభాగసమానలీలాగభసలపూగ
మహిమకరకరనికరదురధిగమనిజ। ధరణిజకుసుమవిసరజపరిమళపరి
మిళితనవసుమామోదితామలసురాగ।నందనం బొప్పుఁ దత్పురీనందనంబు॥ ౩౮.

## సస్యవర్ణనము.

చ॥ కనుఁగొనన య్యోఁబండి యొఱఁగుఁ [illegible] డెడు రాజనంబుచ
య్యనహాలికుల్గమక్క గనినయట్టి [illegible] దర్థమై
ఖననముఁ జేయఁజూచెదరు గాయనియాంతరశైరవాళిసం
జనితమరందబాష్పములు జాఱఁగ మూర్ఛిలివ్రాలు శైవడిన్॥ ౩౯



### మరుద్బాలజాలవర్ణనము.

మ॥ తళుకున్బ్రొద్దువెలుంగుక్రొంబసిఁడినిద్దాచోపుడుంగట్టియర్
గొలఁకున్స్నామరముగ్గకట్టువలుజిక్కుల్వాపివేఁదేఁటిమే
ల్వాలపుంబిట్టలవేఁటలాడుఁగడు తేవందత్పురారామ రే
ఖలలేఁగాడుపుబోయతేఁటిజలుడేగన్బట్టితావేకువన్॥ ౪౦.

సీ॥ పరువంపువిరితోఁటబయలుచిప్పిలిరాలఁబుప్పొళ్లవెన్నెలకుప్పలాడి
కొదమతుమ్మెదగుంపురొదలచేఁదెలితేనెచెమటగ్రమ్మఁగఁబాఱిచిడుగుడాడి
తొగటాచలుపమేడమగటాకొణిఁగెలోవఁబలకలజీరుకుబండలాడి
పచ్చటాజినుఁగుఁగ్రొంబనులసోరణగండ్లబుడిబుడిఁబొదలిదూబూచులాడి
యలసిబడలికఁగడుదూబఁబడిప్రభాత। సమయరతితాంతకాంతాకుచప్రరోహ
కలితకర్పూరశీతలఘర్మవారిఁ। గ్రోలిమెలఁగుమరుద్బాలజాలమచట॥ ౪౧.

సీ॥ ఆత్మీయజవసైంధవానాసమనుచునోసఖులనైమ్మొకములచక్కినరసి
తెగునిజార్వాకర్షమృగతృష్ణలనుచునోయువతులనఖముఖద్యుతులఁదడవి
యాత్మపోషితమహోహయబృందమనుచునోకాంతలవెడఁదకన్గవలనెమకి
సాపాశ్వమదగంధసంపన్నమనుచునోనవలాలచనుదోయిఁదవిలివెదకి
యచటఁజనతేజియునికిఁదానెఱుఁగకలసి। మఱియుమఱియునునరయునెమ్మనముకలిమి
నలరుటంగడిబయలనయ్యాలఁతదీఅ। మెల్ల మెల్లనఁదిరుగుసమీరణుండు॥ ౪౨.

సీ॥ అచ్చటిబహుకళావ్యాఖ్యాతలకువాచకులుదేవగురుముఖ్యకుశలబుద్ధు
లచ్చటికవివరేణ్యశ్రేణికినిలేఖకులుదేవతాకవికుంజరంబు
లచ్చటిసరసగాయకులకుశ్రుతిదాయకులుసారవైణికకులిశపాణు
లచ్చటివిరుదులనలరుపాత్రములకుదృష్టిపాత్రంబులుదివ్యవనిత
లచటిమదపుటేనుంగులకమరకరటి। యెత్తుగున్నయచటనున్నయుత్తమాశ్వ
ములకునేరాదిలేఖరక్షభునితురంగ। మనఁగసురపురిదత్పురంబునకుసరియె॥ ౪౩.



### రాజవర్ణనము.

క॥ ఆపురమేలునిజాహవ। భూపతితరిపుక్షమావిభుద్విగుణితసే
నాపరిపాలనతుష్టశ। చీపతిసుతదానుఁడింద్రసేనుఁడుపేర్మిన్॥ ౪౪.

సీ॥ పాదాంగదముదుష్టపరిపంథినృపవచోవాచాలబలచక్రవాళధరము
పమ్మకాటుకకరాటమ్మఘోరారికుక్షిత్రిసంభృతరోదసీతలమ్ము
కుంకుమగంధంబుకుటిలశాత్రవఘర్మసలిలపంకిలరత్నసానురజము
మౌక్తికహారంబుమదవైరియువతినిశ్వాసనోద్ధహిమనగస్థలహిమాని

తళుకుజిగికెంపుబటువుప్రత్యర్థిభిన్న । మధ్యరుచిచండమార్తాండమండలంబు
తనవిమలకీర్తికాంత్మకునగమించు।నతఁడుసౌందర్యనలుఁడువిఖ్యాతబలుఁడు॥
సీ॥ తనప్రతాపాగ్నికిఁదరుణాంబురుహబంధుబింబంబువిస్ఫులింగంబుగాఁగఁ
దనదానసముదగ్రవననిధానమునకునలినారిఫేనఖండంబుగాఁగఁ
దనకీర్తివల్లీమతల్లికిసురభూరుహంబులుతొక్కనయంట్లుగాఁగఁ
దనబలోద్ధతరేణుతమమునకబ్జజాండములుఖద్యోతకీటములుగాఁగఁ
దనభుజాశాఖకాసముద్రపరివేష్టి । తాఖిలావనిమండలమగ్రదళము
గాఁగఁజెలువొందునత్యుగ్రకదనవిజిత।పరమహీపాళియానరపాలమౌళి॥౪౬.
సీ॥ తనదానజలధారఘనకీర్తివల్లికాబృందంబులనుబోదిఁబెనుపుచుండఁ
దనసమిత్పటిమకందళితప్రతాపాగ్నికీలలుగడువెలుంగింపుచుండఁ
దనకళావిస్ఫూర్తియనవద్యసుమనఃపరంపరలకునింపునింపుచుండఁ
దనకృపాదర్శనంబనఘూర్తరక్షణరాద్ధాంతిమొకటియేర్పరపుచుండ
వనధివేష్టితనిఖిలోర్వింఁదనదుశాస । నముశిలాశాసనంబయియమరుచుండ
నాదిరాజన్యచరితంబునతిశయింపఁ।బూనివిహరించునాయింద్రసేననృపతి॥౪౭.
మ॥ భళిరేమాకిపుడైననిందడుగుమోపంగఁ గ్గెనంచున్నిలిం
పులుమెచ్చంగఁగఘోరనిష్ఠురఖురోద్ధూతక్షమాధూళిమి
న్నలమన్ దాడిగనేగిమూఁగినయమర్త్యారాతులంద్రుంచిచే
తులగండూలియడంచియాతఁడిడుబంధుశ్రేణికామోదమున్॥ ౪౮.
క॥ వానలముఁదక్కనమ్ముల । వానలునిగుడింపనవనివారింపఁగలే
వానలతయనీకోపడ । వానలమనిపూరిఁగఅతురరులౌరారా॥ ౪౯.
సీ॥ చుట్టుఁగంపయెకానిచెట్టుఁగాఁవెఱతురుపట్టైనకోటలుపాటిమగలు
లేమట్టికుల్లాయలేకానిమకుటముల్బూనఁగాఁవెఱతురుపూన్కిమెఱసి
తరలిరమ్మనినచేతమకొక్కటియెకానిపేర్కొనవెఱతురుపెదడమామి
నలువొందహరికీర్తనలెకానిబిరుదంబుఁగొలువునఁబొగడించుకొనఁగవెఱతు
రహహకుకురుకుంతలకోసలాంగవంగ । భోజకరహాటగౌళకర్ణాటలాట
మగధనేపాళచోళాదిమనుజవరులు।క్షితినిబాలింపనాయింద్రసేననృపతి॥౫౦.

## ఇంద్రసేనుఁడుతనయాభికాంక్షందనసతితోఁదెల్పుట.

క॥ విమలయశుఁడతఁడుతనచి । త్తమునన్దనయాభికాంక్షదనరఁగనొకనాఁ
డుముదంబుననిజసతియగు। కమలాకమలాయతాక్షిఁగనుఁగొనిపలికెన్॥౫౧.

ఉ॥ అంచలు లేనితమ్మిగతి నబ్జిని లేనికొలంకురీతి న
భ్యంచితనీరజాకరసమగ్రత లేనివనంబుభాతి నో
క్కించుక రైనఁ జూడఁగ రహించదు మామకరాజ్యలక్ష్మి మో
దించదు మానసంబు గణుతింపఁగఁ బుత్రులు లేక యుండుటన్॥ ౫౨.

సీ॥ ముద్దు లేపాపని మూర్ధమాఘ్రాణంబు జేసి చొక్కని ముక్కు చిలుకముక్కు
తను వెల్లఁ జల్లగాఁ దనయుని నక్కునఁ బొదువని చేతులు మదనచేతు
లనయంబుఁ బుత్రుతిన్ననితొక్కుపల్కులాలింపని చెవులు రాట్నంపుఁ జెవులు
మొనగాళ్ళ నెక్కించుకొని తనూసంభవుఁ బ్రేమనూఁపని కాళ్ళు పిట్టకాళ్ళు
కొమరుఁ బిల్వని యలపల్కు కొండపల్కు। పట్టిఁ జూడనినును గ్రుడ్లు పెట్టుగ్రుడ్లు
గాననిక్కము సంతానహీనుఁ డైన। వానిబ్రతుకప్రయోజనమోను తాంగి॥ ౫౩.

సీ॥ ఆనందవాసనానూనసంపదలకుఁ బరువంపువిరితోఁట పట్టిమాట
భవబంధసంప్రాప్తపరితాపమార్పఁగాఁ బన్నీటి క్రేఁదేట పట్టిమాట
బంధురప్రేమానుబంధలక్ష్మికిఁ బెట్టు పసిఁడిముక్కలిపీఁట పట్టిమాట
తలిదండ్రులకు ముచ్చటలు దీర్చుకొఱకుఁ గాఁ బరగ నిల్చినమాట పట్టిమాట
చిట్టకపుముద్దులకు పేఁట పట్టిమాట। యుట్టిపడు తేనియలయూఁట పట్టిమాట
పలుకుఁ దెలికప్పురపుమూట పట్టిమాట। పలుకుఁ జెలిచొక్కటపుఁ బాట పట్టిమాట॥

ఉ॥ ధర నేనోములు నోఁచిన న్వరుస నేదానంబు లీఁజాలినన్
హరిసేవారతి లేనివానికకటా యాభాగ్యమే లబ్బెడిన్
మరుభూభాగమునన్వి పాసయడఁగింపఁబూని యేయత్నమున్
బరగన్ జేసిన నీళ్ళు పుట్టునె నదీప్రాంతంబునన్ దక్కఁగన్॥ ౫౫.

చ॥ బలికి మణీకిరీటము, సుపర్వులకున్న డతోవ్రివ, శూలికి
న్జలకము బిందె, మానిజననాథునికాంతకు జీవనౌషధం
బలఘుతరంబు నెద్ది యది యాశ్రితకల్పక మస్మదీయ వాం
ఛలు ఫలియింపఁ జేయదె వెసన్మనమున్మనమిచ్చి కొల్చినన్॥ ౫౬.

సీ॥ కరతలామలకంబు కైవల్యసంపద యింటఁ జేరిన పంట యీప్సితంబు
తలఁ బ్రాలు బోసిన తన్వంగి జయలక్ష్మి యలకండ విత్తు వంశాంకురంబు
డాచఁ బెట్టినసొమ్ము దాయ లేలెదు భూమి పాయని జోడు సౌభాగ్యగరిమ
యొడగట్టిన దూలమీఁదు లేని శుభంబు చేకొద్దికుంచ మశేషభూతి
నిగుడు నాయువు తోడఁకనినిండుకుండ। పేరుకొన్నవివేకంబు పేరుబలఁగ
మురుతర సమగ్రవైభవంబూఁట చెలమ। హరిపదారాధనైకతత్పరులకబల॥ ౫౭.

సీ॥ ఘోరాఘసముదయక్రూరపన్నగహరిస్యందనంబు, ముకుందవందనంబు
సంసారపరిఖేదసంతప్తజనసుధాస్యందనంబు, ముకుందవందనంబు
తతదురాశాపదాదందహ్యమానాత్మచందనంబు, ముకుందవందనంబు
మౌనిసంఘాభీష్టదానకళాహరిచందనంబు, ముకుందవందనంబు
నళినభవముఖదేవమాన్యసమిళింద । నందనంబు, ముకుందనివందనంబు
ఘనతరాంతరరిపువర్గకలభపంచ । వదననందనంబు,ముకుందవందనంబు॥ ౫౮.
క॥ అటుగావునమనమిపుడో । కుటిలాలకయమ్మురారిఁగొలిచితదీయ
స్ఫుటతరకరుణాలోకన । పటిమన్పుత్రకుని గాంచిబ్రతుకుదమనుచున్ ॥ ౫౯.

## విష్ణ్వర్చనాభివర్ణనము.

సీ॥ భూభారభరణసంభుగ్నశయ్యాశేషఫణినిపాతాశంకిభావభయము
పర్యంకజలధిసంభవదద్రిసమఘుమంఘుమితభంగాహతిక్షోభనఁబు
కీలికీలాతప్తకిరణజాజ్వల్యమానారుణావాసతాపానలంబు
ప్రళయవాత్యావేగపరిలుఠద్వటపత్రకుత్సితశయనసంకోచితంబు
చందనానందరసమాకరందపూర । పూరితాత్మీయమానసాంభోజసీమ
సుఖవసతిఁగూర్పుహరికివిశుంభదరికిఁ। బూనిసద్భక్తినాయింద్రసేననృపతి॥ ౬౦.
సీ॥ పాలమున్నీటిలోపలనీఁదులాడఁగానవయవంబులఁ జేరునట్టిజిడ్డు
పవళించుతఱిఁనైనఫణిరాజవిషవహ్నితప్తఫూత్కారసంతాపగరిమ
సన్నుతింపుచుఁ జేరుజటివరేణ్యులనోటిబంపుకంపునసెగఁబాఁకుపెగటు
అతిరిక్తతాసక్తులగుభక్తులొసఁగినయుప్పచప్పనితిండినాదవునరుచి
నడఁచుశీతలహిమసలిలాభిషేక । చందనాలేపధూపమృష్టప్రశస్త
భక్ష్యభోజ్యోపహారసంప్రాపణమున । శత్రుసమవర్తియారాజచక్రవర్తి॥ ౬౧
మ॥ తనరంబోటును పాటులేనిఘనముక్తామంటపాంభోధిభూ
జనసేత్రాబ్జతపఃఫలంబయినభాస్వద్వజ్రసింహాసనం
బనుపేరందగు తెల్లదీవిఁగమలాప్రాణేశ్వరున్నిల్పి యం
గనయుందానుభజించునెప్పుడుమహీకాంతుండునిశ్చింతుఁడై॥ ౬౨.
సీ॥ భక్ష్యాదికనిభక్తపద్మాక్షునైవేద్యకాలఘంటాఘణంఘణరవంబు
ప్రతిదినాగతభాగవతభోజనాహ్వానచణభేరికాధణంధణరవంబు
నతిథిపూజార్ఘ్యపాద్యపయఃప్రవాహాసంభ్రమసంభవద్ఝుమంఘుమరవంబు
హరిమతసంస్థాపకాచార్యవిజయసన్నిహితమర్దళధిమింధిమిరవంబు
సొక్కముగఁగూడిమిన్నందెనుదుటుమీఱి । యర్హజన్మకుతూహలాహమికబో

నాన్న పాలక శేఖరుఁడలవరించు। జలధిశయన సేవామహోత్సవమునందు॥ ౬౩.

మ॥ హరి నామాంకితు లెవ్వ రెవ్వరుత దేకాయత్త చిత్తుల్గదా
ధరపాదార్చకు లెవ్వ రెవ్వరుత దుద్యద్భక్తియుక్తుల్సితాం
బురుహాక్షాశ్రితు లెవ్వ రెవ్వరుత దాప్తుల్వారిచుట్టాలుత
ద్విరసుల్మత్రుజనంబులా వసుమతీబృందారకస్వామికిన్॥

మ॥ హరిఁబూజింపఁగఁదత్కథల్వినఁదదీయాంగంబువీక్షింపఁద
చ్చరణధ్యాన మొనర్పఁదత్కృతిఁబఠింపం దత్ప్రసూనౌఘమం
జరిఁజేర్పన్గరముల్ చెవుల్నయనముల్ స్వాంతంబు జిహ్వాగ్రముక్
శిరము న్బాల్పడు సంతతంబు పతికిం జేకూర్పఁగాఁగోర్కులన్॥ ౬౫

క॥ నృపమాళితదేకధ్యా। నపరాయణబుద్ధి నొక్కనాఁడుండిరమా
ధిపుఁడు గృపన్నిజవాంఛిత। మొసఁగినయట్టులైననబ్బురపడుచున్॥ ౬౬.

## ఇంద్రసేనుఁడు మనోభీష్టసంసిద్ధిన్గనకాంతతో నుడువుట.

మ॥ తనువెల్లన్పులకింపఁగంఠమున గాద్గద్యంబు బాష్పింపఁ, లో
చనయుగ్మంబుల సమ్మదాశ్రుకణముల్సంధింపఁ, ఫాలస్థలం
బున బద్ధాంజలి సొంపునింపఁ, మదినంభోజాక్షుసాక్షాత్కృతిం
గని మోదింపఁ, సముత్థితుండగుచు పేడ్కన్గాంతతో నిట్లనున్॥ ౬౭.

గీ॥ అతివ వినుపింతువిను మొక్కయద్భుతంబు। మామకసుతాభివాంఛాలతామతల్లి
వేగఫలియింపఁగాఁజేయ వేయటంచు। నురగశయనునిఁజింతింపుచున్నయంత॥

## సాక్షాత్కరించిన విష్ణువర్ణనము.

సీ॥ వలుదపొక్కిలితమ్మినలు మొగంబుల వేల్పుతోలుబల్కు కైవారములు నుతింపఁ
గడలిరాయనిపట్టి యెడఁదమానికపుగద్దియనుండి నతులనారయఁగఁదెలుప
మనవంగడపుఁబెద్దలనయంబుఁదనకు నేత్రంబులై దయకుఁబాత్రములు గాఁగ
జడిదంపుఁబాపరాపడగ పానుపు టింటియండఁబాయక కయిదండ యొసఁగఁ
దళుకుఁబుత్తడియను సుబెత్తంబు కట్టెఁ। బట్టి సేనాధిపతి బరాబరులు సేయ
ముదముదైవారముప్పదిమూడుకోట్ల। మింటితెరువరిమూఁకలు నంటికొలువ॥ ౬౮

సీ॥ నలువుగాఁబులుఁగురాబలుగుతానిదువాళిదోలువాఁడభయంబు కేలువాఁడు
చెలువుగానలువుగా దలువగా యెనటంచు మెచ్చువాఁడన్నింట హెచ్చువాఁడు
నీటుగాఁగరమమానికపుమాటున మాటుమచ్చవాఁడిడుమానిరచ్చవాఁడు
వెలయఁగాఁజెలిమిచేఁగలిమి చేడియ యొక్కనురమువాఁడు దిరియంబరమువాఁడు
పొడు గుపదుగును గాంచినయడుగువాడు। బిడుగుబడుగున రిపునాంచనుడుగువాడు

చెఱుగులుడుగునట్లుగనమ్మున్నదోడుగువాఁడుబడుగువడుగురూపునబలినడుగువాఁడు
సీ॥ కరశాఖలజనించువరవృష్పతరుణపత్త్రములునాశంఖచక్రములుదనర
గొనబుమైనిండఁబర్వినకౌస్తుభచ్ఛాయవడువుననపరంజివలువజెలఁగ
బహిరీక్షితాంతఃకృపారసస్థిమితశైవాలంబుమాడ్కిఁ శ్రీవత్సమమర
నురమెక్కుసిరితోడనొరయుకశిరమెక్కుమహియనహరినీలమకుటమొనర
నలరువిలుకాఁడులవలీదళాయుధములఁ। బూన్చునిజచిహ్నములునాఁగపోలయుగళి
నవ్యమణిమయమకరకుండలములెసఁగ। నించువేడుకసాక్షాత్కరించెమదిని॥ ౭౧
వ॥ ఇట్లుసాక్షాత్కరించినయమ్మహాపురుషునినిట్లుస్తుతియించితి॥ ౭౨.

## ❋ విష్ణుస్తవము.దశావతారాదికము. ❋

గీ॥ ఆగమంబులుదొంగిలునాతఁడీతఁ। డనఁగఁజెంపొందుపేరిటనతిశయిల్లు
దనుజుఁబరిమార్చివేదముల్ధాతఁజేర్చి। దనరుకపటాంబుచరమూర్తినినుఁదలంతు॥
గీ॥ ధరమునీమీదనిడివార్థిఁదఱుచునపుడు। హరునిమెడగందెహరియురంబందెఁగెంపు
నమరసంఘముకళనొందెనహహతెలిసె। ఘనజగత్కూర్మవగుటఁగాకమఠవర్య॥
సీ॥ కలఁచివారిధిబయల్సేలసికొమ్మునఁగొట్టనంటివచ్చిననాఁచుటుంటపుడమి
కొప్పరించఁగమింటఁగొరివ్వాడిరోమముల్ చొచ్చివచ్చినతొలుల్పుక్కగుంపు
చప్పరింపఁగఁజాటితెప్పగట్టుకవచ్చువిమలఫేనముసుధాసముదయంబు
కకుబంతములచెవుల్పికలించుఘుటఘుటప్రతినినాదముఘనప్రళయగర్జ
పొరలికఁబయోధిఁజెందినబురుదయొండి। యొడలుజాడింపఁగడరాలిపడినయొడ్డు
పెల్లలబ్జాసనాండముల్పెంపుఁగాంచు। తావకమహత్వముననుమాయావరాహ॥
మ॥ అమరంజుట్టుసరాతిపోల్కినలయాహార్యంబవేలోద్యద
బ్ధిమహావీచులచాలుగాలితెరలైబెంపొందదంష్ట్రాంకురా
గ్రమునద్ధారుణియొంటికంబముగుడారంబైతగన్వాదశా
ర్యమతేజోహతిఁగందకొప్పెసఁగెనూయాదంష్ట్రినిన్నెన్నదన్॥ ౭౬.
చ॥ కడలిమునుంగనప్పుడమిఁగ్రక్కునఁగొమ్మునమెత్తినందుము
న్బడినయహార్యకూటములునాటిననాటులవెంబడింబడిం
బడిఁబఱునీరధారలుసుపర్వులునించినపుష్పవృష్టికై
వడివెలయించుదంభకిటివర్యునినున్మదినాశ్రయించెదన్॥ ౭౭.
మ॥ త్రిదశారిన్విదళించితన్ముఖమసృక్సిక్తవ్యన్నఖాగ్రంబులన్
బదిటన్గాఁగలయట్టిపుట్టువెలుఁగింపన్దోఁచుచందంబునన్
బొదలన్గజ్జనిఁగూల్చునాకృతితగన్స్ఫూరించుదృష్టుల్బలెన్

దమపేతాంకముఁబాఱఁజూచునృహరీతర్కింతునిన్నెప్పుడున్॥ ౭౯.

చ॥ అడఁకువమీకునేమియిడనక్షయమౌననుటన్నిజంబుగాఁ
గొడిదెడుదానతోయమడుగుందిగదమ్ములుముజ్జగంబులన్
దడలుకొలందిగ్రైసుగుణవిక్రమహంసపరాగయుక్తిచేఁ
గడలుకొనంగఁజేయునలకైతవవామనునిన్నునెన్నెదన్॥

మ॥ జతనన్ క్షత్రకులంబుఁదున్మియుదయించన్గల్గురాజన్యసం
తతినొక్కుమ్మడిఁజంపగోరితదపాదానంబుగానన్భుజం
బలిఘోరాకృతిచేఁదదుద్గతినిశిక్షాపేక్షఁబోలెందదు
న్నతిఁబోల్పారుభవత్కుఠారమొసఁగున్మాకోరికల్భార్గవా॥ ౮౦.

సీ॥ ఫెళఫెళారవభగ్నభీమకోదండంబుభృగురామువింటికిఁబిలుపుదీము
ఘుమఘుమాధికరుతాకుంఠితాంభోరాశినిజసాయకమునకునీరుబదును
కిలకిలధ్వనివిశృంఖలరావణశిరోధియాత్మబాహాప్రతాపాగ్నికరణి
కహకహోత్తసుబాహుఘనశిరఃఖండంబుకరలాఘవమునకుబిరుదుఘంట
విగ్రశూర్పనఖానాసికాగ్రరంధ్ర। ముగ్రఖరముఖదానవాయుర్ధనాప
హరణమునకుఁగన్నముగాఁగనలవరించు। ధన్యునకునీకువినుతికోదండరామ॥

మ॥ పరమక్రూరదశోత్తమాంగుఁడుబుధప్రహ్లాదవిద్వేషి యు
ర్వరపైఁదోఁచినఁగ్రమ్మరన్నృహరిభావంబందినైమ్మైననాం
తరరోషానలధూమసంవృతిఁబలెన్నైల్యంబుగన్పట్టెనాఁ
గరజాతంబులవానిఁద్రుంచుమహిజాకాంతున్నినుంగొల్చెదన్॥ ౮౨

మ॥ నిజపాదోద్భవయౌటమోహముననేంతేన్గాఁగిటంగ్రుచ్చుజ
హ్నుజనాపాండిమమేనఁబొల్పెసఁగఁదద్యోగంబుచేఁజేరుసి
రజనీబాంధవసూతినానసితవస్త్రంబంకమందన్సమ
స్తజగద్వర్ణితకీర్తిమించుయదువంశస్వామినిన్నెన్నెదన్॥ ౮౩.

సీ॥ గొడుగువానకుఁగొండయడుగువాయఁగనెత్తుమడుఁగువారెడుకుడియడుగువాని
జెడదవాఁదెఱచియేర్పడదవానలుమ్రింగుపెడఁదవాటంపుఁజేరెడఁదవాని
బలిమివాసవుచెట్టునులిమివాకిటఁబెట్టుకలిమివాలుగకంటిచెలిమివాని
దరులవల్లవతలోదరులవాతెఱఁగ్రోలునిరులవాఁదుకుఁబిల్చుకురులవాని
బురుడువాక్రుచ్చఁగారానిసరుడువాని । నలుగువారలఁబరిమార్చునలుఁగువానిఁ
బులుఁగువార్వపుటెక్కుడుగలుగువాని । మేలువాటిలమిమునెంతుమేలువాని॥

మ॥ నరసింహాకృతిమున్నుగన్నయతఁడెన్నన్స్మేరయౌటన్వానుం

ధరకుంౘెల్లము నేయుకారికబల్పెన్దర్శించుకంసఘ్నమా
వరకుంభీంద్రమునొంచితద్రదరుచివార్ఛితావృతాంగంబునన్
గరమొప్పారుని నుస్సృజింతుమదిభక్తస్తోమచింతామణీ॥ ౮౫.
క॥ ఖురనిహతినొరలుదుష్కృత । భరమునఁగికటులదలలుపటుపటఁబగులన్
బరిపరిగతులస్తురగముఁ । బఱపెడు నెఱరౌతునిన్నుభక్తిఁదలంతున్॥ ౮౬.
సీ॥ తళుకునెత్తమ్మితేకులయందుఁగలరూపురూపుచల్లని-చూపుఁజూచువాని
నెలవఁకమౌళిపైఁగలమేటినొరపేరుపేరురమ్మునఁదేరుతేరువానిఁ
గఱకుదుండగపురక్కసులఁద్రెంపఁగఁజాలుజాలువాపిడివాలువాలువాని
మిసిమిఁదేరుపసిండిపసిమిగల్గినపట్టుఁబట్టుగామొలచుట్టుఁజుట్టువాని
గుఱులుగడవంగఁజెఱిగినకురులవానిఁ । బలుకుఁగపురపుఁలేఁదావిపలుకువాని
ముజ్జగంబులుదనరెడుబొజ్జవాని । విభునినినునబ్ధికన్యకావిభునిఁగొలుతు॥ ౮౭.
వ॥ అనిస్తుతించిన॥ ౮౮.
ఉ॥ కోరిభజించునీభజనకున్మదిమెచ్చితినీతిగౌరవో
దారుఁగుమారునిచ్చితరరాయురుపేతువినీతునిచ్చునీ
హారముఁగొమ్ములెమ్మిదినిజాంగనకిమ్మనియిచ్చినవ్యాపం
కేరుహపత్రనేత్రుఁడరిగెన్దయమీఱఁజకోరలోచనా॥ ౮౯
చ॥ అనిజగదేకనాయకుఁడుసాదరతన్గరుణించుహారమొ
య్యనఁదననాథుఁడియ్యఁగఁగృతాంజలియైజలజాక్షిభక్తిఁగై
కొనిశిరసావహించితళుకున్గనుఁదమ్ములనుంచిగబ్బిచ
న్నొనలధరించితాల్చెనుసమున్నతనూత్నవిలాససంపదన్॥ ౯౦.
సీ॥ గరిమమీఱమిటారిగబ్బిచన్గుబ్బలమహిమమించెనితంబమండలమున
లఘిమనెక్కొనెఁగపోలద్వయాంచలములననిమనెన్నొందెమధ్యస్థలమునఁ
బ్రాప్తిపెంపొందెరూపవిలాసవైఖరిఁబ్రాకామ్యమలరెహృత్పంకజమున
వశతగన్పట్టెమవ్వపుముద్దుఁబల్కులనీశత్వమింపారెనీక్షణముల
నవయవంబులుదాల్చినయందమనఁగఁ । జెలునమందినపుడమిరాచిగురుఁబోఁడి
కంబుధిశయానకరుణాకటాక్షలబ్ధ । హారరాజంబుఁబూనినకారణమున॥ ౯౧.
క॥ అనితరసులభంబగున । వ్వనజోదరదత్తహారివరమాహాత్మ్యం
బనఁగొన్నిదినంబులుచన । జనపతినెమ్మదికిమిగులసంతసమొదవన్॥ ౯౨.


దౌహృదవర్ణనము.

సీ॥ యౌవనగర్వపారావారమంథాద్రియవలగ్నపరనిధానాంజనంబు

# ప్రథమాశ్వాసము.

గండస్థలీయుగ్మకనకపత్రరసంబులాలితాశాలతావాలభూమి
అత్యంతసురభిమృద్వ్యాచనాంకురబీజమామ్లానతాకర్షణౌషధంబు
సరసాంగభూషణోచ్చాటనమంత్రంబునాదాతిమాంద్యసంతానకరణి
తీవ్రనిశ్వాసవాసనశంకుప్రతిష్ఠ । యలసతాగతనిద్రాంకురార్పణంబు
భూరిజృంభణసంరంభపూర్వరంగ।మువిదకవుడేరుపడియెగర్భోదయంబు ॥౯౩.

మ। కడకొత్తైకగడవెల్లఁబెద్దలనుచున్గన్పించుకోకున్ననీ
యొడమెత్తంబడునట్టులింతయునలావేజూపకీలేవడిన్
బడియుండన్దగదంచుసత్వగరిమన్మధ్యంబుగన్పట్టఁగా
వడిఁజన్నుంగవమెత్తఁబారెఁగరినవ్యాపారమశ్లీగదా॥ ౯౪.

తే. గీ॥ ఎన్నలేమినిగాఁచుకయున్నవళుల । సత్వసంపదగల్గినసారసాక్షి
యసదులేఁగానువిడనాడెనహహజగతి।నల్పునెభ్భంగిఁగాఁచినయట్లగాదె॥౯౫

శా॥ రాజల్లీలలఁగానుశైశవబలద్రాఘిష్ఠమైరోమరే
ఖాజాగ్రత్తరవారిఁబూనియెదురంగాగుబ్బలున్బ్రాయపున్
డేజంబెదుటనాయసారియుగమెంతేఁగిన్కమైఁబూనెనా
రాజీవాయతనేత్రచూచుకములౌరాయొప్పెనుగ్గప్పునన్॥ ౯౬.

తే. గీ॥ కానుసింగంబుప్రాయంపుఁగరినిమెక్కఁ । జోరమగురీతిఁదగర్భగౌరవంబు
కడఁబడినకప్పఁగుండలుగరమునఁగఁ।జనుమొనలునారునీలిమననువుమీఱె ॥

సీ॥ బీరంపుఁజనుఁగవబిగువుజాఱఁగఁబారెఁబడగానుసత్త్వసంపదలఁబొదలెఁ
దుళుకొందుతటులబిత్తరిసోయగముమాసెనలఁతిసూగారుపెంపతిశయిల్లెఁ
గడుదొడ్డకటితటికడకొంచెపడియుండెనతనాభియొకటియున్నతివహించెఁ
దళుకుఁజెక్కులువెల్లఁదనముమెల్లనఁదాల్చెఁగనరానికటమరల్చెనుపునాందెఁ
గలిమిలేములుసతములుగావుగాన । గర్వమెవ్వరికినిగొఱగాదటంచు
యౌవనాధికగర్వంబునపుడురోసి । యమియుగతిభామచిట్టుములుమియఁదొడఁగె।

ఉ॥ చెక్కులఁదెల్పుఁబొల్పెసఁగెఁజిట్టుములుల్లసిలెన్నెఱుంగుఁజ
న్మొక్కలనీలిమంబలరెముద్దునడల్గడుమాంద్యమొందెఁబెం
పెక్కెనలంతనెన్నడుమొకించుకగౌరవమందెఁగోరికల్
నెక్కొనినిక్కెనారువెడనిద్రకనుంగవఁజేరెనింతికిన్ ॥ ౯౯.

వ॥ అంత ౧౦౦

## పుత్రోత్పత్తి - నామకరణము.

మ। కమలానీరజనేత్రయొక్కశుభలగ్నంబందుఁగాంచెన్సతు

న్గమలానీరజనేత్రమన్మథుని వేడ్కంగాంచుచందంబునన్
సుమనోభూరుహమంజరీసురభిలాస్తోకాసవోన్మత్తతన్
గొమరుంబ్రాయపుఁగాడుపుత్తెరసిదిక్కుల్ద్రొక్కినర్తింపఁగన్॥ ౧౦౧

ఉ॥ పొంగినృపాలుఁడంతమునిపుంగవుఁడైనవసిష్ఠమౌనిచే
యంగలజాతకర్మవిధులన్నియుఁజేయఁగనవ్యకాంతిఁజం
ద్రాంగదుఁడౌటఁజిత్తముననారసిపట్టికిఁబెట్టెఁబేరుఁజం
ద్రాంగదుఁడంచునెంతయునుహర్షపయోనిధినోలలాడుచున్॥ ౧౦౨

## ఆశ్వాసాంతము.

మ॥ కలితక్ష్మాతరుణీమణీతనుభవాకల్యాణకల్యాణశై
లలసత్కార్ముకకామినీతనుగుణాలంకారలంకారమా
బలసంహారనివారితామరతరాపజ్జాతపజ్జాతని
ర్మలరేణుక్షతమౌనిరాడ్యువతిహృన్మత్తాపమత్తాపహా॥ ౧

## ఓష్ఠ్యము.

క॥ పౌలోమీవిభవనపా । లోలుపగురుగోపవామలూరూద్భవవా
క్ష్మాలోపశోభివైభవ । లోలోర్మిపయోబ్ధివార్విలోప్యనుభావా ॥ ౨

పంచచామరము ॥ ఖరాశరాసురాజవాతకాలసర్పసంగరా
గరాకరాతిరాజమానకందరస్తవాదరా
దరారిరాజరాజితావతారవద్ధురంధరా
ధరామరాగరాగబాహుదండితోగ్రపృఖరా॥ ౩

గద్యము ॥ ఇదిశ్రీరామచంద్రచరణారవిందమిళిందాయమానమానస
సకలశాస్త్రాధ్వరిరంసపైఁడిమఱ్ఱిపద్మనాభాధ్వరీవతం
సకృపాభూషణకృష్ణరాయభూషణపర్వతరాజ
తనయవేంకటపతివిరచితంబైనచంద్రాం
గదచరిత్రంబనుమహాప్రబంధం
బునందుఁబ్రథమా
శ్వాసము.

శ్రీ శ్రీధరాయనమః.

# చంద్రాంగదచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీసాకేతసువర్ణ । ప్రాసాదవిహారవినతపవనకుమారా
కౌసల్యానవగర్భసు । ధాసాగరపూర్ణసోమ, దశరథరామ

వ॥ అవధరింపుము. తదనంతరకథాక్రమం బెట్టిదనిన.

చంద్రాంగదుబాల్యదశాభివర్ణనము

సీ॥ చమురూఱనడుగంటనిమురుచుందలయంటియంగంబులెల్లఁ
నులివెచ్చనీటిచేజలకమొయ్యనదార్చికర్ణగోళంబులుగరిమనూఁద
వలిపెంపుమడతదువ్వలువచేఁదడియొత్తిమెత్తపొత్తులలోన మేనుఁబొదివి
కనుదోయిఁదిన్నగాఁగాటుకఁదీరిచినుదుటిపైనునుగావుఁగుదురుకొల్పి
యక్కుఁజేరిచిచన్నిచ్చిచొక్కటంపుఁ । గెంపు విడికెంపు జంపున సొంపు నింపు
జాతిమగతాలితొట్లహర్షమునఁబెట్టి । రమణదాదులుపెనుపనారాచపట్టి ॥ 3

సీ॥ వీక్షింపఁగానేర్చె విడికెంపుతాబంతిలలినొత్తిగిలబోరగిలనేర్చె
జోలపాడదుపాటలాలించివిననేర్చె నవ్వింపవికవికనవ్వనేర్చెఁ
గొమరొప్పఁదనుదానకూర్చుండఁగానేర్చె నాడకాడకదోఁగియాడనేర్చెఁ
గేలూఁచివిడ్డెముత్రెరలియాడఁగనేర్చె నడపింపమెల్లననడవనేర్చెఁ
జెలువుదోపఁగముద్దులుజిలుకనేర్చెఁ । బిలుచువారలతొడలపైనిలువనేర్చె
వేడుకలుమీఱఁదూబూచులాడనేర్చె । నాడునాటికినాథరానాథసుతుఁడు॥ 4.

సీ॥ ఉబ్బుబుగ్గలనొక్కియొయ్యనొయ్యనఁగేలఁగెమ్మోవిఁగులికిసేత్కృతులుసలిపి
మొగిచి నెమ్మోమింతముందఱికిటుజాఁచిముద్దుముద్దనిబయల్ముద్దుపెట్టి
గిలకొట్టియట్టెచక్కిలిగిలియనిపెట్టికిలకొట్టినవ్వినవ్వొలయఁజేసి
నవ్వకుమాయన్న నవ్వఁజాలవటంచుఁదనువారనక్కునఁజేనిచిపొదివి
నగవుదేరెడునీముద్దుమొగముజూఁచి । సిగ్గువడిరాఁడుపిఁడనిచేయిసాఁచి
చందమామయ్యఁబిలువుమోచక్కనయ్య । యనుచురాపట్టినాడింతురబ్జముఖులు॥

ఉ॥ అప్పచులాడుచున్నగవులాడుచుబారలుజాఁచిసాఁచిమా
యప్పలువచ్చిరంచుసకియల్లనుదమ్ములమోడ్చిపిల్వఁగా

గుప్పునఁదప్పుతప్పటడుగున్నడలన్గొమరుండు పైఁబడున్
దప్పకచూచుఁదల్లికినితండ్రికిముచ్చటదీరునట్లుగన్ ॥ ౬.

మ॥ నెలతాచొక్కపుమేడలోనమగఱానిద్దంపుఁగీల్తూఁగుటు
య్యాలలోబాలకునుంచిపద్మభవగేహిన్యాప్తవీణాలస
త్క్వలనాదామృతమాధురీసహచరద్గానావధానంబుచే
నలరుంబోఁడులుజోలఁబాడుదురమందానందసంధానతై ॥ ౭.

చ॥ మెడఁబులిగోరు, ఫాలమునమేలిమిపచ్చలరావిరేక, పు
త్తడిమొలకట్టుకొనునఁ, బదంబులఁగెంపులగిల్కుటందియల్
విడిగలమద్దికాయకవవీనులసొంపుఘటింపఁదప్పుత
ప్పడుగులువెట్టురాకొమరుఁడాదటదాదులుకేలువట్టఁగన్ ॥ ౮.

క॥ ఈలీలఁదినుపఁబెరుగుచు । బాలకులనువేడ్కఁగూడిబాల్యక్రీడా
లోలతవిహరింపంగాఁ । దాళంగాలేకమిగులతహతహవోలెన్ ॥ ౯.

## యౌవనవర్ణనము.

సీ॥ జలజసాయకునకుసంకేతభవనంబుశృంగారచేష్టకుజీవగఱ్ఱి
మినుకుటందములకుమెఱుఁగుటద్దపుబిల్లయిద్ధాంగపటిమకుసిద్ధరసము
తళుకొందునెఱతనంబులుపుట్టుపుట్టిల్లహంకారములకెల్లనాటపట్టు
వింతచెల్వములకుసంతరించినదీముసాహసంబులకునుదోహదంబు
మించుక్రొమ్మించుగమికిపర్షించుఘనను । కులుకుసిబ్బెంపుగబ్బిగుబ్బలమిటారి
కత్తియలచూపుతేంట్లకుగమలవనము । జవ్వనమునెందెవసుమతీజానిసుతుని॥ ౧౦.

సీ॥ అధరామృతపుఁదేమనడరుశృంగారాంకురములునానూగుమీసములుబొడమెఁ
దెలిచెక్కుటరచందురులదోఁచుజిగికప్పుగొనబునాఁజిరుచంపపనిదనర్చెఁ
దనుఁబెద్దగాఁజూచుకొనుబాల్యముడిగినఖిన్నతనాఁగౌనుకృశతఁదాల్చె
ఘనకళావిభవంబుకలిమివేర్వడియెనోయనవిభక్తములయ్యెనవయవములు
చంద్రబింబాననామనశ్శాణశోణ । కషణమునఁబోలెనతిశాతగరిమఁగాంచె
నంచితకటాక్షవీరవీక్షాంచలంబు । లధిపసుతునకుఁబరిపూర్ణయౌవనమున ॥ ౧౧.

చ॥ కరుగునఁబోయుమాడ్కినొడికంబుగఱాతమలంచుకైవడిన్
హరుఁబగగొన్నవేల్పుఁబడియచ్చుననొత్తినలీలనొచ్చెము
ల్బొరయనిమేనిమేలిమొఱపుంజిగియుంబిగియుంసమగ్రమై
నెరయఁగరాసుతుండలరునెక్కొనిప్రాయముపిక్కటిల్లఁగన్ ॥ ౧౨.

ఉ॥ తీరినతత్తడిజ్జనగతిస్ఫుటముల్లమికించుచాడ్పునన్

దీరనితత్తడిజ్జనగలిస్ఫుటముల్దుమికించువాగెఁబెం
పారబిగించిపైకుబికియబ్బురమందివయాళివేళన
య్యారెబలంబుతొల్తభళియాలివయించువజీరులెంచఁగన్ ॥ ౧౩.

మ॥ గమకంబైతగుచూపుతూపుదొరయల్కాంజిక్కికోలాస్వనీయం
గముఁగల్గివిహారముల్సలుపునాకందర్పచందంబునన్
గోమరుంబ్రాయపురాచబిడ్డలెలమిన్గొల్వంగనానావినో
దములన్గూడినృపాలపుత్రుఁడువినోదంబందియున్నత్తఱిన్ ॥ ౧౪.

చ॥ సమధికరూపనిర్జితవసంతుసకీహితదానవైభవా
సమగుణధిక్కృతాంబుధరజాతికిననృపసూతికిన్మహా
త్తమమృగయూథసంహరణదారుణకేళిసహాయవృత్తిమై
తమకమురేచి నెమ్మదిముదంబొనగూర్పఁదలంచియొయ్యనన్ ॥ ౧౫.

సీ॥ వెలుఁగురాచలువకుప్పలపాలిచెకముకిసముదగ్రకాననసామిధేని
బలితంపుటెండమావులఁ పుట్టుపుట్టిల్లుపథికులయరఁ లఁబడినముల్లు
కలిగొట్టుచెట్టుగుంపులకింటిచుట్టంబుగాలిమేఁపరికివాకట్టుమందు
మదనపిస్ఫూర్తికిమారటముక్కంటిమిహిరబింబమునకుమెఱుఁగుసాన
యవనిఁదలఁజూపెనహితసర్వాగమాధి । పాలితానేకఘనపాదపప్రసూగి
రిస్తనీమహాగర్భనిర్భేదనంబు । తాపసంతప్తజనమునిదాఘదినము ॥ ౧౬.

## నిదాఘవర్ణనము.

మ॥ సమనక్తందివవింధ్యమేరులుమిథస్స్పర్థాళుతందీప్రవరు
క్కమలారిప్రతిరోధులైయొగయికన్గనప్పట్టుచోగ్రీష్మకా
లముపేగందగుకుంభజుండుదుటునిల్పందగ్గఁదద్రాత్రివిం
ధ్యమహీధ్రంబుసమున్నతస్థితిఁదదన్యంబొప్పెనెంతేరహిన్ ౧౭.

ఉ॥ పడమరవెట్టగాఁడప్పెదురంబైనముసాగనివెల్గుఱేఁడుని
ల్కడవడిదక్కసృక్కఁచనఁగాదివసంబులుదీర్ఘతంగన
న్బడియొఁదగుగ్రతాపశిఖిబైకొనిచాలతపింపఁజేసిన
న్ముడిఁగినలీలరాత్రులుకనుంగొనసన్నములయ్యెనయ్యెడన్ ౧౮.

చ॥ గడిదొరగానప్రుచ్చిమిదిగంబడియప్పటికిన్బిడారమా
కడలినబింధనంపుశిఖిఁగయికొనిగాడ్పుసమానభూతతన్
దొడికిసభాపకారియగుతోయమడంపఁగవచ్చెలేనిచోఁ
బొడమునొయగ్గియెల్లెడలఁబ్రుంగునొనీరముతత్తదాగతిన్

మ॥ వనవాటుల్దహియింపుచున్ బ్రబలదుర్వారోద్ధతిన్గన్నవా
రినిబోనాడుచుదుమ్మునన్బరలుచున్ రేలున్బగల్లున్నృశిం
పనినిర్నిద్రతసంచరింపుచునపస్మారస్థితిన్వ్యాప్తిభూ
జనముల్బెగ్గిలనత్తఱిన్మెలఁగెనూష్మవ్యగ్రవాతూలముల్

చ॥ బెడిదపుటెండపెన్సెకలఁ బేరినవేదననాపగామణు
ల్వడిఁ జెడిపోవువేళవిడువంబడిశేషితజీవనంబులై
యడరుతదీయడింభములయందమునగ్గనుపట్టెనక్కడ
క్కడఁబఖికావళీసమధికల్పితనూతనరూపకౌఘువ ౨౦.

చ॥ వెలుఁగులతేనివెవెలుఁగువేఁడిమిసుఱ్ఱునస్రుక్కునం...
కలశసమస్తనీమృదులకాయములన్బలినీరుగ్రమ్ముబొ
బ్బలగతిరూపకప్రతతిభాసిలెనందునభంబువెట్టను
గ్నిలువగలేకగ్రుంకఁగలినీడలచేఁగనుపట్టెనత్తఱిన్ ॥ ౨౧.

చ॥ కొలవినిజూఁడినస్రవులుకొన్నవిధంబుననెండవేఁడిమి
జ్జలచులమండునప్పుడమిసోఁకకపైపయిజాఱునీటిజా
ర్తెఱఁగుననెండమావులెడత్రెవ్వకనంతటనిండిపొల్చెన
త్తఱిసురగాలిసుళ్లగతిఁదార్కొనిమించెధరాతలంబునన్ ౨౩.

చ॥ అకట నిదాఘతాపమునన గ్నియొకించుకఁదాళలేకమే
నికిఁదగుచల్వగావలసినీటమునుంగఁగఁబోలు లేనిచోఁ
దుకతుకఁగ్రాఁగనేటికినదుల్నదముల్వసధుల్నిజాంతరో
దకములవేఁడిమిందెరలితద్దయుమిట్టిపడంగమీనముల్ ॥ ౨౪.

మ॥ తనరజ్జక్రకపుల్నతింపఁగవసంతత్యాగినైవాసికె
క్కిననాతేజము సాగునోటువసునిక్షేపంబుఁజేకూర్చెనో
కనటంచున్మిహిరుండు తా వసుమతీగర్భంబుభేదింపనా
టినబల్గాయములోయనంగఁగనుపట్టెన్గర్నబొందల్ధరన్ ॥ ౨౫.

మ॥ సరసీజాప్తుఁడురథ్యరజ్జుపవనాశవ్రాతముగ్రాతప
స్ఫురణన్గ్లానిభజింపనూత్నభుజగస్తోమంబుఁదేనంపఁగా
సురగావాసముజేరఁబోయెడినొనా నొప్పెన్నిదాఘోద్ధళ
ద్ధరణీరంధ్రవిసారిసారకరసంతానంబనూనంబుగన్ ॥ ౨౬.

మ॥ మునువర్షర్తునసీరుమోచిసుమసంభూతచ్ఛవిన్బాండుత
న్గనిపుష్పాసవపూరనిర్గతులజోకన్జిట్టుముల్గ్రాఁయుచు

గ్గనఁగా గర్భము పూర్ణమైనతఱిఁ గాఁగా నోయరణ్యానిఁ దాఁ
గనె వంశాపహనాశ్రయాశుసముదగ్రజ్యేష్ఠకాలంబునన్ ॥ ౨౭.

చ॥ పుడమిపడంతి నైజజలముల్సరిపోఁబలువెట్టఁగుందిశే
వడిఁబడియాత్మసంతతి దివంబున నున్న సురస్రవంతి న
క్కడునగతూము బెట్టి దివికంటెన నన్నను పట్టిమించెన
వ్వడు సుడిగాలిఁ బట్టుక నభోగతిఁ బ్రాఁకు దుమారమెంతయున్ ॥ ౨౮.

మ॥ కనుఁగొన్నన్నలు మోడ్వఁజాలుసదముగ్రగ్రీష్మతాపంబుచే
ననుకుల్దప్పిఁదలంచి పొర్వఁగదవే యోనాథయంచున్విక
ర్తను జేరంజను పుండరీకములచందంబందె వాతూలచా
లనవిస్తారితశాల్మలీఫలజతూలంబుల్ప్రవిద్ధప్రచుల్ ॥ ౨౯.

మ॥ వడగాలిన్మయి గందస్రుక్కఁబడుతేవన్వాలమూలంబులన్
ముడుఁగంబారిన నీడలన్ధరణిసంభూతోష్మ చేతన్బడిన్
బడిగన్పట్టినయగ్గిబొబ్బలగతిన్భాసిల్లి మధ్యాహ్నపుం
బొడయెండల్వాలుపారె నంతటసముద్భూతంబులై వేసవిన్ ॥ ౩౦.

మ॥ అతిగాఢాతనుకార్యసంవిహరణవ్యాలీఢతృష్ణాసము
న్నతచింతాప్రతికారసమ్మిళితనానాపాంథసేవాప్రియా
శ్రితభూతిన్దగుతత్ప్రపాచయము నిర్నిద్రాప్తి సౌభాగ్యవ
ద్ధితమై రంజిలుకుండగోళకసమృద్ధిన్సర్వసంతానమై ॥ ౩౧.

చ॥ అలరుసురంటిగూండ్ల మునుపంతటఁ బెట్టినబొండుమల్లెమొ
గ్గలగమిగాలిఁ గ్రుడ్లుతఱిఁగాపున వే విరియంగఁ బాఱఁగా
వెలువడుకైవడిన్మిగుల వింతగఁ దెమ్మెరపిల్కు లచ్చటన్
దెలివి మెలంగెఁ గానియొడఁ దీరిన తెమ్మెరలెట్లు గమ్మరున్ ॥ ౩౨.

చ॥ పరగఘటచ్ఛలంబునఁ బ్రపాచలదుర్గములన్ ఘనుండు భా
స్వరగతిమైనశైత్యతరవారి ధరించి నిదాఘగర్వసం
హరణమొనర్ప సధ్వగభటావళిఁ గూర్చి కనిల్చె లేకత
చ్చరతరుణీమిషంబునను చంచలలచ్చటనిల్వనేటికిన్ ॥

సీ॥ వడగాడుపులు వీచె బడలెఁ బాంథజనంబు బలసె నెండలు నేలపఱియలయ్యెఁ
బ్రబలె వాసరములు పఱతెంచె నెరగలి యొండమావులు నిండె నేఱు లెండెఁ
బొగిసె దిక్కులు మెకంబులయఁగములు పెట్లె సొరిగెఁ బిట్టలు చెడఁదిరిగె మరుఁడు
బొండుమల్లెలు పూచెఁ బొలిచెఁ బాటలములు ధరఁదీతువులు మీటెఁ దారెఁ బూరి

వెలయుచలిపందిరుల వట్టివేరుచప్ప । రములవలపుఁబూజవికలగుమురుపొదల
తళుకుఁబసుపుటాకులదళ్లచలువడాఁగి। తలఁకితలచూపదెచటనిదాఘువేళ॥ ౩౪.

వ॥ అట్టిసమయంబున॥ ౩౫.

సీ॥ కెంపంగిపూపరంగిలాఁగుకెంపుఱాగోలుసుజినాతాళిచెలువుఁజూప
మూలఱాచొక్కపుమేలిసింగపుటాకు పనిమేలికడియముల్గొనబుమీఱ
మలబారుఁరాసున్న మలపుకీల్పులుదిండిపెఱఱాపలిమకాలిపెండెమమర
పసిమిగుల్కు కిరీటిపచ్చతామరయంతరాళపు జిగియుంగరాలుదనర
మిసిమిపైదుర్యభుజకీర్తులెసకమెసఁగ। నాణిముత్తెంపుటొంటులొయ్యారమెసఁగఁ
జాయసూర్యపుటంపుఁగుల్లాయిపొసఁగ। జంటియరచట్టపైనెఱిచలువయొసఁగ॥ ౩౬.

మ॥ నెలఱాసంతననిగ్గులుప్పతిలులిన్నెల్మాలఱాపెద్దటా
కులనిద్దంపుజగాహజాగమునఁ దళ్కొంగుల్కు హుర్మంజిపూ
సలసింగంబుమెఱుంగుఁజెక్కడపుఁగీల్జాగాచొకాగద్దియ౯
బొలుపొందొలువుండెరాకొమరుఁడాపుల్గొల్వఁగానత్తఱి౯॥ ౩౭.

మృగయులేతెంచి కానుకలిడితమపగ్గెలుగ్గడించుట

సీ॥ కొదమసింగపు వాలుకొనవెండ్రుకలజల్లిచిలువరాతలఱాలగులుఁకుపేరు
రకపుసామ్రాణివార్లాడాచలాడంబు చిఱుతమీసపునేతచిఱుతదట్టి
తళుకుఁగొర్వాడిబెబ్బులికోఱచేనమ్ముగుత్తఁపుటెలుఁగుతోల్కుప్పసంబు
సంకదండగఁబెట్టు సవతీవబలుచుట్టసికజుట్టు తలముళ్ళవెకలిచుట్టు
విప్పఁగలపాఱుటాకు బల్కప్పడంబు। చుల్లరపుకొమ్ముముత్తెముడ్డొల్లుపోఁగు
లలరఁగఱకునానెఱుకునాయంకుఁడొకఁడు। పొడగనఁగవచ్చెఁగొలువున్నపుడమిఱేని

సీ॥ మొలఁగట్టుపాఱుటాకులు జాఱకుండఁగఁదీటికట్టినబలుతీవకట్టు
తుదనెమ్మిపురిమించెమూర్చికట్టినగంటఁ గలిగిననిడుదబత్సెలసువిల్లు
జడగట్టఁజుట్టినబెడిదంపుసికమీఁదనలమిన కొంగయీఁకలసరాలు
కొనముక్కుకడనుండి కొనవెండ్రుకలదాఁకఁ బొందుగాదిద్దినబోయనామ
ముదుగుదండాలు నద్దైసకొదుగుమూపు । లేసమాటలుసందిటనిడినకేలు
గవయుఁగలచెంచు చేరువకాఁడొకండు । వచ్చినృపతికిఁగానుకలిచ్చినిలిచె॥ ౩౮.

సీ॥ గదురుకంపుగడించుముదురుకొర్రింజెమటలజొనుపుపుక్కిటిలోని జొల్లువిడెము
తొడుగులీడ్చినరీతిఁగడఁగు గంధపుఁబూఁతనెఱిచిట్లనిడుబలినిడుదజల్లి
బలువింటికుట్టు కంబడిగవిసెనకటికొకజుట్టినపాఱుటాకుగుంపు
నిగుడుముందఱికొయ్య సిగదాకునెదుకెక్కుకొనముక్కునామంపుగొనబులేక

పిడికిటమ్ములువీఁపుననిడినపొదియఁ । దెలిరువాణపువెదురుముత్తియపుఁ బేసఁ
గలిగిమెఱుకునాయంకుఁడొక్కఁడువచ్చి । పుడమిరావేల్పురాయనికడనునిల్చె ॥

సీ॥ వలఁదయేనుఁగుముత్తెములబట్టిపులులపైఁ బెఱికినయిఱ్ఱితోల్పెఱికగములు
కస్తూరినించినసింగములుగట్టినకపురంపుటనంటిపరంపుబండ్లు
తేనెలడ్డిగమొత్తమూనియెల్గులకునెత్తిన పగడంపుమంకెనలగుములు
చాఱపప్పుబిగించిశరభాలపైవేయఁదగు పొఱుటాకుపొత్తరలగుంపు
పునుఁగుఁబిల్లులు జల్లులుపొగడపండ్లు । జీవదంతములుఁ గ్రొంతముత్నెలసువిండ్లు
గేనిసవరాలుసవరాలునాన్పపాలు । సముఖమునఁ బెట్టిచెంచులుసాగిమ్రొక్కి ॥ ౪౧

సీ॥ సింగంపువిడుపులిచ్చినయట్టిగండభేరుండంపుటణుజదిమండలేంద్ర
యేనుంగువేటకేనేర్చితీర్చినయట్టితెఱనోటికందిజధీరహృదయ
కనుమఱుంగొనగూర్చమనుబిళ్ళకై దిద్దునెడబండి పులికూనయిదిన్నపాల
వరుసజూపమెకాలఁబొరిగొన మఱపినశరభంపునిసువిదిసార్వభౌమ
యెచటదొరకనేరవిట్టివిదేవర । నగరనుండఁదగినవగుటసామి
వేఁటకాఁడనగుటవీనిఁదెచ్చితిరాజ । సవదరింపుచూడననధరింపు॥ ౪౨.

సీ॥ పందిఁగైబట్టఁగఁబందికైదువులేల నదనికబదనికయొదవెనేని
యలుఁగునేనుంగుకై యలుఁగుఁబూనఁగనేలనండనీదండచేరుండెనేని
పులినేయఁజోఁబులిపులినేయవాలేల పెలికీమూలికవెలసెనేని
సింగమ్మునెదురనసింగమ్ముఁగొననేల క్రొత్తయీబెత్తంబుహత్తెనేని
యమ్ముగొడవేలయేగవయమ్ములకును । ఖడ్గమంకింపఁగానేల ఖడ్గములకు
భల్లమదియేలయాయచ్ఛభల్లములకు । నయ్యయీబండిసికబంతియయ్యెనేని॥ ౪౩.

క॥ అనివిన్నవించితాఁదె । చ్చినకానుకలొప్పగించి చెంచులదొరని
ల్చినమీరెచ్చటనుందురె । వనికైవచ్చితిరనుచునృపతి యడుగుటయుఙ్ ॥ ౪౪.

సీ॥ తరిగుండునేనునేతఱినుండు తలమయ్యగొండకునాలావుదండయధిప
వలిమెట్టునాకుఁగావలిపట్టుదేవరసామిగట్టుకునేనుసామినాడయ
సిరిగట్టునాకునుసిరిగట్టునెలవప్పమచ్చుగుబ్బలినాకుమచ్చుజియ్య
తొలిగొండనాకునుతొలిగొండయేలిక వలపుబల్మలనాదునలపుదేవ
గుడుసుపెనుచుట్టురాకొట్టగొనలుదొనలు । కోనలునుకానలునుతళ్కుగుల్కుచిల్కు
ముత్తెముల్నెత్తముల్గొప్పముదురువెదురు । జోళ్లుపాళ్లును మేముందువీళ్లురాజ॥ ౪౫.

చ॥ పసగలయెండలన్గుదురుబండలఁగాకలనిండిపొంగుకా
ర్పసరపుఁబాలచే నివురఁబారిననివ్వరిమోగిరంబుతో

మసలునెలుంగురాచలుప మంటలగాల్కొఱకుట్లనంజూడు
త్తైసవిసరింతు మేసరెలమేమయిసామిరో వేఁటలాడుచున్ ॥ ౪౬.

క॥ ఒడయా నీ పేరిఁటియీ। బుడతని కెనగానఁ గానఁ బురుడింపఁగని
క్కడిబోయలలో మఱియొ। క్కుడుచాయలమలల మెలఁగుఁ గోయలలోనన్ ॥ ౪౭.

క॥ తిలకించితివే నృపమొ। క్కలమగునీ చెంచు మేనఁగలపలుగంటు
ల్బలుసింగపుఁబలుఁగంట్లా। పులిగాయము లెల్లఁ బెద్దపులిగాయమ్ముల్ ॥ ౪౮.

క॥ నోరెఱుఁగని మెకములకై। బారెడుకై దువయుఁబట్టఁ బాడియె యనుచున్
దూఱున్నము విడికేలున। దూరుస్నైకమున్న పొదయ దూఁరుండగుచున్ ॥ ౪౯.

ఉ॥ ఉక్కలడుస్సి పందిఁగని కోయనుకోయను దిట్టుఁగుందెటిన్
బొక్కి వెడల్చి నిల్చినను బోయనుబోయను రోఁతలాడుఁ బెన్
మక్కువ నేను నేగెఁబదమాయను మాయను వెల్లరోయునీ
వెక్కసిచెంచు సింగముల వేఁటల వేఁటలలీలఁ గుఱ్ఱించుచున్ ॥ ౫౦.

ఉ॥ ఎత్తిన నిబ్బరంపుఁ బరువించుక తగ్గక బత్తెకంబులన్
హత్తఁగఁ దాఁకు గాయములు నారసి కట్టెపమన్నలజ్జగో
రొత్తుల కేలపొత్తులని యొల్లఁగు మా మలలప్పమీఁదిమా
బత్తియెమాన్పు వీనికెవి పాటివియే నృప యెన్ని చూడఁగన్ ॥ ౫౧.

క॥ ఱొమ్మున విఱిగిన యేనుఁగుఁ। గొమ్ములు పడి సెలగుఁ బందికొమ్ముల పాఁటు
ల్వాన్నై పెకలక యుండిన। యొమ్మెలకును వీఁడు లివియనీయఁడు సామీ ॥ ౫౨.

శా॥ సామీ దేవరవంటి వీరపురుషుల్ నైతంబు నెల్లప్పుడున్
సాముల్ సేయుట వైరిపోటుఁ దలగించన్ వానిఁ దాఁకింపఁగా
గామాయీ బుడుతండు బోవుఁ బలుబోకల్ పెక్కులోన్నైమెకా
లే మేఁ గొట్టఁగ నోరయైపొడచరాడే బుద్ధిగాఁ దెల్పవే ॥ ౫౩.

సీ॥ తలవెండ్రుకలకన్నఁ దఱుచుగా నితని చేఁగూలిన బెబ్బులుల్ క్కవలయేంద్ర
చుక్కగుంపులకన్న నెక్కుడౌ నితని చేఁ జచ్చిన సింగముల్ సార్వభౌమ
ఇసుకకన్న గణింప హెచ్చె యౌ వీని చేఁ దెగిన యేకలములు జగదధీశ
కసవుకన్నను నెన్న ఘనమె యౌ వీని చేఁ గ్రమ్మగిన యేనుఁగుల్ మానవేంద్ర
యేను జేసిన సావు సంబెన్నఁగాని । కలనదేవర గెలిచిన గెలుపులన్ని
గలవునా చేతఁ దెగి నేలఁ గలసినట్టి। గండభేరుండముఖ్యఖగంబులయ్య ॥ ౫౪.

తే॥ తఱిమి చేకత్తిఁ గుత్తుకల్ద్రుంగుటొండె। చేరి బాకునఁ బొట్టలు జీరుటొండె

ాకయోరాజ మేకములఁగనినయపుడు। వింటనేసినవాఁడుమాయింటలేడు॥ ౫౫
కతలమానిసిలేఁడిం।టికిమాయల చెంచురాయనికినని వెనక
య్యకునాతని వెనకయ్యక్కుఁ। దుకతుకబుట్టించినప్పుదురుమన చెంచుల్॥ ౫౬.

సీ॥ గండభేరుండంబుఁగడఁక వైచిననాఁడు వెలసెనీ సెలను బల్వింటగంట
కదిసిబల్లెమున సింగమును గూలిచిననాఁడమరెనీ పికిలిపించముల జంపు
కదిమి చేకత్తిచేఁ గరిని గ్రుమ్మిననాఁడు గలిగెనీ సెమలీఁకనిడుదజల్లి
సెలవంకి కొద్దిబెబ్బులిని గెల్చిననాఁడు గలిగెనీ ముంజేతి గవ్వదండ
సామిచిత్తంబునకు నాదు సావుసంబు। మెచ్చు లేపటి వేఁటలో వచ్చెనేని
వేఁటపులకాలిమూలి యొసేఁడటంచు। నన్నుఁ జేపట్టి విడువక మనుపుమయ్య॥ ౫౭.

* తెలుచగు మేకము లేవనిం గలవని రాజడుగఁ జెంచులు బదులిడుట. *

॥ అనిపలుకు చెంచుపలుకుల। కనురాగముఁబొందియాధరాధిపమణి గ
న్గొని తెలుచగుచు మెకాలే। వనిఁగలవనననియెఁ జెంచువలిగట్టులు తెక్॥ ౫౮.

॥ కలదొకమలపులికోదమల। సెలవెస్త్కముల మెకముల సెలకొనినిలువ
న్దలమిలఁగలకుఱకుఱబో। యలకొండలమీఁదుదానికావలగలదా॥ ౫౯.

॥ అచటిపందులఁజెప్పంగనలవియగునె। చప్పరింపంగ సెలవులదాఁటుసొంగ
సెలలబెడిదంపుఁగోఱల సెలగఁబుట్టి। మట్టుమీఱిన కాఱగ్గిఁబుట్టునంచు॥ ౬౦

॥ దండచేలావుగలగట్టిపందు పెదురు। తండములకొమ్ముపంగల మెండుబెట్టి
బెండువిఱిచినకై వడిఁ బెనచివిఱుచు। పోతరించిన దుప్పులపొలములోన॥ ౬౧.

॥ అటదిభదానవారిఁబదనైనమహింగుమిగూడిబందులం
తట వెసబుడ్డగింప బెడిదంబగులోయలఁబర్వి శేషవి
స్ఫుటఫణరత్ననూత్నతరశోభ వెలిన్వెలిఁగింపకున్ననో
కృటన్నృపశక్యమేయిరులఁదారొకనుకాఱడవి న్మెలంగఁగన్॥ ౬౨.

॥ తముదాసె బెదరిబులుఁగులు। గుములై పైకెగసియల్లుకొనుకొమ్మతుదల్
గమకముగఁదాఁకితోటతోట। గుమికినక్రియఁ ద్రెళ్ళునేలకును వేగగుచున్॥ ౬౩.

॥ సలుగుల్మట్టిలఁదుంగ వేళ్ళు పెకలించం జెందు గాతాల ది
క్కులు గంపింపఁగఁబడ్డయేనుఁగుల సైఁగుప్పించి సింగంపుఁబి
ల్కులు బేరుండపు గాంతచిట్టెలుకలాఁగల్గూఱి పెన్భీతిచే
నలసాలౌశరభాలపాలగున్నపాలా యేమి చెప్పన్వనిన్॥ ౬౪.

ఎండకాఁకలఁబొరలాడు నేకలముల। చమురుదే తెడుదొరుకులజలముఁగ్రోలి

పోతరించినకాఁ జెనుబోతులచట। వచ్చిమదహస్తితోడఁగొమ్మిచ్చునధిప॥ ౬౫.
గీ॥ ఒకగొడుగునీడనీవుకీటుడుగనడుపు। గుడుసుకొండకులోనైనపుడమిఁగలుగు
పడలకెల్లనుపిరమైనపగిదిపాలసు। విందుఁగావించెదనుకోఁటవెడలుసామి॥ ౬౬.

## * వేటకాయత్తపడి ప్రయాణమైపోవుట. *

క॥ అనిపలుకుచెంచుపలుకుల। కనురాగిలివేఁటతోఁపయనిపురిఁజాటం
బనిచిబహూకృతివారల। ననిచికొలువుదీరివేగనన్నృపములీలన్॥
సీ॥ గొలలతీవియలమాడ్కినిదుడిఁవ్రాసిన పైఠాణివలిపెంపుఁబాగఁజుట్టి
నిగుడుజీనిమెకాలనిండుబంగరుఁవ్రాఁతపనినొప్పుకప్పుదుప్పటిధరించి
సుళువుచాయలపేరిశైలీనీరుబుగ్గలయొడ్డెపట్టెపుఁగత్తినొనరఁబట్టి
పచ్చతాపితదట్టిపసమించుపచ్చడాచిలుకకొంబిడివంకినలవరించి
వివిధమృగయోచితవిశేషవేషమమర। వేత్రధరశంఖహేంకృతుల్వినున్నముట్ట
బట్లుకైవారములుసేయఁబ్రమదమునను। నగరువెడలిహజారంబుననువసింప॥ ౬౮
సీ॥ ఉదిరిబంగరుఁవ్రాఁతహాదనిపూపనిచొక్కసగతులహిఁబంబట్టుమొగలిపల్ల
మపరంజిసరిగయొత్తడరసంబునమించుమిసిమికల్లెపుఁగొంపుమేలువాగె
మగటాలమొగముట్టునిగనిగల్వాలయూర్పుహురుమంజిముత్తెంపుసరపెణీలు
బలితెంపుఁబులుదిండిమలదాయటాచెక్కడపుగోవపనిచొక్కటంపులేవ
తళుకుఁబైఠాణిసింగిణుల్తరకసములు। రకపుఁజికిలిసిరాజినారంజిఁబన్ని
పలియెదుటనిల్పెసాహిణిపరగపాలి। నారసంబగునొకతురగోరసంబు॥ ౬౯.
చ॥ పలియలతేజినెక్కినరపాలురుగొల్వహయాధిరోహపాం
డితిసరిదాఁట్లుజోడనలునిబ్బరముల్ రవగాలునేడెము
ల్జతినముమీఱఁజూపిరులుచల్వడినూకిమలంచివైచుచున్
జతురులుమెచ్చఁగాఁజనిరొశైలనివాసులుతోవఁజూపఁగన్॥ ౭౦,
క॥ డేగలనువేఁటయుకులన్। జాగిలములజాతిముంగిసలబండగులం
వేఁగొనిమృగయతతిమహి। భాగముగ్రక్కదలఁగదలెఁబలియిరుచక్కన్॥ ౭౧.
చ॥ సలుగులదాటి, బెబ్బులులసంబెట, యిఱ్ఱులమోరచిక్కమే
దులముకుగొయ్య, సింగములదొంగ, సివంగులకత్తికోఁత, యె
ల్గులతలబోడ, మన్నుబిడికూకలగొంగ, యనంగమించుకు
క్కలగమిఁబట్టుపట్టెడలఁగట్టిరి, పట్టిరి, రాజుచెంగటన్॥ ౭౨.
వ॥ అందొకఁడిట్లనియె॥ ౭౩.

ఉ॥ బెల్లపుఁ బాగునందడిపి పెట్టితి, వాల్గొఱకొన్ని నాళ్ళు, కొ
న్నాళ్లు మెకంబుమైఁ బోరకనంజుడ మేపితి, కొన్ని పాళెము
న్నెల్లనె వేఁట వేఁపుఁ గమికిఁబడి సల్గులఁ జంపనేర్పితిన్
గల్లరియయ్యెనిప్పు డిది కానలఁ బందుల వేరువిత్తనన్॥ ౨౪.

చ॥ బలబలవేఁగునంతగ విపజ్జలనిచ్చలుఁ జేరఁ రొప్పుచున్
గలబడు బెబ్బులిన్ గిరుసుకైదువు దొమ్మలు నాటఁ గ్రుమ్మ సం
ధిలు నులి వెచ్చపెన్నురువు నెత్తురుఁ ద్రావుచు వేఁటఁ దీర్పఁ గాఁ
బులితలగుండు గండఁడనఁ బొల్చినగండిది భూవరోత్తమా॥ ౨౫

క॥ అని వాఁడుచునవి సేయఁగఁ। గనుఁగొనలన్ నగవు దేరఁ గాఁ బతితముఁ జూ
చు నెడనద్దమతమ డేగల। యనవద్యగుణంబుఁ దెల్పియటఁ దన్మృగయుల్॥ ౨౬.

సీ॥ ఈమించుకైదువల్లెన్ని గల్గిననైన దిత్తితీసిన మాడ్కిఁ ద్రెంచిపట్టు
యీతళ్ళుక్కవేగాళ మెన్నశక్యమె పులుఁగులఁ గొడిసెట వేసినట్లొడిసిపట్టు
యీచంచలపుడేగ యిటువంటికల్లేటి వేటున పాటున విడకఁ బట్టు
యీ బైరికంకణంబెగయుఁ బోపాడవున కెక్కించిడించి తానుక్కఁ బట్టు
యీయనుజుఁ బోరణము దాన దేమి జెప్ప। నహహ పేదరాలి నిదయ్యమడఁచినట్లు
వసుసఁ బిట్టలఁ బట్టునో వసుమతీంద్ర। తడయకొకయింతయడవి జోపిడినఁ జాలు॥ ౨౭

గీ॥ వెనకముంద అనిరుచక్కి వేఁటలోన। నెందనెందఱుఁ ద్రోలిన నెచటనేని
తప్పనెగసినఁ దారిన దద్దరిలక। పిట్టనేయుదుమ దె డేగఁ బట్టియైన॥ ౨౮

రుగ్మవతీవృత్తము॥ మాటలనేటికి మమ్ముల నేఁడీ। వేఁటఁ గనుంగొన వేయనువారల్
కోటులసంఖ్యలు గూడుః రానా। ఖేటకఖేలాకీలితబుద్ధిన్॥ ౨౯.

క॥ రంపిలుశ్వాగణికశ్వే। నంపాతికజాలికాదినానామృగయా
లంపటసుభటాలాపప। రంపర చెవికింపునింపరాజటఁ జనుచున్॥ ౩౦.

## * అటవీవర్ణనము. *

సీ॥ కొరలి నెమ్ములు సేయు కేకారవంబులు లావుకలెత్తునీలలరొదాల
మూలసందులనుండి మూల్గుడాబలక్రందుగుంపు కేరజపుఁగయ్యంపురొదలు
పెల్లుగాఁబోలుచుపూరేళ్ళకుట్టుల సద్దుదొడ్డయా బెలగువ్వలొడ్డురవళి
కారొక్కడిగుములకోకారంపు సందడి గుడుగులా విలముల చెడుగసరము
వనమహిషమత్తకంఠీరవద్విపేంద్ర। గండభేరుండశార్దూలగవయచమర
శరభసారంగవృకముఖసకలజంతు। వివిధనిధ్వానములు మించి వినఁబడంగ॥ ౩౧.

సీ॥ శ్వావస్తికాహారశార్దూలభృతపూతిగంధినయ్యంకవాంగక బిలంబు
బహుళసంభవవిరావభావితజ్ఞాపితహస్తికపంచాననాలయంబు
నిఖిలభీకరముఖాముఖినఖానఖిదీర్ఘకలహాయమానమృగవ్రజంబు
కిటిదంష్ట్రికోదీర్ణకుటిలసాలోద్ధూతధూమాయితజ్వాలధూమలంబు
గండకలులాయగండభేరుండగవయ। చమరగోఖడ్గవానరశశకసృగాల
జీవనంబగునొక్కమహావనంబు। నద్భుతంబందికాంచెనయ్యాశ్వపసుతుండు॥ ౮౩.

గీ॥ అటులఁగనుఁగొని మెచ్చియయ్యడవిఁజొచ్చి। లుబ్ధకార్థమృగయాతిలోలబుద్ధి
గడలుకొనఁజాలనుత్సాహకలితుఁడగుచుఁ। బొంగి మెకములఁజంపనొప్పుగఁదలంచి॥

వ॥ అత్తఱి మిటమిటయని కటికిమొంపులంబుట్టిన బెట్టిదంపు వెట్టఁదొట్టిన నిట్టట్టగు పిట్టలంబట్టి కఱకుటెఱుకులు నీరునించిన చెలమపట్టుల పేర నట్టుకొను నిదాఘసమయసంజనిత సంతాపసంభూత ఘర్మజల బిందుసందోహంబులు మైనివురునట్లం జుట్టునిగుడించు నాత్మపూత్కార పరంపరలవడువునంగడలుకొని బడలువడనుడి కరువలిరవలిరవులుకొని భగ్గున నెగయు నిజావయవతాపానలంబుడంబున విడంబించు ధగద్ధగిత మార్తాండశోపకలిత కీలికీలామాలికల చాయలపగిది మెండుకొని లేటిపిండున కు జలభ్రాంతిసంతగించు నెండమావులచుఱుకున బెండువడికాఁగు జనయిత్రియగు ధరిత్రిదేహంబు దాహంబుఁదీర్పనిక్క మిన్నేటిశ్రేటనీటన సమకుసుమపుటంజలి పటలముల దోయిలించిచల్లులీల గంధిలమకరంద శీతలాసారంబులుగురియుభూరుహంబుల లీలనీడలం క్రీడించుదుప్పులుకుప్పించి తత్కోటరకుటీరంబులనున్న పన్నగంబుల గొమ్ములం గ్రుమ్మితిగిచి కఱుకుకఱుకున్నంజెఱుకుగొఱికినతెఱంగునఁగొఱికి పెసమెసవు తఱింబకున్నంబంటికిడ్డుపడఁ గటుకున్నంగొఱికి వెడలనుమియ నెఱయుతత్ఫణామణిగణంబుకొఱివ్వాడి వప్పులగొప్పకుప్పలంబఱచునెడల మెత్తగాలువడి యట్టిట్టు గదలనేరక వెగడుపడిజడిసితిరిగెడు బంధురగంధసింధురంబులఁగని నింగిముట్టనుప్పొంగి క్రుంగి యంగంబులునిగుడఁ జెంగునలంఘించితదీయకుంభస్థలవిదళన లగ్నఖరనఖగంబులగుచు వెంగలిచూపులంగడలు బరికించుసింగపుఁ గొదమలఁగొఱ లివ్వలవ్వల వెడలం గబళించు శరభంబులనీక్షించి ఱెక్కలుముడిచి బుస్సునందూఱి తటాలునం దన్నికొనియెగయు గండభేరుండంబుల యొఱకలంబొడమిన గెడుసుపెనుగాలి సుడిపడయొఱయు తరుశాఖలంబుట్టుదట్టంపు గార్చిచ్చుఁజల్లార్పుచు సకలమృగపతగ నివహనాశసంసూచకంబగు రక్తవర్షంబు ననుకరించు తత్పదనఖవిలంబిత కళేబరవినిర్గత రుధిరధారాళధారాపూరంబులు కుత్తుకబంటిగాఁగ్రోలి యున్నననఱగన్న వెట్టి వెన్నుఁదన్నినవెఱుంగకవిదురుచుబెబ్బులులున్న నెలవులును; మఱియునుత్తాలంబులగు

తాలఁబులం గిరాతజాలంబులు, గీసి, మోసులంగట్టిన త్రెట్లకెగసుటకి యందులను ప్పతిల్లుకల్లుతదంతికసీమల ముసురుచీమల నంజిన జి పొట్టలుబ్బగొబ్బునదాత్రివితబ్బి బ్బచూపుల నల్లడలుబఱిముచు లాహిరిగొన్నకతంబున వెడవెడగునియుచు బయల గంతుగొనినఁ జిక్కునఁబడితొడిబడలేచి నిగ్గుచుమ్రుగ్గుచుఁ దప్పటునడలందమసె లవులువఱచి పేఁకొక్కుతెఱవునంబఱచి యావలమఱియొకగవికిచేర యచటియలవు లు తమ నెలవులకువచ్చిన మచ్చరంబున విచ్చలవిడిఁగదిసి పయింబడి బెదిగములగు నిడుదమొనగోళ్ళగ్రుచ్చినఁ దామ్మును నెదిరి పైకొని కొట్టుతఱిఁదుట్టెలుగట్టిన రోమము లందవిలితివియఁదరంబుగాక బలిమింబెకలించుకొన పెళ్లునవిఱుగు నన్యోన్యనఖరంబు లందొఱఁగుశోణితంబునందోఁగి యమృతకిరణంబులచేతంబొదువఁబడి వాపోవుతిమిరం పుగుంపులచందంబునంబడి యొరలుఘల్లుకంబుల యాక్రోశంబులం బెదరిగుములుబాసి యిఱకటంపు కనమతెవుల బఱమతఱిబలుపలుఁగుటా త్రొక్కుటంబులంగిట్టలుపగి లినాగిలి దగఁదొట్రిచొగలుగాఱ నాలుకలుచాపుకొని చాఁకట్టుగాఁబడు సారంగం బులకు నిరవైనపట్లును; మఱియు ననుహిమవిషాణకోటీసముట్టంకితగండపాషాణస ముదయపతనసముదిత పెళపెళఝా వారావతూర్ణాకర్ణనంబున మిట్టిపడి ప్రతిబింబి తారుణతరణికిరణంబుల నిగ్గులుదేరునీరుబుగ్గఁజెన్నారి వినోదపరాయణంబులై నడ యాడుకాటుకకొండలకరణి చుఱచుఱవిఱుచుచుఱకుఁజూపుల నెత్తురులువడియు నయనంబులనెల్ల దిక్కులంబరికించుచు నుప్పతిలికొలలంజిప్పిలి పెన్నురుపురాలఁజ ప్పరింపుచుకొప్పరింపుచు నెఱమట్టినేలవ్రాలిననిజచ్ఛాయలంగని రొప్పితప్పనంగొట్టి గిట్టికొ చ్చికోరాడి క్రమ్మిపమ్మికొమ్ముకొన నెగడిమ్ముతెఱఁ బైఁగ్రమ్ముకొను నెఱదుమ్ము నంబరగునిడుదరోమంబులుబహిర్నిర్గతంబులైన యాంతరకోపానలజ్వాలలమాడ్కి ని ట్రపాటునందనగ మెఱయులుభకమానసాఖర్వగర్వకరిపాకంబులైన యేకలంబులుతు డుములుతుడుములైనిలుచుచోట్లును; మఱియుఁ గణుదురులపోల్కిఁ బెద్దపెఱయీఁ గలగతి కడుపులైరేఁగి తూఁగిపైబడుకొంచు మీఱిన రేచులంబూచి మిన్నలుగ పన్నలుగట్టుచుఱుకుకొవ్వాడిమొన లకోరికోలలచందంబున నందంబగు సెలలబృం దంబుఘులుఘులుమనంగఁబొంగి బెడారునదూఱికొన్నింటియవయవంబులు తూటులబా నలరీతి జల్లెడలభాతి జోరునసెత్తురుగురియు వెడఁదగండ్లఁబోడిమిసెడఁదాఁకి వెన్ను నఁజెన్నారు ముండ్లుఱొమ్ముననాఁటి వీఁపువెడలనెగరిపైఁబడి కొఱతంబడినలాగున గొఱలుకొన్నింటిగవులకీడ్చుకనరుగునేదులు మెలంగు నెలవులును; మఱియుఁగణది మనుబిడిజల్లి మెకంబులుమొదలుగాఁగలుగు మెకాలుసంచరించుటెంకులును; మఱి యుఁ గైదు, కక్కెర, కారుకోడి, లావుక, వెలిచ, సెలనెమలి, డాలు, గొంగడిగాఁదు

మొదలుగాఁగలుగుపక్షులు పొదలుకొనియుండు పిట్టపట్లును సమ్మదంబున విలో
కించుచు నాడాడ బోనులొడ్డించియు బోగువారనియమించియు నోదములు ద్రవ్వఁ
గట్టడఁజేసియు వసులునాటనేర్పరచియు వలలువేయనానతిచ్చియు మఱియునురులు
జిపురుఁగుండెలు మారమ్ములు మొదలగుమృగయాసాధనంబులు సమకొల్పుమదలయి
చ్చియు లటుహాపటహాఢక్కాహుడుక్కాదివాద్యంబులు జఱపించియు నన్ని యం
త్రంబులు ముట్టింపించియుఁ గోలాహలంబుగా జోపువెట్టించిన. ౮౪

సీ॥ హరులగుండియలు బిట్టవియబెట్టుగఁ గ్రాకి పఱచియోదంబులఁబడుశరులు
పొదలనీఁగెడుక్రోలుపులులఁ జివ్వనదాఁటి వఱలఁజక్కఁగురంగవిసరములును
దొట్టివదగతోడి తోఁడేండ్లఁగడచి హా గురులపాలగుకొండగొఱియగుంపు
గొమ్ముపంగలసివఁగులనూఁకివలదూరి తవిలియుండెడుదుప్పితండములును
నిండిపైఁబారుగండభేరుండములును। తేరిచూడకనలుదెసల దిరిగితిరిగి
నురిగిమారమ్ములనుగూలుశరభవితతి। గలిగియకొన్నమృగభయంకరత దాల్చె॥ ౮౫

వ॥ అప్పుడు. ౮౬

* మృగయావిహార వర్ణనము. *

సీ॥ మనుబోతునడిపించుకొనియేగనిదెజాడ చేరువబెబ్బులిచేరవలయు
గవికిఁ నేనుఁగుఁదీసెన వెరాలెము త్తియంబులు చెంతసింగబు మెల్లఁగ
సెల్లఁగొనెసెలగొమ్మబలుచాఁగయిదెయంటి కెలననేకలములు నిలు
నిరవొందెనిచ్చోటని వెపాలమడువులు దండగా జైనుపెంటులుంగ
నను చానడు గిత్తిమూఁగువారరసిపోఁగు। వారువారును దెఱలెత్తువారుజోపు
వారువడిగోదములుద్రవ్వువారునగుచు। నాటవికసంఘమప్పుడయ్యడవిబలసె॥

సీ॥ ఎదడిందిమద ముండిగదనండిరొదఁజెంది పొదసందిపెదపంది మెదపునొక్కఁ
డలమబ్బువెలిఁద్రొబ్బుపొలగబ్బుగలయుబ్బు తలబెబ్బులులఁగబ్బుఁదగలకొకఁడు
జెనుపకలనుడొంకలనుబంకమనుశంక జనుచింకమనువింకఁజదుపునొకఁడు
బలుజాగగలుగంగములుబొంగబెలుచంగ నలసింగములుగ్రుంగమలచునొకఁడు
హత్తిమత్తిచందంబునహత్తినడువఁ। గత్తిఁగుత్తుకనుబిఱానగత్తిరించి
సత్తిమత్తిల్లిబలిసేసిసత్తినొక్కఁ। డవనిపతియిచ్చమేలుమేలనుచు మెచ్చ॥ ౮౮

క॥ భిల్లుఁడొకఁడుపాడచినతన। బల్లెము వెంబడి నెయ్యిఱికి బైఁబడుబుల్లిఁదా
చుల్లరపుగోర బెడిదపుఁ। జిల్లాణముకొద్దిగ్రుచ్చిచీరెన్నేరెం॥ ౮౯

క॥ పొదనుండిరొప్పబెబ్బులి। కొదమంజేయిచ్చిపిలిచికొఱనంబిరయొకం

ఁదగకగను జెదరికనుడి। బెదరక వదరక యకుటుచపి డెమున గెడపెన్॥ ౯౦

సీ॥ పసివట్టి బొరియ చొప్పునఁ గాంచియు దిరించు యుదిరించి పోనీక యురిడి గదియుఁ
గదిసి తోమునిగాలఁ గఱచి వెంబడిదీయు తిగిచిన నోడ నెలేవఁ జెదువుఁ గట్టుఁ
గట్టి పైఁబడి కొట్టఁగని శోష్పకడు దాఁటు దాఁటి సాగఁగనీక తఱిమి తోడుకు
దొడికి క్రమ్మర గాలువిడిచి పక్కజుడుంగు జుడిఁగియాయముఁ బట్టి క్రుక్కఁ జేయుఁ
జేసి యిటులేక లక్ష్ముల బైసిఁగొనియె। జనవిభుఁడు సూడ నొకకొఁన్న దాగిఁ ములు
సారె సారె కుబికదుఃపేరు వారి। చేరి వినుతింపఁదముఁ బెంచి చెచుదొరలు॥ ౯౧

సీ॥ వన్ఁజీమ చిటుకన్న వడి లేచి చెవులు జిక్కించి తొనబైయు మాలించి పినుచు
బైనిషవాలినపఱచిని ప్పుఁ రాలఁ జాలుకుకొమ్మున యోరచు డిక్కఁగను గఁ
గొనగొమ్మగదలిన గొనబు కోలుదు చప్పరించి కొప్పఁ దవు గిల్వంచుకొనుచు
గాలిసోఁకిన నైనగనలి మైకొప్పరించి తెటూన యటబయల్ సిలసికొనుచు
బలులకండ్మాలికై రాఁబడిన తరువు। తునిసి పెళ్ళనవిఱుగగట్టునసుమఱలఁ
బక్కనను రెండు తునియలై పడఁగఁ గొట్టె। భీకరంబగు నొక దొడ్డ సూకరంబు॥ ౯౨

అప్పుడు. ౯౩

క॥ నరపతిగనియమదండఁగ। ధరఁ బ్రేవుఁ గుప్పవడఁగఁ దనుఁ గొట్టిన మి
ల్లరము సతికఁగలచుకతా। సరిచావుగఁ జచ్చె నొక్క డాగిలమచటన్॥ ౯౪

చ॥ కొనలు మెదల్పడంగొరడు కోలవిధంబున మాయఁ జెక్కుచ
క్కనికుఱు మట్టపుంజములు తకట్టి యనోరికొసంగి కొట్టనె
త్తినమునికాళ్ళ గోళ్ళ వసిఁ ద్రెంచి తెటాఁ నగుక్కపట్టెదం
గొనిపులిఁ గట్టిపట్టె నృపకుంజరుచెంగట నొక్కఁడుద్ధతిన్॥ ౯౫

ఉ॥ క్రన్ననఁ బొంచిపొంచి బొలకన్ మెకముండుటఁ గాంచి యిందుఁ బా
మున్నది కట్టెఁ గొమ్మనుచు నొక్కరుఁడొయ్యన దోడివారికిన్
సన్నయొనర్చి యించుకటు బాగి తటాలున బిల్లగోలచే
నున్నతిఁ బూని యేసెఁ దలయూడి పడన్ దెగబాఱుకుందెటిన్॥ ౯౬

ఉ॥ ఆయెడ హత్తి యొక్క మదహత్తిఁ గిరంబున గొట్టిలేదు బం
తీయని దాఁటిమూఁటి కడు దిట్టతనంబున జొచ్చి కచ్చి మేల్
రాయున దాని బారి నిగళంబునఁ జెట్టున కంటఁగట్టిలేఁ
బ్రాయపుఁ జెంచొకండు తనుఁ బల్మఱు సాయబు జూడ వేసుగన్

॥ అదె సెలుగను చుండొడసె। యది గాదది యేదటంచు నందఱు భ్రమయన్
బొదినున్న తూపులన్నియుఁ। బదిలుండై యేసెనొకఁడు బలితోసు మెచ్చన్॥

ఉ॥ అటవిసుండొకానొకండ వాంక్రియఁ దూఁటిన యేకలంబుపై
నూఁటిచివుక్కన న్నగరి సుక్కఁగఁ బెండొడలం బిగించి పై
పాటుగ వచ్చి కొప్పి వెతిన పైఁబడు బెబ్బులిగుండ శ్రీలఁబం
దీ కెను గ్రుచ్చి యెత్తెఁ గడు హెచ్చరికం బెసమర్గ్రి గ్రక్కునన్॥
క॥ వాలమ్మునకుం బెదరక । వాలమ్మల్లార్చికొనుచు పడివచ్చు మదా
వాలమ్ము గుపులిం దునకు । వాలమ్మునఁ దుర్చి చెన్నపుఁడు వారణలీలన్॥
చ॥ ఎదురుగఁ బాఱు డెంచు నొకయేకలముం గని తేజి నూకి దో
ర్మదము దలిర్పఁ గాసిరి కరమ్ముల నేజను గ్రుమ్మినాటి పే
రెదనడ చేఁపసేటి కెదు రెక్కిన లిలబిరీన మూఁలు రాఁ
జదముకనిల్పెఁ బావడల నంబ్రమన ఖుష్టితజమ్ము గ్రమ్మఁగన్॥
చ॥ కడువడి ముష్టి కింత పెలిగాఁ బొదనుండి బిరాన కైదువే
సెడలగిరుక్కునన్మరలి ప్రేసి దొకండొక జాలి డేగ సె
క్కుడు వెస పైనయుంచుకొనకోయని యార్చిన పాలు చెంత పెం
బడి, భళిరే, పురే, యరరె, బాపురె, యంచు వచింప వేఁటరుల్॥
ఉ॥ దూరము గాఁగ నేగుక యుడుంగని యత్తెము మీఁదనుండి యున్
దాయన వారి తళ్కుఁ గడు తళ్కు మనంబయి కొన్ని మార్గు పెం
పారు వడిన్ వడిన్ బిగిచి యంతట పాటుకుఁ బోయి పట్టెన
య్యారె బళీ రె యంచు మనుజాధిపు చెంగట మెచ్చ వేఁటరుల్॥
చ॥ కయిదు బిత్తీన లేవఁగను గల్గిరె యొకండొకఁ డేగ ముష్టికిం
గయికొని యంట నేసి యది గాధఁ యంబునఁ దాఁకి దానితోఁ
బయినఁ బెనంగి వేసికొను పాటిని లంబడ కుండఁ బట్టెన
క్కయిదును డేగ, చేతి వడి, కాలి జవంబు, విభుండు మెచ్చఁగన్॥
ఉ॥ కొంచక కైదు మీఁద న్నృప కుంజరుఁ డేసిన తూఁట బాణమం
టించిన మాడ్కిఁ జంచలపు డేగ వడిం జని గిట్టి పట్టి మె
చ్చించిన కాలి మూలుగ యుం చెక్కము చక్కఁ రనద్ది యిచ్చె వే
దించె నొకండు డాలు పులు డీడు చులావులు గూడ దువ్వుచున్॥
ఉ॥ వేఁట కొలందిక న్నసరి వేష్టపుతోనడు పట్టెనొక్క క
ల్లేటిని యొక్క నేల నెమలిం దెగదీయుచుఁ దళ్కుఁ తళ్కుఁ గాఁ
బాటున నంటిని ల్వెనొక పాలపయిం జిలకట్టె జూ పెన
చ్చోట నెగంటి గంబరఁటి నూఁటిగ వేటును బాటు సేరికిన్॥

ఉ|| గళభాగమ్ములఁ బోతెముల్ ప్రిదలఁ జిక్కమ్ముల్ వ్రాలగ్నస్థలం
బుల నెంతే వసితోళ్లనంటి మెఱయన్ మోపుల్ మరుత్స్ఫూర్తిచే
నలువందంగ నుపిట్టతెట్టరోద సన్నన్ సద్దుగా విప్పుంచున్
సెలకట్టింగొని తేఁకు మైలమ్మగయుల్ చెట్లొక్కటన్ గొట్టఁగన్|| ౧౦౪

{ చంద్రాంగదుఁడొక గోరవంకం దఱుముకొ
నిపోవుచు నొక దిన్నారింజూచి చొరుట. }

చ|| వడిసరివంక నొక్క గొరవంకఁ బురీలున లేవఁ దాని పైఁ
బడిఁ బడ వేగనేసి యది దూరము గాఁ దఱుమన్ బిఱీనఁ ద
త్తడి వెసఁ బన్ని సోఁకి వసుధాపతి తోడనె వెంబడించి తా
నుడుపదవీధి కెంటెఁగన నొడిచి పడ దాఁకి నిల్చినన్|| ౧౦౫

సీ|| అసమాన చంపక ప్రసవ సౌరభ్యంబు పాటలీ నవపుష్ప పరిమళంబు
పంకేరుహాలతాంత బహుళ సౌగంధ్యంబు సంకుమదానూన సౌరభంబు
పిత్తశీతల దళ ద్విచికిలామోదంబు కర్పూర వాసనాగౌరవంబు
కుముద సూనంబులఁ గొమరొందు నెత్తావి చందనంబులఁ గల్గు చల్లవలపు
జిలుకు కుంకుమ స్వేదముల్ జిలికి తత్త! దతిశయములగు బాలించు నలరు బోఁడ్లు
వేసవ నెయ్యునిక్కఁ దెల్పుచుఁ జెలుత గాలి! యలఁతఁ బెడవాపి యచటఁ బ్రియంబు నర్చె

సీ|| కాంచికా ఘంటికా కలకల ధ్వని పరస్పర కృతాహ్వాన సంభాషణములు
మణిమయ మంజీర ఝుణఝుణ త్కారంబు లన్యోన్య ఘన పరిహాస కలన
కరపంకరుహ రత్న కటక నిక్వాణంబు లితరేతర ప్రబోధ వ్యాప్తి ప్రియా
ధావన రారట త్పాదు కారుతి మధుకేళి కాగీత సంగీత రవము
కలసి మంథాన భూధరాకలిత మథన! సమయ సంభవ దమృత సంజనిత ఘుమఘు
మాహమిక గమ్ము నొక్క కోలాహలమ్ము! చెవులకు నొసంగెఁ జవులు దత్పవనవళత||

ఆ|| ఆకోలాహలము విని! యాకర్ణింపుచు విభుండు హాయము డిగి హుసా
రైకి జాచేసి మహా! నొకమాతలమున నిలిచి కనుంగొనుచుండన్

సీ|| ఓషధీశ్వరుఁ డంపనొగిల తాదికములఁ గాపాడ వచ్చిన కళలనంగ
బలు వెట్టఁ దరుల క్రిందుల నీడల నుపేర మెలఁగు మబ్బులఁ దోఁచు మెఱుపులనఁగ
మదశాస్త్రికాలకై షాదల పూఁబోడల వెల్వడు తదస్త్రాధిదేవతలనంగఁ

దనకుదుర్గంబాటవనివసంతుఁడుప్రేమ నిల్పినయాజయేందిగలనంగ
నందనోద్యానకలితసంతానసూన। ములుగదంబింపనచటివింతలగువిరు
గోయవచ్చినయచ్చరకోమిరేలనఁగ।సాలపునటనలవిహరించుచెలులనడుమ॥౧౯

సీ॥ సెజ్జకప్పుకొప్పుపై నెఱయుబుప్పొడినొక్క పడఁతుకచలువపానడనుదుడుప
నెడనెడఁగనుపట్టుపాడయెండకొకయింతి యరవిరినెత్తమ్మియరిగెఁబట్టఁ
జెక్కులఁదిగజాఱుచెమటయారఁగనొక్క విరిబోఁడికపురంపునురఁటివిసర
నలరుబంతులయాటనగుపేరలఁతదీఱ నొకచెక్కులాడికేల్దోఁతయొసఁగఁ
జానయొక్కతచేరిహారిచ్చకఁదెలుప। భామయొక్కతెయటుబరాబరులుసేయ
జెలువయొకతెముందఱజెలవునూప। సకియయొక్కతెయొయ్యనసరసమాడ॥

సీ॥ హరినీలములచాలనదలింపఁదగులీల నునుగప్పుకొప్పుమూపునఁజెలంగ
నరవిందములయందమడఁగింపఁదగుచంద మునమోముజాబిల్లిముద్దుగులుక
నలకోకములజోకనళికింపఁదగురేక గబ్బిసిబ్బెపుటుబ్బుగుబ్బలలర
బలుజేడసలతోడఁగలహింపదగుజాడ కలికితేటవెడందకన్నులమర
హేలఁగ్రొవ్విరిబంతిఁగేంగేలనూని। చికిలిరవముత్తియంపుపాదుకలుదొక్కి
చలువనలువంకవెదచల్లుచల్లతావిఁ।బూనినడయాడురతనంపుబొమ్మయనఁగ॥౨౦

సీ॥ నిలమించుతేటవెన్నెలమించునెలయించు కలికిలేనవ్వువెన్నెలలుగాయ
విడికెంపుతునకబల్విడికెంపుదోలనింపు నీనుచుమోపియారెండగాయ
పగడాలునసిరాజిపగడాలునగఁజాలు చరణముల్సంజకెంజాయనీన
మరునారిసొగసువేమరునారియొయ్యారి కళగుల్కుకురులుచీఁకటులునింప
నంబుజభవుండుచిత్రసర్గంబుజూపె। ననఁగనద్భుతలావణ్యజననసీమ
ధిక్కృతానన్యభవభామయొక్కతేమ।గన్నుఁగొనఁగనయ్యెనొకవింతకాంతిమెఱ

క॥ జనవిభునికపుడుపులకలు। తనువెల్లనునిండిమిగులదట్టంబయ్యెన్
సునుజెమటవానవడనున। మొనసినమోహంపుగుంపుమొలకలనంగన్॥ ౨౧

మ॥ వినుతాంగీముఖచంద్రదర్శనసముద్వేలానురాగాబ్ధిగ్ర
స్మినఫేనంబతెనిర్మలంబయిన నమ్మేవందగందోఁచెనాఁ
దనరెంబాండిమమందుఁదేలఁబడు మత్తాళుత్తియుగ్మంబువే
ర్గనుకన్ గెప్పలనొప్పుబాష్పములు ముక్తాభాతిరాచూలికన్॥ ౨౨

గీ॥ అంతనంతంతకాదరమగ్గలింప। మదనసామ్రాజ్యదేవతయాద్యనున్న
వనజలోచనసౌందర్యమునకుఁజొక్కి।విభుఁడుతన్మదినిట్లువిచారించెను॥ ౨౩

# ద్వితీయాశ్వాసము.

ఉ॥ ఈతరుణీలలామ నడు మెంతయు ముష్టిని మర్వవచ్చు నీ
నాతివిశాలలోలనయనంబులు చేరలఁ గొల్వవచ్చు నీ
శాతకటాక్షనిబ్బరపుఁ జన్నవఁ గౌఁగిటఁ గ్రుచ్చవచ్చు నా
చేతికిలోనశత్తనువు చెప్పెడిఎన్నియు హెచ్చుతెన్నఁగన్॥

చ॥ కొడిదెఁడు మోము కన్నులఁట గొల్చిన చేరలకించుకంతయె
క్కుడుకడు చిన్న మోవియఁటఁ గూడు సుధారస మెన్న లెక్కవే
బడుగు వలగ్న మందుఁ దలఁపన్గుచభారము కొండలంతయు
ప్పుడఁ జుకయుంచుఁ దమ్మి పువుబావని సృష్టివిచిత్ర మెంతయున్॥

క॥ నిశితమతిం దెలిసినిరం। కుశగతి లేదనఁగలదన్నఁ గూడనియతిదు
ర్దశనడరు మధ్యభాగము। శశశృంగప్రాయమగుచుఁ జంద్రాననకున్॥

చ॥ గురుకుచగుబ్బచన్నుఁగవ గోరుపులాడునుబుట్టచెండ్లబాం
గరములనొక్కలోఁగఁ గొనుఁ గైరవపుంబలు సంగడంబులం
దరలకనెత్తబట్టు జిగితాళపుజిప్పల నొత్తియాడుఁ దా
మరవిరిమొగ్గగుత్తిఁ బలుమాఱును కేకమడంచు నెంతయున్॥ ౧౨౨

సీ॥ మిన్నంత సంపదఁ జెన్నారియుండియు ముష్టికిలోనయ్యె ముదితనడుము
తగునహీనసమృద్ధిఁ దనరారియుండియుఁ గడు సన్నగిలియుండెఁ గలికి వేణి
శ్రీవిలాసంబునఁ జెలువందియుండియు నవతదోఁపఁ గనిల్చె నాతిచెవులు
కొండంతకల్మిఁ జేకొమరారియుండియు నుపనాసమున నుండెను విదకుచము
లమితసౌవర్ణవిస్ఫూర్తి నలరియును సు। ధాకరానన నెమ్మేను తగ్గువడియె
ఘనతరక్షామదశఁ జెందు కాంతజఘన। మహహ శ్రీ కుడుపడుట చోద్యంబె తలఁప

క॥ నవలాకుచరేఖలకున్। నవలాకుచరేఖ లీడు నకురాశిన్నే
యవనీజనములు మఱిగా। రవమెడలఁ గవీఁపుతోలు వ్రాల్పకయున్నన్॥ ౧౨౪

గీ॥ చక్రసంపద కాసించు చన్నగవకుఁ। బిఱుఁదు నకునోడిలేమి పైఁ బెట్టుకొనియె
నెలఁత కానది పేదయే నీవిగలది। దాని చెన్నారు సంపదఁ దర మెపొగడ॥ ౧౨౫

క॥ గురురాయపట్టభద్ర। స్ఫురణందగు చెలినిటాలమున కంతేవా
సిరయనునంతేవాసిగ। నరసెలగనుపట్టుమింటనధికస్ఫూర్తిన్॥ ౧౨౬

ఉ॥ తాలఁదృణీకరించుఁ జెవి రాయుచనుంగవ తమ్మితూఁడు తా
రాలఁగి కాకికన్న గుఫురంధ్రి వళగ్న విలాసమంచు బీ

రాలఁదుటారమాడునును రాజనిభాననమందయానవా
రాలలనామతల్లియధరంబధరంబనుపక్వబింబముల్ ॥ ౧౨౭

చ॥ చెలినడుమారు గేలజిగిసిబ్బెపుచన్గవనిమ్మపండ్లు చెం
తలమొలనూలిగంటలరొదాలము పేఁరిటి వేదమంత్రపుం
బలుకులఁగాన్కసేయ నెలఁబ్రాయముకుచ్చెలచేనొయారఫుం
గలిమిపొసంగనిచ్చినను గన్పడదించుకకల్మిదానికిన్ ॥ ౧౨౮

సీ॥ కప్పురాలబెడంగుఁగాంతనవ్వులె కావు పాలఁతిముంగురులును గెలువఁజాలు
సైంహికేయస్ఫూర్తి సతిమధ్యమ మెకాదు చెలువయూరువు నిరసింపఁజాలు
గడుసంకుమదముపొంకము చానగళ మె కాద బలమై తావియును నణఁపఁజాలు
నును కెంపుబంతులవనిత చన్నులె కావు కలికి నెమ్మోవియుఁగదుమఁజాలుఁ
బొదలు నెత్తమ్ములనుభామపదమ కాదు । మగువతలమిన్నపిఱుఁదును దెగడఁజాల
కలితకలభమ్ములను కొమ్మగతులె కావు। తరళలోచననఖములుం దఱుమఁజాలు॥ ౧౨౯

గీ॥ మాటలారార చిలుకలమాటపట్టు। తేటకళలకు నెమ్మొగమాటపట్టు
హాటకళలాకకిచ్చమై మాటపట్టు। పాటివత్తురె చెలికొకపాటి సతులు ॥ ౧౩౦

మ॥ బిగ్గరై వట్రువరై బెడంగుగవయై బింకంబునై పొంకమై
జిగిరై లావయి నున్ననై పొడవునై సిబ్బెంపు డాల్దివిరై
సొగసై మిక్కుటమై గణింపఁదరమై చొక్కాట మైబాపురే
చిగురుంబోడి మెఱుంగు చన్నుఁగవ రాజిల్లెన్వయస్సంపదన్ ॥ ౧౩౧

గీ॥ కందు వెతిఁగిన చందురు కందు వెట్టిఁగి। గేలిసేయుచుఁ గళలతోఁ గేలిసేయుఁ
జాననగు ముద్దుమొగము మించాననగును। నీరజప్పగు నేనియు న్నీరజంబు ॥ ౧౩౨

సరసీజాయతలోచన। సిరిమించిన యంగబలము చేదరముల్ గే
సరమున్సరముల్ గానో। దరముల్ దరముల్ ఘనాంబుధరముల్ దరముల్ ॥ ౧౩౩

క॥ పడి ... గూర్చెన్ జో। ప్పడనిప్పడఁతికచమబ్బపక్తికినంచన్
నడకన్నడ సేయుబలీ। మెడగో మెడసేయు సంకుమిన్నన్ గన్నన్ ॥ ౧౩౪

ఉ॥ కాఱుమెఱుంగుగుంపుల చొకారము మేని మెఱుంగు; మోమురా
కాయచిరాంగుఁడైనయుడుకాంతునియంగు; భుజంగరాజిశె
క్కారు తెఱంగు; గుబ్బలగయాలి బెడంగు ధరాధరంబుని
క్కారుపఁబొంగు; దీనిసరియంగన లంగన మెన్ని భంగులన్ ॥

గీ॥ అనుచు నెమ్మది సౌందర్యమభినుతించి। చొక్కిచొక్కి విరాలిచేఁ జిక్కి చిక్కి
నిక్కి నిక్కి నిరీక్షించు నీటుగాని। నందములకెల్లఁ దొల్లయౌ నందగాని॥ ౧౩౬

సీ॥ నిగ్గుఁ దేరెడు కప్పునెఱి వెండ్రుకలవాని, నునువంకనిక్కు కన్బొమలవానిఁ
దెలిదామరలనేలు తేటకన్నులవాని, జిగిదొల్కు నగవు నెమ్మొగమువానిఁ
గీరుతరాజాను వృథబాహువులవాని, వెడఁదమందంపుఁ బేరెడఁదవానిఁ
బిడికిటికడఁగు సన్నడుము గల్గినవాని, బెడఁగుమీఱిన గొప్పపిఱుఁదువాని
నునుపుదలకొన్న బటువు పెందొడలవాని। నందమందిన పిక్కలనమరువానిఁ
దళుకుఁ గనఁబట్టు పాదపద్మములవాని। నించు వేడుకతను విలోకించువాని॥ ౧౩౭

మ॥ లలనామన్మథుఁ జూచె నాతరుణి, యాలావణ్యపుంగుప్ప, తా
నలసాలోలములై యచేష్టితములై యాకుంచితాగ్రంబులై
లలితాకూతరహస్యగర్భితములై లజ్జాసమగ్రంబులై
కలితాశ్చర్యములై భయాన్వితములై కన్నట్టులేఁ జూపులన్॥ ౧౩౮

ఉ॥ చూచుతఱిన్ మనోభవుఁడు చొచ్చి పరస్పరవీక్షణంబులన్
గాంచి మెఱుంగుబల్చెలుకుఁ గోలలపోలయినొచ్చిరొందునా
వాచనలేని యానరవరాత్మజులం జగురాకుఁగత్తిచేఁ
గాచుటలేకనప్పునలకన్దొడఁ గ్రేవడినజ్జనజ్జగన్॥ ౧౩౯

మ॥ పులకల్ మించె మరుండు నించు మొనతూపుల్ ప్రేలెఁ దత్సంఘులన్
వెసలంబాఱెడి రక్తధారలననిండె స్వేదఘర్మోదకం
బులు జవ్వాజి మెఱుంగుఁ గుంకుమపు మైపూఁతం గరంగింపుచున్
గలిగెన్ నివ్వెఱ, తద్భయంబున బలెన్ గంపాప్తి కప్పట్టునన్॥ ౧౪౦

మత్తకోకిల॥ అత్తఱిం జెలికత్తియల్లను హత్తి బిత్తరి చెయ్వులన్
జిత్తమత్తలపాటునన్ గడు చింతనొందఁగఁ బిల్వస
మ్మత్తకాశినులం గనుంగొని మత్తకోకిలవాక్యసం
పత్తి నెంతయుఁ బుట్టనిట్లని పల్కెఁ గల్కి మృదూక్తులన్॥ ౧౪౧

సీ॥ మదికి హాయిఘటించె మదవతీమణులార సురభిళాశుగపరిస్ఫురణగరిమ
నామోదమునొసంగె నమృతాంశుముఖులార కీరవాజివిహారగౌరవమున
నానంద మొనరించె నళినీలకచలార పికపదాళివిలాసవికసనమునఁ
గన్నులదనియించెఁ గంజలోచనలార మధురసోత్తరవారి మంజిమమున

వటిలునుద్యానపున్నాగవైభవంబు। లిపుడునావుడునవ్వియోయింతివాని
వలనఁజొక్కిలియిటనేఁడునిలచెదేమొ।పోయివచ్చెదమనిననప్పువ్వుబోఁడి॥ ౧౮౩

శా॥ పోపొండమ్మరొ, పోవుటెట్లు, బెదరింపుల్మానుఁడిచోట్టుమీ
మీపల్కేకడమాటనేరుపులకేమీచాలుచాలింపుఁడీ
యాపున్నాగమనోహరాభిరతితప్పా యొప్పుగారాదవా
చాపారువ్యముమీకిదేమిటికి హాస్యంబేటికిన్నాటికిన్॥

గీ॥ మనసురాదునాకుమానినీమణులార। ప్రేలరిములుగట్టిపెట్టిపొందు
కాకయున్ననన్నుఁగవలింపకూరక। యుండుఁడనినవారలులుకుబుట్ట॥ ౧౮౪

చ॥ అకటతదీయసత్కళలనాదటఁగన్గొనిమెచ్చిపొరితో
షికముగనిచ్చెనెమ్మనముచేడియరోమరలంగవచ్చునే
వెకలితనంబుచేనిటులవేదనఁబొందఁగనంచువెచ్చెలు
ల్పకపకనవ్వికేరడపుఁబల్కులుపల్కఁగనెట్టకేలకున్॥ ౧౮౫

క॥ వెడవెడఁబోడమెడియూర్పు। ల్తుడుములుతుడుములుగవెడలఁదొడవులుసడలన్
ముడిఁబొమజంకెనచూపులఁ। బడఁతులనదగించికోపపరవశయగుచున్॥ ౧౮౬

మ॥ తలపంజొంపపుమార్దవంబువిరిశైత్యంబచ్చపుష్పాసవం
బులమాధుర్యమువల్లికావిలసనంబుల్ పూనుమ్మారంబునం
గలచెన్వన్ బికజాతిముద్దుఁగజోకల్చిల్కరాపల్కుసొం
పులునెంతేవిపరీతభావముననింపుల్ నింపమిన్ బొక్కుచున్॥ ౧౮౭

గీ॥ జలజసాయకుఁడెంతియుసాక్షిగాఁగఁ। దనమునంబిచ్చియారాజతనయమనము
మార్చుకొనినదిగానఁదన్మానసంబు। వెనుదగులనింతివనవీథివెడలిచనియె॥ ౧౮౮

* ఆశ్వాసాంతము. *

మ॥ సురకార్యాంతవిచారచాగణనుతౌజోభారభారత్నమే
దురసాకేతవిహారహారధనుమద్దోస్సారసారస్వతీ
వరసాక్షాదవతార తారకనిజవ్యాపారపారశ్వథా
చరజిద్ధామగభీరభీరహితవాచాధీరధీరంజితా॥

ఆరోహణావరోహణకంధపద్యము.

దానవజీమూతలయుల[illegible]। యానయులజనశౌవిజయకదానవతీదినను
ర్యానాథ[illegible]। [illegible]రాళరవనజా॥

## ఉత్సాహావృత్తము.

కాండలాఘవప్రభిన్నకర్బురేంద్రమండల
మండలాగ్రరచితవిమతమహిళాభాగ్యమండ
కుండలాతిరాజమానకుశలగండమండలా
మండలాధినాథవర్ణ్యమానగుణపిచండిలా

## గద్యము.

ఇది శ్రీరామచంద్ర చరణారవింద మిళిందాయ
మానమానససకలశాస్త్రార్థవిరిరంసపైఁడిమఱ్ఱి
పద్మనాభాధ్వరివతంసకృపాపోషణ
పర్వతరాజతనయ వేంకటపతి
విరచితంబైనచంద్రాంగద
చరిత్రంబనుమహాప్ర
బంధంబునందు ద్వి
తీయాశ్వా
సము.



శ్రీ శ్రీధరాయ నమః.



# చంద్రాంగదచరిత్రము.

## తృతీయాశ్వాసము.

శ్రీరమ్యచరణసేవా । పారాయణభరణనిపుణ పటుతరబాహా
ధారాధరముఖవినిహత । దారుణరిపుసార్వభౌమ; దశరథరామా॥ ౧.

వ॥ అవధరింపుము తదనంతర కథాక్రమంబెట్టిదనిన॥

శా॥ ఆరాజన్యవరేణ్యుఁడప్పుడులతాంతాస్త్రప్రభిన్నాంగుఁడై
యారామామణిభావచేష్టితములాయజ్ఞాతిశృంగారమా
నారీరత్నముచూపులాబెళుకులానత్రపున్నవ్వయొ
య్యారంబుల్దలపోసివిస్మృతిఁదదన్యంబైనచిత్తంబునన్॥ ౩.

మ॥ సొలయున్ జూచు నగు న్భయల్బలుకరించు న్బల్కు నూఁకొట్టు బి
ట్టులుఁగున్ మ్రొక్కుఁబ్రియంబుఁజెప్పు నధరంబల్లార్చికోకొమ్మనున్
బెలుచున్, గౌఁగిటఁగ్రుచ్చు మెచ్చు నటుచుంబించున్, నినుబ్బాయలే
నలరుం బోఁడియటంచు నేకతమమిథ్యాకేళిలోలాత్ముఁడై॥ ౪.

### తాఁదలుముకొనివచ్చినగొరవంకయొకస్త్రీరూపమై మందలించుట.

వ॥ ఇప్పగిదిమానసానుభవపారవశ్యంబున నితరంబేమియుఁ దెలియంగకయుండు నానృపపుంగవుండు,మున్నుదనచేవెంబడింపఁబడి యొక్క వంకవితిగిపడియున్న గొరవంకతనవంకన్ జేరినిశ్శంకవచనరచనారచనచమత్కారంబులఁదనునభిముఖుంగావింపఁదదభిముఖుండైకనుంగొనుచున్నసమయంబున॥

సీ॥ కనుపట్టెనాశారికకుఁదేఁటినునుపెక్క మెఱుఁగుసంధించుధమ్మిల్లబంధ
మదిజూచివెఱగందనుదయించెజాబిల్లి మెమ్మోవిడంబించునెమ్మొగంబు
దానికినరుదందఁదలజూపెజిగిదన్నివలిపెపయ్యంటలోవలుదగుబ్బ
లందుకచ్చేరువూనినటఁదోఁచెగగనంబు పసఁగికాకిగేరు నసదుగౌను
పొదలుదమదయగరిమకబ్బురపడంగ।నపుడుజఘనోరుజంఘాముఖాంగసమితి
పొడమెమఱివానిఁగాంచియద్భుతముజెంద। నెదుటయదియొక్కచక్కనియింతియగుచు॥

క॥ మృదులచ్ఛదనవపుష్ప।ప్రదరోత్కరయోగఘటితపరిమళవిలస
న్మదనధనూరసమధురిమ। పదపదరచనాతిచతురభాషాపౌఢిన్॥ ౬.

ఉ॥ చూచితివేయరాళకచఁ జూచితివేసరసీరుహాననన్
జూచితివేపృథుస్తనినిఁ జూచితివే నృపరాజమధ్యమ

జూచితివే విశాలకటిఁ జూచితివే కరభోపమోరువుల్
జూచితివే లతాంతపదఁ జూచితివే జగదేకసుందరిన్ ॥

మ ॥ అనుచున్ స్నేమున నవ్వువెన్నెలలు గాయన్ మందటన్ బల్కి యి
న్ననతాంగిన్ ఘనవేణిఁ జంద్రవదనన్ నారీశిరోరత్నమున్
జనితాశ్చర్యమున న్గనుంగొనుచు నా చంద్రాంగదుం డిట్లనున్
వనమెవ్వారిది యెవ్వరా వనిత చెల్వా తెల్పుమా చందమున్ ।

క ॥ నావుడుఁ దెలిపెద వినుమో । భూవర యిట సావధానముగ ననుచున్
చావైభవ మేర్పడ నపు । డావనరుహపత్రనేత్ర యతనికిఁ దెలిపెన్ ॥ ౧౦

※ చిత్రసేనపుత్త్రికోదంతము. ※

మ॥ కలఁడాకాశవిహారహారి యమునాగంగాసరస్వత్యురూ
జ్జ్వలసంగప్రమదార్యకీర్తిపటలవ్యాలీఢకీర్తిప్రతా
పలసన్మజ్జనభాగసాంద్రతనుసంపద్భ్రాంతిసప్తర్షిచా
పలసంధానుఁడు చిత్రసేనుఁడు, రుచిప్రాలేయభానుం డిలన్ ॥

ఉ ॥ ఆవసుధాధినాథుతనయామణియా రమణీలలామ నా
నావిధపుష్పగంధపరినందితబంభరడింభమాలికా
జీవనమీఖనంబు నృపశేఖర సారతదీయకేళికా
పావనమాత్మచర్యయుఁ గృపన్ వినుసేవినుపింతు నెంతయున్ ॥

గీ॥ సుతులఁ బెక్కండ్ర విక్రమాన్వితులఁ గనియుఁ । గన్యకాదానఫలవాంఛ
శివునిఁ బూజించి యా చిత్రసేననృపతి । భవ్యగుణశీలయా చిన్నిబాలఁ గనియె ॥౧

మ॥ ఒకనాఁ డానరపాలమౌళి సభలో నుద్దామసిద్ధాంతశా
స్త్రకళాభిజ్ఞులఁ జూచి జాతకము మీరల్ వ్రాయుఁడీ చిన్నిబా
లకకున్ వ్రాసి భవత్కుమారి పదివేల్వర్షాలు జీవించు గెం
టక పద్నాల్గవయేటఁ జెందుఁ బతి గండం బంచు వాచించినన్ ॥

క॥ చాలఁ దదీయోక్తి మహీ । పాలకమణి తనదు చెవులఁ బఱపిన నిద్దా
వాలికబలు నారసమై । చీలికలో నరింప మిగులఁ జిడిముడితోడన్ ।

ఉ ॥ బాల్యమునందయీ శిశువు భాగ్యమిటుండఁగ నేమిచిత్తచాం
చల్యమునన్ ఘటించితినా శాంభవపాదసరోజపూజసా
కల్యముఁ జెందకుండ నటుగాని యెడన్మది కోర్కికిట్టి వై
కల్యము బుట్టునే యనిదగంగడుఁ బొక్కుచునుండు నత్తఱిన్ ॥

## తృతీయాశ్వాసము.

### సత్యప్రతిజ్ఞుఁడను విప్రుఁ డొకఁడు రాజుం జూడవచ్చి తత్పుత్రి సీమంతినిన్ దీవించుట.

తజ్ఞుఁడు దైవజ్ఞుఁడు కృత । యజ్ఞుఁడు సత్యప్రతిజ్ఞుఁడని యెడు సరసా
భిజ్ఞుం డనఁదనరెడు విప్రుఁడు । ప్రజ్ఞాబలశాలి వచ్చి ప్రౌఢిమ మెఱయన్॥

గీ॥ వచ్చి దీవించెఁ బదివేలవత్సరములు । కలితసౌభాగ్యగరిమంబుఁ గాంచి మి
యీకుమారిక పరితోషమీకు నొసఁగ । మనుమలనుగూడి జననాథ మనుమట

క॥ అనవుడు ధరణీపతి చ । య్యన రాద్ధాంతికుల నిర్ణయంబుల తెఱఁగు
ల్వినుపించి భూసురోత్తమ । పనివడి మీ రెట్టు లిట్లు బలికితి రనుఁడున్॥

వ॥ అమ్మహీసురకుమారుం డిట్టు లనియె॥

మ॥ నిరతింబండితులేగతిన్ బలికిరేనిం బల్కనీ; శాస్త్రమే
కరణిం జెప్పినఁ జెప్పనీ; నుదుట నాకంజాతసంజాతుఁ డే
సరణిం వ్రాసిన వ్రాయనీ, తలఁపనస్మద్దివ్యవాక్యంబులో
ధరణీనాథవతంస తప్పవు సుమీ తథ్యంబుగాఁ బల్కితిన్॥

చ॥ అనవిని జాతహర్షమున నానరపాలకమౌళిరత్నకాం
చనవివిధాంబరాభరణజాలము భక్తినొసంగి పంపినన్
బనివిని యామహీసురకుమారుఁడు నైజవచోనుపాలనం
బునకగజాతఁ గూరిచి ప్రమోదమున న్దపమాచరింపఁగన్॥

### విప్రుఁడు తనవాక్యపాలనముకై దుర్గం గూర్చి కలధౌతగిరిం దపమాచరింప నింద్రుం డులికి తపోవిఘ్న మొనర్ప రతిపతిసహితముగ మేనకాదుల నంపుట.

మ॥ వలనొప్పన్ జనికాంచె గోత్రవిమతావాసామరాద్రిక్రుధా
కులవీక్షావినిబద్ధతత్తనుజనఃకోటీభవద్దేవతా
లలనాపూజితహేమపుష్పగిరిజాలాక్షాపదాంభోజమున్
గలధౌతాచలరాజమున్; శిఖరరంగత్తారకారాజమున్॥ ౨౩.

క॥ అచ్చట సలిపెఁ దపంబువి । యచ్చరులరుదందిపొగడ నంగజతనుపా
టచ్చరుఁడగుహరుదేవి । న్మచ్చికనెమ్మదిని నిలిపి మౌనత మెఱయన్॥ ౨౪.

క॥ అప్పుడు సురనాయకుఁడు క । కుప్పతియుతుఁడగుచు హరునిఁ గొలువఁగఁ జనుచున్
ముప్పిరిఁగొని యెడువగతో । నప్పారునిఁ జూచె గుండియ నఱుక్కనఁగన్॥

వ॥ చూచి వికలితచేతస్కుండై పురికేఁ జనుదెంచి హజారంబున నేసకలవిబుధజనం
బుల నంచి యేకాంతమందిరంబుఁ బ్రవేశించి గురునితో నొక్కించుక విచారించి

మదనునిరావించుటయవశ్యకర్తవ్యంబుగాఁదలంచికంచుకినంపించిపిలుపించిన

సీ॥ నీటుచన్నొనగబ్బపోటునఁజిట్టగయించుచరణఘట్టనయురస్థలిరహింపఁ
గొప్పిన్యాడికొనగోటికుమ్మెలుబిగియించు చెంపపెట్టుకపోలసీమవెలుఁగఁ
బలుగంటిననదరనేయులతాంతములఁజంతినెఱతేఁటిగుఱుతువాతెఱనుమెఱయ
నుదిరికెంపులదండియెత్తుచీరలురేఁచుజడవాలుకంఠదేశముననమర
నమరపతికొల్వునకువచ్చెసుమశరుండు। గులుకుపాలిండ్లగయ్యాళితలిరుబోండ్ల
యారజపుబేరజపుఁజేఁతలపుడుజూపి। కచ్చుకొనిదూఱుజెప్పంగవచ్చుకరణి॥ ౨౭

క॥ వచ్చినరతిపతికెదురుగ। వచ్చి మణీపీఠనుంచివాచంయమవై
యచ్చరవరునిచరిత్రము। లచ్చువడందెల్పియింద్రుఁడనియెఁజేర్మిన్॥ ౨౮

ఉ॥ పంచశరా భవద్గురునపారకృపారసవీక్ష నేను పా
లించుసురాధిపత్యమవలీలఁగొనంజడదారియొక్కఁడూ
హించి హరాద్రిచెంతఁదపసీయెడఁజేయఁదొడంగెవానిఁగ
దించి మదీప్సితంబొసఁగనేకుచితంబెగదా తలంపగన్॥

సీ॥ కొలువుండనిత్తురేకోరుకోర్కులొసంగు చింతామణీదివ్యసింహపీఠిఁ
జేరనిత్తురెయర్థిజీవనావనవిచక్షణములౌకల్పభూజములనీడ
నిలుజేరనిత్తురేయెల్లవారికిఁబ్రతికామితార్థములిచ్చు కామగవిని
యెక్కనిత్తురెసమీహితఫలప్రదవృత్తి వరలెడుజీమూతవాహనంబుఁ
గడఁగిజడదారిబొబ్బమెకంబులహహ। చండభుజదండకిసలయచాపశం
తంత్రినిలిపినవారుగాఁదలఁచిమమ్ము। దండిమైనీవుకాపాడకుండితేని॥ ౩౦

క॥ వాలారుఁజూపుఁగోపుల। వేలుపుఁబూఁబోండ్లునీకు వెనుబలముగనీ
వేళన్మునిపైఁజూపుము। నీలావురతీశకావునెఱిమమ్మనినన్॥ ౩౧

క॥ నగవైరిమాటనివెమ్మదిఁ। దగునేదఁగిపేకుబాకుధారాధారన్
దెగటార్చెదఁబగఁదీర్చెద। నగపార్చెదనేనుగల్గనగవందగునే॥ ౩౨

సీ॥ నాయమ్ముదాఁకికందనితాపసులునాలకోరి బాఱనిమానికుంజరములు
నాసాయకమునఁగుందనితపోధనులువాబెడఁదతూపునకగపడనియతులు
నాశరమ్మునయమంటనిజటాధరులునాచిల్కుచేఁదెగనిముష్టింపచులును
నాయంపమొనకుగెంటనిమునుల్నారసమ్మునఁదూలనిజటిలవరులు
వెతకిచూచినఁగలరె యీవిశ్వధాత్రి। వరయహరిహరాజముఖ్యులైనవేల
రాచవారలునాకత్తికోఁచవార। యితఁడనఁగనెంత బలహీనత యేలవంత

ఉ॥ పెట్టినదండదీయకయెపేర్చిత్రిమూర్తులఁబట్టికట్టియి
ట్టట్టనలేకమేనునగమైదఁగానాకపెట్టుఁబెట్టిరీ

గిట్టి వెడందపేరెద ఢకీరున మొట్టితి నోరుఁగొట్టితిన్
గట్టిడిదిట్టు కూళమునిగర్వమడంచుట నాకుభారమే ॥ ౩౪.

క॥ వెతబడుగున్నడతారుల । చెడుగుంబోఁడుములదిరుగఁజేయుటయరుదే
వడినాయడిదంబునకే । యెడనుడువందగమమీర లెత్తేఁగినపనికిన్ ॥ ౩౫.

క॥ అనిలేనగవ్వాననమున । నానరంగాఁబల్కియింద్రుఁడానరించుప్రియం
బునఁబొదలుచునచ్చరలన్ । మనసిజుఁడిటుబిల్వఁబంపుమాయను వేళన్ ॥ ౩౬.

సీ॥ ఇంద్రుండుగురునితో నేకాంతమటగదా యేమికార్యమువింటి వేఘృతాచి
నగరివాకిటనుండినలకూబరుఁడువచ్చెనటవా త్రవినలేదెయతఁడురంభ
కచుఁబంచిపూవిలుకానిఁబిల్వఁగఁబంచినాఁడఁటరాజువిన్నా వె హేమ
రతిచిల్కతనకుఁదత్పతిముద్దుచిల్కతోవనికవ్రాయించుట వినవెహరిణి
యనుచుఁదమలోనగుజగుజలాడుకొనుచు । నలుగడలఁబాఱచిడిముడిగలిగిమెలఁగు
సురసతులుసద్దునను వేల్పుసూళెకేరి । నంతటనుహల్లకల్లోలమయ్యెనపుడు ॥ ౩౭.

క॥ ఆరొాదవినితన్మూలము । నారదమునివలనమునువినంబడుకతనన్
వారించివారిమేనక । బీరముబొదలంగఁబల్కె బెదరకుఁడనుచున్ ॥ ౩౮.

శా॥ కైలాసాద్రిసమీపభూమినాకవంకంగాననేమో యొకం
డాలుంబిడ్డలఁబాసిడస్సెనటనాయయ్యన్మహాదేవపూ
జా లోలాత్మత నేగుచుంగని సురాచార్యున్ మరుంగూర్చి దా
నాలోచింపుచునున్నవాఁడఁట విభుండంతేల నేనుండఁగన్ ॥ ౩౯.

క॥ జడదారిఁబట్టి దేరన్ । దడవాయిపుడేగియమరనాథుఁడుమెచ్చన్
జడలొాడిసిపట్టి తెత్తునె । జడఁజిక్కినదయ్యమట్లఁజనుదేరంగన్ ॥ ౪౦.

క॥ అనియందఱనటుగనుఁగొనఁ । గనుఁగవ్వలవింత నగవుధవలుకొనంగాఁ
దనసౌందర్యమదంబునఁ । గనుగానక వేల్పుమగువగడఁకదలిర్పన్ ॥ ౪౧

సీ॥ ఘనకుండికను మానికపుగిండిగాఁబూని కల్పకంబునఁబుట్టు కల్లుఁబట్టి
వల్కలంబులుగోసివరుసజల్లులుసేసికడమెక్కబిరుదుఢక్కలకుఁజెక్కి
తనరుదండపుఁగట్టియనుబెత్తముగఁబట్టి ప్రతిహారులనబరాబరికిఁజేరి
దేవపూజాపేటిఁదిగిచినంబులసూటి కడుమించుతెలనాకు గములునించి
తమకమునఁదనపయనంబుదారిఁదెలసి । పయనమగుచున్నయట్టితపస్వివరులఁ
బదమనుచునేగెమేనకాభ్రమరచికుర । పాకవిద్వేషికొలువుటుప్పరిగకడకు ॥

చ॥ చనియటనిర్జరాధిపతిసన్నిధినిల్చిపరాకుజియ్య యే
మునియొతపంబుసేయుచుమిమున్మదిలోఁగలుషింపఁజేసినాఁ

డనవినిదానిపై నెలవునంచుటకేఁజను దెంచితిన్ననుక్
బనుపుమునావుడుక్ ఖిదురపాణియు నాతుకవాణికిట్లనుక్॥ ౮౩.

మ॥ నగజాధీశ్వరుదుర్గశృంగనపకానంబార్వతింగూర్చివిం
తగ నీమింటికి మంటికిం బరపుసూత్రంబోయనన్నెత్తికొ్రం
బాగతేవంజడదారియొక్కఁడుతపంబుంబూని నేనంతటక్
దగఁజింతింపఁగదానికీవ నెలవన్నక్ జింతనాకేటికిక్॥ ౮౪.

సీ॥ కలవిలేనివిగొన్ని కాలువునఁ గూర్చుండి గద్దెవంతులుజెప్పఁగలరుగాక
యిలసొమ్ముకర్తలవలెనచ్చికలుబుచ్చికలుచేసిభుజియింపఁగలరుగాక
బంతికూళ్లకుఁబ్రీతిఁబరతెంచీతోడతోడఁగలయబంతులుసాఁగఁగలరుగాక
శుభశోభనములదుస్తులొసంగవెన్కముందులకునట్టులుసేయఁగలరుగాక
తేకనీవలెస్వామికార్యైకపరత। వచ్చితముఁదామెనెలవనువారుగలరె
యాత్మమెచ్చితిని చ్చెదమడుగుమనిన।నింద్రునకువేల్పుఁబూఁబోఁడియిట్లులనియె॥

ఉ॥ మెచ్చులకెంతకార్యమిదిమేకొనియేనిపుడీవులందఁగా
నిచ్చటియచ్చరల్నగరె యిట్టిదియే సమ యంబువేఁడ నై
యచ్చరసార్వభౌమ వినుమిమ్మనిచంద్రుఁగలంచిసామికిక్
మెచ్చుఘటింపనోపినను మెచ్చెదరిచ్చెదరీప్సితార్థముల్॥ ౮౫.

సీ॥ తమలంపురసమంటి తనరుకన్నులతోడ మొనపుఁగాటుకరేకమోవితోడఁ
గొ్రవ్వాడికొనగోటికుమ్మెచెక్కులతోడ లత్తుకంటిననిటలంబుతోడ
సందితాయెతుచీరలందుకంఠముతోడ సరులొత్తినాక్కువక్షంబుతోడఁ
జిటులుగందపుఁబూఁతచెలువుమైసిరితోడఁ గొద్దిగాఁజెదరిన కురులతోడ
మానియలజాతికొంచెపుగానిరీతి। రాతిరిఁబగళ్ళుమెలఁగదుర్వారగరిమఁ
దపముచెడఁబాపిగానిసుత్రామనీదు। సముఖమునకేనురానునీచరణమాన॥

సీ॥ పెనుకువనంటిన నునుచందనపుఁబూఁతపొందుగానలఁదినబూదిగాఁగ
బటువునిబ్బరపుసిబ్బెపుగబ్బిసరులయొత్తులుతమ్మిపూసతావలముగాఁగ
దగఁగట్టివిడిచినజిగికుంకుమపుమైల సన్నపుఁగాషాయశాటిగాఁగ
బదనఖంబారసియేర్పడునెన్నొసలికంము పొసఁగఁజెట్టినపేర్మిబొట్టుగాఁగ
నాత్మజానందకందళితాంతరంగు। లగుచునధరామృతపుభిక్షనారగింప
మఱిగిమెడఁబట్టినూకినమనికివెడలి। చననితపసులకన్న నీమునిఘనుండె॥ ౮౬.

సీ॥ ఆరగింపయతీంద్రునధరామృతమెగాని కనుగూర్కఁదపసిసొమ్మునసెగాని
చుట్టఁగొప్పనమునిఁగట్టుఁబువ్వులెకాని కైదండఁగొనమానికరమెగాని

# తృతీయాశ్వాసము.

యూలింపజడదారియనునదొ క్తులెకానితగఁజూడప్రతిబెట్టుసొగసెగాని
నలుఁగిడయమిగూర్చుకలపంబునసెగాని నటియింపజటిలుముంగిటనేగాని
పలుబలుకులేలయిదిమొక్క ప్రతినవినుము । జటిశిఖామణిదూపా ర్తిపిటునిజేసి
కానియోదేవదేవతామాననీయ । సముఖమనకేనురానునీచరణమాన॥ ౪౯.

క॥ అనిప్రతినఁబలుకుమేనక । కనవద్యముకట్టువర్గ.మాదటసురనా
థునిచేనిప్పించిమరుం । డనుపమగతినింద్రుఁడనుపనచ్చెలిగొలువ‌న్॥ ౫౦

మ॥ తెలిపూగద్దియగాడుపుంగొదమమ స్త్రీనెక్కిలేఁదేటిగం
టలసంధిల్లురొదాళముల్బరవమింటన్వెంటఁజంద్రాదుల
గ్గలికన్ముంగలఁబారుదీరినడువంగాలార్చుచున్నాకికెం
దలిరుంబెద్దహజారపున్నడిమిచెంత‌న్డిగ్గి తానచ్చట‌న్॥ ౫౧.

వ॥ అపుడుభయపార్శ్వవర్తులై బలసికలసికొలిచియున్నచంద్రాదులవిలోకించి,
పయనంబైతండుపొండనిపంచి , కూచిసేయనియమించి,యతఃపురంబుఁబ్ర
వేశించి,మజ్జనభోజనాదికృత్యంబులు నిర్వర్తించి,రతికలహావైరించియగునా
రగమంచి మంచిమెఱుంగుపరంగీలాగికెంపుజాపతంగిపీటనధివసించియున్న
సమయంబున॥

సీ॥ తరితీపుఁజూపుబిత్తరిసోగనునుజూపులలులకుబయలువిందులుఘటింప
మృదుభుజాయుగళంపుమినమినల్ రాయంచతెగలకురిత్తపండుగరచింపఁ
గల్కితీయనిముద్దుపలుకులుచిలుకలకూరకూరకయన్నోరూరఁజేయ .
జిగిగుల్కుచికిలిలేనగవుతేఁటచకోరములఁబట్టిపట్టిబంతులకుఁజొనుప
నడుగడుగుకెంజిగురుటాకుకడుపుకూటి।బంటుగములకురవళిసంబళములొసఁగ
నిండుమురువుననాకతెక్కైదండఁబూని। పతికడకువచ్చినిలిచెనారతివధూటి॥ ౫౩.

క॥ వచ్చినరతిఁగనుగొనివై ।యచ్చరపతిపంపువెట్టయతివరుపైఁదా
విచ్చేయఁగల్గుకార్యము। పచ్చనివిలుకాఁడుదెలుపఁబడఁతుకపలికె‌న్॥ ౫౪.

మ॥ హరికింబట్టపుముద్దుపట్టివగుమీకా యిట్టియుద్యోగమి
ల్వరుసన్నెమ్మదినుంచఁగావలదెజాళ్వాకొండపైపర్లైకు‌న్
వారయంతేకదవజ్రివాఁడొకప్రభుండు‌న్బోలెమిమ్మంపెఁబో
పరులెల్లన్నగమీకునాప్పఁదగునే బాగాయెఁగావల్లభా॥ ౫౫.

సీ॥ కదిసిశూర్పణఖపేరెడఁవఁజిక్కునఁగ్రుమ్మిజటులమెప్పించునీసాహసంబుఁ
దవిలిరావణునిదెందముఁజటీలునఁగొట్టిసురలమెప్పించు నీయరిదితెగువ
మునుబూదివిాలదిండిమనముపక్కునఁదెర్లించిభవునిమెప్పించునీబంటుతనముఁ

దెగియమోముఖిమనోధృతిఁ గలుక్కన ద్రుంచిజగము మెప్పించునీమగతనంబు
విన్న మెత్తురుగాక లేకున్న నగరె। యఖిలలోకైకపూజ్యులై నట్టియతుల
యతులతపములు జెఱుపఁగా నాత్మఁదలఁచి। జీవితేశ్వర నీవు వచ్చేసితేని॥ ౫౬

మ॥ అనువారిఁగన నేరకూరక యహల్యాకాంతకుం దిట్టుర
ట్టును బుట్టించిన గట్టువాయి చెడుగొట్టుం గొట్టు బల్దిట్టువా
దన మెట్టుం దనపట్టు గాఁదపసిచిత్తం బిట్టటుం గట్టుమ
ట్టున వెట్టుం గ్రమకించువారి నెడబుట్టుం బెట్టు మాయించదే॥ ౫౭

మ॥ చిగురొత్తం బగ్గయంబగర్భమునఁ గోసెం గత్తి కొక్కింత కం
డగనీ నెచ్చెలి కాని గాడ్పు దొరబిడ్డన్ని న్నేనేనిన్ను చె
ట్టగముక్కంటి వెడందకంటి యెఱమంటన్ దోఁచెనాయింద్రుతో
మొగమోటంబిక నేలమాను పయనంబుల్నాథ నేవేఁడెదన్॥ ౫౮

క॥ అనవుడు దీయని విలుదొర। కనుఁగల్వల నగవు దేరఁగాఁ గనుఁగొని నీ
మనమునఁ గలబలుకూరిమి। వినుపించితి వందుకేమి వినుమని పలికెన్॥ ౫౯

ఉ॥ పట్టిన కార్యముల్ విడువఁ బాడియె పాంథయెలుంగ వోటునేఁ
బట్టిన నుక్కచచ్చు విడిబాటున నొక్కట గాలిఁ బోవుయేఁ
గొట్టిన పిండి వాఁడతఁడు గూర్చుతపంబన నెంత దుమ్ముకుం
జెట్టుకు లాయిదుడ్డు పెను పెట్లకుఁ దాళున యే తలోదరీ॥ ౬౦

మ॥ అలరుంగైదువుదారి నీటజనితంబై పల్లవస్వాంతపుం
బులుచేరెకొక్కని కొమ్మయయూర్పు వలిగాడ్పుం బ్రోదిసన్యాసిబో
డలపై నెక్కితపంపుటింధనముఁ గొంటన్ మత్ప్రతాపాగ్ని దా
కలభవ్రాతము మాడ్చు మాడ్కి మునిపాకశ్రేణి మాయించదే॥ ౬౧

చ॥ చులుకన నన్నుఁగన్న మనసున్ లయమొందఁగఁ జేసినన్నునుం
గెలువఁగఁ బూనియున్న మునికీటములన్ విరవాది మొగ్గపే
రలుఁగుల పాలు జేసి జయమందుదుఁ దుందుడుకైనయట్లుగాఁ
గొలపసఁ దీర్చుకొనికొడుకున్ గొదుకే మదిలోఁ దలంపఁగన్॥ ౬౨

చ॥ అనుడు నిజాధినాయకుని యానతికించుక నూఱుఁ బల్కఁగా
మనమునఁ గొంకి నాథ యనుమానముచే నిట్లు విన్నపంబు చే
సిన నవితప్పుగాఁ దలఁపఁ జెల్లదు దేవరచిత్తమంచుఁ జ
య్యనఁ జిగురాకువిల్లు నన యమ్ము నయమ్మున నిచ్చిపంచినన్॥ ౬౩

మ॥ బలుకెంపుంజిగి కెంపుటామొగసరింబల్ తెక్కడాల్పచ్చ ని

చ్ఛలపుంబట్టుమెఱుంగుఁబల్లమున నెంచన్నిరచుపల్వాన్నెక్రొం
దళుకుం గంఠపురేక కున్నరిపెణఁగ బాగైన చౌకట్టుపుం
బలుకుం దత్తడి నెక్కి దర్పకుఁడు దర్పంబేర్పడన్నూకినన్॥ ౬౫.

క॥ త[illegible]ధేయనినునుకే । సరపుందరటునఫలీనజాడించినఁదా
నరుగ్గికజండితనంపుల్ । సరకరిశుకసైంధవంబుగళవళపడుచున్॥ ౬౬.

గీ॥ మస్తకము దువ్వి పలుమాఱుఁగుస్తరించి। సమరసముఁ జూపి మెల్లన సముతుపఱచి
వాగె బిగియించి తమ్మినూల్వాగె సడలి। పన్నె సోఁకినముందఱఁబరవ దయ్యె॥

వ॥ అంతరతికాంతుఁ డనంత[illegible]తుం డైశుకహయా
వరోహణంబాచరించి॥ ౬౭.

సీ॥ మొగలిఱేకల్లికతోఁగ కాండచట్టము కుఱుగన్ను చెఱుకుగ్రొమ్మెఱుఁగుఁగ్రొమ్ము
జిగిగుల్కులేమావిచిగురుటాకుపదంబుఁదొగరుఁ నెత్తామరతూఁడుగొడియ
లలరారుకురువేరుతళుకుబల్మొసనాబుఁబరువంపుఁబోఁగడపూఁబటువుదిండ్లుఁ
బొన్నాకుమేల్పచ్చవన్నియపస్నాగమరఁటిక్రొవ్విరిగుత్తిగొనబుకుచ్చు
బొండుమల్లియపఱపుఁగప్పురపుటొరుఁగు। వలపువిరవాదిబటువుబిల్లలునుగలుఁగు
నందలము వేల్పుఁదొయ్యలులెచ్చరింప। నెక్కియొకకొన్నిపయనంబులేగియంత॥ ౬౮.

వ॥ తదీయాశ్రమంబుఁ జేరనేతెంచి తన్మహిమంబాలోకించుతఱినక్కుంతునకువసం
తుం డిట్లనియె॥ ౬౯.

{ మునియాశ్రమవనమహిమన్గంతునకు వసంతుఁ
డు వర్ణించిచెప్పనాలింపుచు మునిం గాంచుట. }

సీ॥ వికటవాతాహారవిభుసానిలమె కాని భుజియింపశంకించు భుజగగణము
దళభోజిచర్యతో ధ్వాంతపర్ణమె కాని పాశించ భీతిల్లుఁ బరభృతంబు
కందమూలాశిభుక్తత్యక్తకందమూలమె కాని తినఁగొంకు సమదకిటులు
సరసపలాశనాస్వాద్యశిష్టఫలౌఘములె కాని మెసవంగ నళుకుఁ జిలుక
లితరమిటుఁగం బెరతినాథకృతవితాన। జటిపురోడాశవస్త్రదీక్షానితాంత
కర్మఠచ్ఛాగహరిణసంఘాతమగుచుఁ। బావనం బైనమౌనితపోవనంబు॥ ౭౦.

సీ॥ ప్రతిజంగమప్రపాతతులువోయి వియంచు నాలఁగ్రొల్పులి జేరియఁటవెఱచు
మఖిపురోడాశంపుమను బోనపుటికంచు మేకపోతును తేఁచు నాకఁగొంకు
ముని పట్టుఁబుట్టముల్ జినుఁగునంచు సిఫంగి లేఁటి మైఁదనగోటమీటనళుకు
జడకారితలఁ మిన్న నడప్రసాదమటంచు ములకతె మ్మోరఁ బాముమట్టబెదరు
నిచటఁగనుఁగొంటె మదనయోహృదయసదన। దుష్టవైశిష్ట్యభయదబంధురతపోధు

రంధరాశ్చర్యధుర్యచర్యాసమేత । మేతదాశ్రమమహిమ నూహింపఁదరమె॥ ౨౧.

సీ॥ పుట్టతేనియఁ గ్రోలఁ బోదవు చీమల మెక్కి లూటిఁ గైకొనదు భల్లూకగణము
మృగనాభిరక్తమింపుగ నానువృకినంటి జెలిమిఁ గైకొనవు బెబ్బులులగములు
గంధేభమదము నాఘ్రాణించు హరిఁ గొట్టి బలిమి ముట్టదు శరభవ్రజంబు
బలికినై మూఁగి పైఁబడదు మూషికమునాంచి దుడుకనఁ జేరదోతుప్రతాన
మారనయమారహింసాభయంబుఁ దలఁప । దుర్ఘటాటోపదుష్టజంతువులయందు
నిచటి మహిమంబు లెచ్చోటనేనిఁ గలవె। పల్లవధనుఃకృపాణ,యోపంచబాణ॥ ౨౨.

సీ॥ తుదఁ గ్రొవ్విరులనుండి దుముకు తేనియజాలు నిడుదకెంజడలకై వడినటింపఁ
దతమధ్యభాగవేల్లితలతావలయముల్ యోగపట్టికల చెయ్వులు ఘటింప
నిగనిగల్ బ్రకటించు జిగురుదట్టపుఁ గెంపు గావిదువ్వలువజ్జోకలు రచింప
సుడిగాలి నెగయు పుప్పొడి దిన్ను రవచాలు నలుగడ శిఖిశిఖాకలనఁ బెనుప
భక్తిఁ దనుఁ జేరి నిలుచు తపస్వినికర । ములకు సద్యస్తపస్సిద్ధిఁ గలుగఁ జేయు
తపము సలుపంగఁ బూనినదారి దెలుపు। ఘనతరులఁ గంటె మదనయీవనమునందు॥ ౨౩.

శా॥ చేతోజాతపరాకుఁ గంటె విమలశ్రీయుక్తి నిచ్చోనిదం
చ్చాతుర్వైద్యరహస్యపారగ తపస్వ్యాపన్మణీసేవనా
ప్రీతిం జేరు నభస్రవంతి యనబింబీభూతతారాపథ
స్ఫీతాంభః పరిపూర్ణతాకలితమై పెంపొందు నీతీర్థముల్॥ ౨౪.

మ॥ తనరన్ భూరియుగసూచితాంచితమహాచాత్తానుదాత్తచ్ఛలం
బున బ్రహ్మాసనమందు రాశ్వములనోర్పు స్నేర్పుగ స్పష్టజో
డనలం దీర్చుచు సాధులై యెలమిగాఢబ్రహ్మచర్యావ్రతం
బున మెప్పించినవారు వీరు హరునో పుష్పాస్త్ర వీక్షించితే॥ ౨౫.

శా॥ అస్తోకక్రతుహోమధూమములఁ ఛాయల్ తీర్థకుండంబులన్
మస్తైతో పగఁ జూచియందు నెసఁగెన్ ధూమంబిటన్ దూరతో
పాస్తంబగ్నిమనంబునం దలఁప నాహా తప్పెఁబో "యత్రధూ
మస్తత్రాగ్ని" రితీరితంబను శ్రుతిన్ మారా? కనుంగొంటివే॥ ౨౬.

మ॥ తలిరుంజొంపపుడాలు పేరిఁటదిగంతవ్యాప్తమౌనీం
ద్రలలామాగ్రతపఃకృశానువునఁ దప్తంబై బయల్గంబదెనా
నలువంకన్ గనుపట్టెఁ గంటె రతికాంతా? యజ్ఞవాటీసము
చ్చలదేతద్ఘనహోమధూమలత లెంచన్నించిరమ్యస్థితిన్॥ ౨౭.

వ॥ అని తెల్పనాకర్ణింపుచు ముందఱ ననతిదూరంబున॥ ౨౮.

ఘూర్ణమధ్యదృశచతుర్ముఖునివార్ణిల్గనవిచ్చుగవిలఘాతిఁద్రిపుండ్రకంబుదనర
వరమస్తచంద్రస్థపరజటాపటలినాసంవృతశ్మశ్రుకేశములుదనర
పావనత్వవిభూతిఁబట్టుచిక్కముఠీతిముడుతవీదనరాలయొడలుదనర
నేతదంతస్థయైయొసఁగుసీశ్వరియంచుఁ దెలుపుకైవడిలొమ్ము వెలికినిగుడ
ఘస్త్రినిర్మలశారదాంభోజముఖికిఁ। గూర్మిఁబుట్టించుమోహంపుఘుటికలనఁగఁ
గలజపమాలయనుపమలీలవ్రేలఁ। దపముఁగావించువానిసుత్రాముఁగనియె॥

**ననింగాంచి మేనక ప్రతినలువలుకుచు సమీపించి యందఱఁజేరి పముఁజెఱుప వివిధోపాయంబులఁ బ్రవర్తిల్లి విఫలులై తన్మహత్వమునకు వెఱఁగంది యింద్రునకావృత్తాంతముం దెల్ప బెగ్గిలి త్రిదివంబు వారందఱు వలసలు సాగుటకు యత్నించుట.**

కనివలిగనిదారలదారల। ననుపమగతిననుపమఘనుఁడాలోనాలోఁ
జననున్నవారిఁగనుఁగొని। మినుకెనయక బొగరుమేన మేనకపలికెన్॥ ౭౦.

ఘనపదాతిస్ఫూర్తిగనుపట్టిమించఁగాఁ బైగా సుధాధామ బలసిరమ్ము
తరలకమాధవా దళములనెక్కించియలరుఁగోపులనుమావులనునిల్పి
మలరిగంధవహా నిరవధికరేణుబృందములమున్కలుగనంతటనుగప్పి
ఘావసంభవదేవ దేవర హరితపత్రరథంబుపైవెన్నుఁదన్నినిలువు
మీరలీరీతినడచినమీఱనీక। జోకశుకపికశిఖిముఖానేకబలము
వెడలిమునిధైర్యసంపదవీటఁబోవఁ। గొల్లబెట్టుఁడుప్రతినలుజెల్లునటుల॥

చలపట్టివలరాచచదువులఁజదివింతుసడలింతుఁదొల్లింటిచదువులెల్లఁ
బట్టిచెప్పుదురతిప్రాణేశుమంత్రముల్ మఱపింతుమఱియన్యమంత్రకలన
నెఱిఁగింతునలయాశయేశయధ్యానంబుఁదఱఁగింతుఁబరనిధిధ్యానగరిమ
సేయింతునిర్గతంబుఁజిత్తసంభవుపూజవదలింతునితరదేవతలపూజ
చిత్తనూయోగసామ్రాజ్యమహిమమదన। వరతపోవైభవంబుసాఫల్యమొంద
నాకలోకానుభవకాంక్షనాచరించు। నలజటాధారితపమునిష్ఫలమొనర్తు॥ ౭౨.

చటులతరసురభిబాణో। ద్భటనటనపటుప్రతాపతాపాగ్నిశిఖన్
జటివరునితపోరాశిన్। బెటిలింతున్ వానిమనసుబిగిఁజిటిలింతున్॥ ౭౩.

నిచ్చేయుఁడనుచునిటులవి। యచ్చరసతిపలుకుఁబలుకులలరింపంగా
నచ్చోటుఁగదలినిలువక। విచ్చలవిడివచ్చివచ్చివేడుకలాలయన్॥ ౭౪.

ఫణిరాజభూషణుపత్నినెమ్మదినిల్పుయతిఁజూచిగుండియలావళింప
హరునిపట్టపుదేవినాత్మలోనునిచినజటిఁజూచియొడలెల్లఝుల్లురనఁగ

దక్షాధ్వరధ్వంసిదయితఁజిత్తముఁజేర్చుదపసిఁగన్గానిమదిదద్దరిలఁగ
బలువెట్టకనుతేనిధామలోఁబదిలించుమునినాథుఁగనిపాదములువడంక
నిచ్చలోనిచ్చలింపకఁజొచ్చిరపుడు। గంధవహాగంధవహకాండకాండజాతి
జాతివిద్వేషులాశ్చర్యచర్యపరమ। పావనంబైనమానితపోవనంబు॥ ౭౯.

ఉ॥ అత్తఱిఁదోడిచెల్వలహహా యిదిగోవలిగాడ్పుమమ్మఁదూ
ర్పెత్తెనసంతుఁడెంతయురక్షించఁగనాకులపాటుఁజూపెహు
ర్మత్తుగఁదోఁచెమింటనెదురన్ ద్విజరాజొకఁడుద్ధతిన్మఘూ
ద్యత్తరవారివెల్వడెఁబతత్తురగుండయిచూడుకోమలీ॥

సీ॥ తెలియంగఁజూడుమీలలనామతల్లికవలపుఁజూపునుగిన్కఁదెలుపుఁజూపు
వడి నాలకింపుమీ వనజాతలోచనజక్కఁబల్కును బ్రేమగుల్కు పల్కఁ
దగ విచారింపుమీ తరుణీశిరోమణిలోఁగుసేఁతయుమదిఁగ్రాఁగుసేఁత
వేగమూహింపుమీ విధుబింబముఖికోపగిలినభావముసమ్మతిలినభావ
మనుచుఁదను నెచ్చరింపనూఁకొనుచువినుచుఁ। బచ్చవిలుతునినడయాడుగచ్చుకోల
పూన్కి నవ్వేల్పుజిగురాకుఁబోఁడియునల। మానిపరమేశ్వరునియాశ్రమంబుఁజేరె॥

మ॥ మతినూహించుచునచ్చెలింగనుచునీమాటల్ గటాయీయుప
శ్రుతులేలాగునవీనులంబడియెనంచున్నిక్కిలింజొక్కుచున్
రతినాథుండెకలందునాకిఁకవిచారంబేలనంచున్నన్మదిన్
ధృతినొక్కించుకచిక్కఁబట్టిసురనారీరత్నమగ్రస్థలిన్॥

సీ॥ చెవిగూఁటనెలకొన్నకవపిట్టకవకివల్గ్నానసినాదబ్రహ్మమినుమడింప
మైనిండుసాలినిమగ్గంపుఁజకచకల్ బూదిపూఁతకురెట్టిపుట్ట సేయఁ
దలబల్లి పొరబిల్లతళతళల్ మస్తేందుబింబబాహుళ్యంబుపెంపుఁదాల్ప
మెలిగొన్నపాఁపరామినమినల్ యోగపట్టికకుఁబౌనఃపున్యమొకటఁగూర్ప
లోకభీకరదుస్సహాలోకపటిమ। బ్రహ్మవర్చస్సచటయుట్టిపడినయట్లు
తపముఁగావించుమునిఁగాంచెదనకుఁదాలుత। నగునశకునపరంపరతాన్నఁదోఁప॥

వ॥ కాంచియొక్కించుకతడవువితర్కించి॥ ౮౦.

సీ॥ బ్రహ్మసంధానపారగునకీతనికినాజిగిచూపుఁగల్వలింపగుటయరుదె
మస్తేందుసుధఁగ్రోలమగుఁగుసీతనికినాతేటమాటలుప్రియంబగుటయరుదె
కుండలినాత్మమేల్కొల్పునీతనికినావాలియూర్పుగాడ్పుగావలయుటరుదె
సారబింబాలోకచణునకీతనికినాయానసాంబుజమిష్టముగుటయరుదె
యనుచునాకరీతిఁదనడెందమనువుపఱచి। చెఱకుసింగాణివిలుకానిచెఱకుఁదగిలి

మనువ్రతభ్రష్టులైయున్న మునులకన్నఁ। బదిలుఁడయితఁడనిమనోజుమదిఁదలంచి॥

సీ॥ చనుజక్కవలకుమెప్పనకిడ్డబిసఖండములలీలహారముల్ ముద్దుగులుకఁ
గనుదోయినెలఘల్లుఁగవకుంచుతళుకువెన్నెలవీఁకఁగపురంపుఁదిలకమమరఁ
గచకలాపికిభుక్తికైనిల్పుతాఁచునాసాగసుఁబాపటఁ జేరుచుక్కదనరఁ
బలుకుఁజిల్కకుఁజెట్టుపులకండమోయనముంగరముత్తెంబుమురువుఁజూప
మొలకనగవులుమొగమునఁగులుకరింపఁ। దళుకుఁదేనియనుడువులఁదొలకరింపఁ
గలికిచూపులువీనులఁబలుకరింప। సొలపునడపులనందియల్గులుకరింప॥ ౯౨

మ॥ అలరుందూఁపులనేసియేసి కడదివ్యాస్త్రానుసంధానకా
శలుఁడైపుష్పధనుర్ధురంధరుఁడవాచాగోచరంబైనపే
రలుకన్ మానినిగుఱించికంటనిడునయ్యాగ్నేయబాణంబునాఁ
దలిరుంజొంపపుమాటునన్నిలిచె నంతన్గాంతహేమద్యుతిన్॥ ౯౩

ఉత్సాహ॥ ఇటులనిలిచిజటిలుఁగలఁచనెదఁదలంచియచటిచొ
క్కటపుఁజిగురుగుమురువెడలికలికిచిలుకపిలుకము
చ్చటలుజిలుకనటనఁగులుకఁజలువదొలఁకఁజతురత
పటిమవచనరచననెఱుకపలుపఁదొడఁగియడఁకువన్॥ ౯౪

। ముదితరో యమరదేమదనామయమ్ములాలించినాపల్కులాలించెనేని
భామరో పెంపొందదేమనోభవుపీడగనువిచ్చినన్నుఁగన్గానియేనేని
కలికిరో చెల్లదేకాయజుసంతాపమెనయనాసేవఁగైకొనియెనేని
యతివరో చెలయవేయాత్మజన్మాంతరాయములునాగమనంబెయడిగెనేని
మానియనుచునెచ్చెలులతోఁబూనివలపుఁ। జెనుచుఁగ్రొవ్విరిమొగ్గలనినుచుఁబొదలఁ
బొదలవెదుకనవ్వేల్పుఁబువ్వుఁబోఁడి। కదిసివిహరించెనప్పారికాంతుయెదుట॥ ౯౫

లయగ్రాహివృత్తము.

నమ్మలలకొప్పులుఘనమ్మలనినైజసదనమ్ములనుబొంగినటనమ్ములఁదగన్ యా
నమ్ములకులోఁగిపులినమ్ములనుహంసమిథునమ్ములతిమందగమనమ్ములలరాసా
నమ్ములనెసంగుకదనమ్ములవినోదకథనమ్ములమిథఃప్రహసనమ్ములలసద్గా
నమ్ములఁజరించిరి వనమ్ములముదంబునమనమ్ములలరంగమరునమ్ములనఁగాంతల్॥

సీ॥ పాటఁబాటిగఁజాడిపరభృతంబులరేఁచికూఁతలుసేయించెఁగొమ్మయొకతె
నెఱివేణిమెఱయించినెమ్మిబోఁదన్నుఁరేఁచివడిఁగేఁకవేయించె వనితయొకతె
గొడుఁగుచుఁదిట్టిపెంపుడుకీరములరేఁచివెడతిట్లుఁదిట్టించెఁబడఁతియొకతె
నిండుమైనెత్తావిగండుదేఁటులరేఁచిచుట్టునుమొరయించెసుదతియొకతె

హంసకారావమెనయనాయ్యనటించి। యంచపిలుకలనెలయించెనతివయొకతె
జటివరతపోంతరాయసంజాయమాన। మానసానూనచతురతాధీనగతిని॥ ౯౭.

సీ॥ ఎలమావిచిగురాకువీక్షించివీక్షించేఁగలువలిచ్చుటనెట్లుగలిఁగెననుచుఁ
రతిఁబాటలముగోటరాగిల్లి రాగిల్లెమొల్లలిచ్చుటనెట్లుమొలచెననుచుఁ
దగుబోదములబూలఁదలయూఁచితలయూఁచెఁబగడమిచ్చుటనెట్లుబ్రబలెననుచుఁ
దమిదాసనముఁగేలఁదాఁటించితాటించెజలజమిచ్చుటనెట్లుమొలిచెననుచుం
దెగడుటెఱుఁగకనిదియెంతముగుదయనుచు। నిగుడినెగడెడుపొగరునమిగులఁదగులు
సొగసునగవులుమొగమునఁజిగురుకొనఁగ। దెగడిరొకయింతినాకకొందఱిగురుబోండ్లు

మ॥ చెలులందిట్లుచునంతఁజేరెనటకాసీమాటి సీమాటికిన్
వలదన్నన్వినకేలబ్రోలెదరుకానంగానరేయీ జపా
కలనాతంద్రుమునీంద్రునంచుఁబొగరెక్కన్ దెక్కసామ్రాణిదం
టలివర్దాఁటుచుఁదన్మనోధనముదండద్దండనే తేరఁగన్॥ ౯౮.

* సీ॥ మోద్పుఁగేలునవ్రేళ్ళుమొనకుఁజేరఁగఁగోరుమగఁగొల్వుగడలసంపదవహింప
మందయానముమానిమానసాభ్యుత్థానసరణిఁగాంచుఁచురాజసముఁదెలుపఁ
గదలుగుబ్బలువిప్రకరగతవ్రతవిసంబాడియదూరురథాంగయుగళిగాఁగఁ
దెలిజూపుయోగిస్థైవలరాచమదహత్తివిసరుశృంఖలికలపసలునెఱప
నిగుడుబాగడతతొగవింటిమగలమగఁడు। దపసిడెందంపుటిలుజేరుతటిఘటించు
కలితపుణ్యాహమంత్రముల్గాఁగఁజేరి। జడుపుమదిఁగ్రమ్మవేలుపుఁబడుపుఁగొమ్మ॥ ౯౯.

మ॥ యతిపాదాంబురుహద్వయంబునకుసాష్టాంగంబుఁగావించిసం
తతభక్తిన్సలెనానతాంగియయిచెంతన్నిల్చిమానీంద్రుఁడి
ట్టతనంబున్విసరన్ఘటించుతిరుగంటన్నాటుగూటంబుసం
గతిఁజన్నుంగవమోడ్పకేలుదనరంగాఁబ్రౌఢవాగ్ధుర్యయై॥ ౧౦౦.

సీ॥ పలుకువాల్మగలయూఁకలిఁదిర్చుచలుపయెమగువలఁగనిపించుమంత్రసాని

---

※ ౯౯ దవ పద్యమునకుఁ బాఠాంతరము. సీసపద్యము.

※ మోడ్పుఁగేలునవ్రేళ్ళుమొనకుజేరఁగఁగోరుమరుకొల్వుగడలసంపదవహింప
మందయానమునమానిమానసాభ్యుత్థానసరణిగానాయ్యనఁజౌకళింప
నుమటసిబ్బెపుగబ్బియురుకుంభయుగళంబుయిభకుంభములయింపునినుమడింప
నిడువాలుకన్జూపులీలలెద్యోడలనుమరుశిలీముఖములతెఱఁగునింప
బంధబంధురసంబంధసింధురంబు। నందమొనరించనేతెంచెననుచుఁబుడమి
దంతిదంతావళచ్ఛాయతాప్రహాసి। యింతిగనుపట్టెమానికభ్యంతరమున॥

# తృతీయాశ్వాసము.

సపండు వెన్నెలసోన లేచానలుదయించుటకు మంచు యమ్మనీరు
పుత్తడపాలదిండి నెత్తురేనవలాలఁగన్న బాలెంతకుఁ గావు బొట్టు
చుట్టల్గు బోరపట్టికట్టంపు రాణియేమానినీమణులకుమాఁ టుదల్లి
పేరుగలయట్టి జన్నంపుఁ బైరుఁబాఁప। వెట్టి జవరాండ్రకిరుగోరు వెట్టు కాపు
లట్టియచ్చర జాతిలో మొట్ట మొదలి। పేరుఁగలదాన మేనక పేరుదాన॥ ౧౦౧.
ఇంతకుమున్న మీమహిమమింద్రునికొల్వున నారదాదుల
త్యంతము సన్నుతింపవినియాదటమిమ్ము భజించు కోర్కెనే
నెంతయు నెచ్చెలుల్గొలువ నీకడవచ్చినదాననన్ను నా
కింతయుఁ బల్కకుండుటయు నేర్పడ రన్మది తెంపు పెంపునన్॥ ౧౦౨.
ప్రియురాలినలయించి పైకొనియలసితే కనుగూర్కనేటికి మునివరేణ్య
రాకొట్టిపిలువ నీరమణిపైనలిగితే మౌనముద్రయిదేమిమౌనిచంద్ర
కలికిశృంగారచేష్టలు విచారించెదే ధ్యానమేమిటికి సంయమిమహేంద్ర
చెలిమాటనయగారములనెన్నికొనియెదే గొణిఁగెదేల తపస్వికులవతంస
నిన్నుమనుజీవితేశ్వరినిలువు మనుచు। నీచటసంకేతమొనరింప నెలమినిలచి
యున్నవాఁడవెయిటనొంటినుండనేల। తాపసోత్తమయిదియేమిదాఁపనేల॥
జడదారివీవు నేనుం। జడదారిని నీకునాకు జంటినాయక పొ
త్తొడగూడదుగా మనయిరువుర। యొడయనితపములకు ఫలములీవు న్నేనున్॥
బళిమునిచంద్రనీతపము పండె మదాగతినింకఁ దాల్మిపు
ల్గులఁబడనీఁడు బోధ హాలికుండు మనంబను మంచెనిల్చినా
కులుకు మెఱుంగుగబ్బిచనుగుబ్బల పేరిటిగుండ్లునించిని
ట్టులమగు చూడ్కి పేరొడిసెటన్వడిరువ్వకఁదక్కఁ డెంతయున్॥ ౧౦౪.
గ్రుక్కకు గ్రుక్కకెంజవులుకొ ల్పెత్తులు సేయఁగనాక్క కొమ్మపే
రక్కునఁ జేర్చి దానియధరామృతమానిన తాళ్ణగాక యీ
యుక్కకు నోర్చియప్పగిదినూపిరిఁబట్టిన బొజ్జగల్గునే
యెక్కడి తెల్వియిక్కమతి యెవ్వరిబోధనా మీకు సంయమీ॥ ౧౦౫.
ఒంటిగఁ బూదిఁబూసి జటలుట్టిపడంబులితోలుఁ బూనిము
క్కంటియు నీవతెందపముఁ గైకొని సేయఁడె చేతికబ్బినన్
గంటికివచ్చు నాక్కకలకంఠికి మేను సగంబొసంగఁడే
తంటలకేమిమచ్చు జడదారులదారులు కొంతెఱుంగుమన్॥ ౧౦౬.
ననువుంజుట్టము తెందతేనిగలరింటన్ వారు మాకైచలం

బునఁబోరాడుదురట్టివారలకుఁగల్పుంగోలుఁబుట్టింపనిం
పునమన్నింపవెనిత్యవైరముమృగంబుల్మానిమేల్పొందమ
న్ననఁగావించిన మంత్రమైన మణియైన న్మానికైన న్మునీ॥ ౧౦౯.

వ॥ అని యివ్విధంబునఁబలికిన నమ్మౌని సమాధినిష్ఠఁగదలమెదల నెఱుంగకుం
డుటయు, వేలుపుంజిగురాకుఁబోఁడి చెలులంగనుంగొని॥

సీ॥ పుట్టినమొదలాడుఁబోఁడిమి నెఱుఁగఁడో పసదప్పియుడిగినపనులవాఁడొ
నిరతిశయేంద్రియనిగ్రహాశక్తుఁడో పోలింపఁవీఁడునపుంసకుండొ
మిగులఁజక్కనికొమ్మనాగిఁదాఁచుకొన్నాఁడొ యిన్నేలగుణములనున్నవాఁడొ
చెలులనిందఱఁజూచిసిగ్గుతోనున్నాఁడొ వేవిధంబులలోన వెఱ్ఱివాఁడొ
తెలియఁగారాదు తెలియకఁదిరుగరాదు। తెలిసితిరుగుసుపాయబుఁదలఁపరాదు
లోలలోచనసరివారిలోననిపుడు। కలిగినగుబాటు నాకింతకాలమునకు॥ ౧౧౦.

క॥ అనవుడుఁజెలులాపలుకులు। వినికడుఁదెలియంగఁజూచివికవికనగుచుక్
మనభ్రమకేమనవచ్చును। వనజాననవీఁడుచూడవ్రతిగాఁడనుచుక్॥ ౧౧౧.

మ॥ సరసాలాపములన్వినోదకథలక్ సంగీతసాహిత్యవై
ఖరుల్మన్నించఁజరించునట్టి మనవంకన్వీఁడుకన్గొంటసా
దరతంజూడకయున్న నివ్వనమునందర్పంబుగన్పట్టుగ్రు
మ్మరుపీరెవ్వరటంచుఁజూడవలదేమాసింద్రుఁడేనిం జెలీ ॥ ౧౧౨.

సీ॥ నెలఁత తీర్థచరాగ్రణియితండుగాఁడైనననిమిషాంగనలఁగన్గొనకయున్నె
సఖి వనప్రియవతంసమితండుగాఁడైనముదియనికొమ్మలఁగదియకున్నె
జలజాక్షి పరమహంసమితండుగాఁడైననప్సరస్సంగతినందకున్నె
తోవకంటి కుండలీంద్రుఁడితండుగాఁడైననమరభోగినులమేలరయకున్నె
మఱియునితఁడట్టివాఁడేనిమగువలార। ఘనరసావాప్తిఁగనకపైకములుగూర్చి
కొనకనెక్కుడువగలఁగ్రైకొనకభోగ। మనకఁగడనాంటినిలిచిచెల్లాడకున్నె॥

సీ॥ దఱఁగింపదేమత్తగజరాజనిభయానరాగవైఖరిమానిగత్నమైన
నామోదమొసఁగదేయలివేణిచతురభాషాగతిజటిలుపున్నాగమైన
వెనువెంటఁద్రిప్పదేవికచపద్మదళాక్షియానలీలఁదపస్విహంసమైన
గిలికింపవేకోరకితమణిమధ్యమకలికిచూపులమౌనితిలకమైనఁ
గానసియానజడదారిగాఁడువీఁడు। ఘోరమృగకోటివనవాటిఁజేరకుండ
మధుఁడునిల్పినపూరిబొమ్మయయితండు। తలఁచిచూడఁగనోవేల్పుఁదలిరుఁబోఁడి॥

మ॥ పడఁతీయీజనుఁడంధుఁడుంబధిరుఁడున్పంగుండుమూఁకుండునై

పాడమన్నా బక్కుచుఁదల్లి దండ్రులిచటన్నోచ్చునైవ నాయుస్థితిన్
బడుగై యుండెడుపీనిమానియనిజఁభద్వేషిభీతిల్లె సం
దడిఁగన్వెచ్చఁ ధైమానియేని యటుగానన్ మానిగాఁడారయన్॥ ౧౧౫.
అనినవిని యుస్సురనుచు వెఱఁగంది తిరుగు తెఱగంటి తెఱవపై మునివరుని
మరులుకొనఁజేయుటకు నమ్మదనుం డిందు మందపవన మాధవ పికభటా
నీకంబులంబురికొల్పి దానును నడుచుసమయంబున॥ ౧౧౬.
పంగిపూఁదావిఁజల్లుచల్లనిగాలిఁదేఁటినారిపఠీనఁదెగినఁజూచి
యనుఁగుఁజుట్టంబైనయలవసంతునిరాక విరజాజిబలునేజ విఱుఁగఁజూచి
కలువనెచ్చెలికానిబలిమిఁదామరరేకుచికిలిదోదుముదారిచెడఁగఁజూచి
కరముఁగోకిలభటోత్కరముచేఁజిగురుఁగ్రొంబదనువంకిణిమొక్క పడఁగఁజూచి
తెంపుఁదెంపునుఁగడగంటఁగెంపునిగుడ। గొనబుగేదంగిచేయమ్ముకొద్దిగ్రుద్ది
మడిగియదియునువమ్మైనమదనుఁడప్పు।డహహాయిదిమానిమాహాత్మ్యమనితలంచి॥
మ॥ హరిహరాంలంగడుఁబోటుబంటనయి గర్వాలాపముల్మున్న స
త్వరతన్ బల్కితిఁగొన్నినోరికొలఁదుల్ తథ్యంబునేఁడన్నియున్
బరగన్ బందకుఁజెప్పసాధనగతిన్ బాటిల్లెవ్యర్థంబులై
సురలోకంబునకేగుటెట్లుసవయస్కుల్ సన్నలన్నవ్వఁగన్॥ ౧౧౭.
చ॥ అని తలయూఁచు యూఁచి వగ హా యను హాయని నవ్వు నవ్వి వ
చ్చినతనుదూఱు దూఱి విధి సీయను సీయని కుందుఁగుంది ప
ర్విన వెతఁదూలుఁ దూలి మదివేసరు వేసరి రోఁజు రోఁజి చె
క్కునఁజెయిఁజేర్చుఁజేర్చిహరికోసము మోసమువచ్చెనాకనున్॥ ౧౧౮.
క॥ ఈగతివలపేఁదువిచా। రాగతిఁబుష్పాకరపవనాబ్జారులు ల
జ్జాగరిమఁదన్నుసేరఁగ। బాగరియొకచెట్టుక్రిందఁబడియుండుటయున్॥
క॥ తనకపుడుసమాధిసమా। పనసమయంబగుడుమానిపతితనచెవులన్
వినఁబడుసందడికతమునఁ। గనుదమ్ములువిచ్చినాల్గుకడలన్గనుచున్॥ ౧౨౧.
క॥ తనకట్టెదుటన్నివ్వెఱఁ। గనఁబట్టెడునవ్వసంతకందర్పమరు
ద్వనజారిదేవకాంతా। జనములఁబరికించినైజచతురతమెఱయన్॥ ౧౨౨.
సీ॥ సుమనోరథావాప్తియమరఁగావలెమీరువచ్చినపనియేమి వనజబాణ
జైవాతృకత్వంబుసమకూడవలెనీడ నుద్యోగమేమిమీకోషధీశ
కమలానుగతవృత్తికలుగఁగావలెనిపుడేమికార్యముమీకునిచటఁబవన
ప్రసవాభివృద్ధినొప్పఁగవలెమీరాకకునుకారణంబేమొకోవసంత

యనుచు దీవించి ప్రియభాషణ నాదరించి। యెదురఁ దగఁ బూజఁ జేకూర్చి ముద మొనర్చి
సొగసు తెలుగంటి తెలివ నెమ్మొగముఁ జూచి। మధుర సాధిక మధుర సమధుర భణితి॥

గీ॥ నిన్నుఁ జేపట్టు కౌశికుఁ డెన్న నూకు। సంప్రదాయస్థుఁ డై చాన మించుఁ
గాన నీవును మతిబహుమాన యోగ్య।వనుచు సన్మాన మొనరింప నంగభవుఁడు॥

మ॥ అరరే దాంతి బళీ రె శాంతి గుణమయ్యారే ప్రసాదంబు మా
యెరె దాక్షిణ్యము బాపురే తేలివి మే లెంతే తపం బౌరయా
దర మాహా మహిమం బహూకలిత మేధాశక్తి మఝ్ఝూ రె స
త్కరుణాలోకన మంచు నాత్మ ముని రాట్కాంతీరవు న్మెచ్చుచున్॥ ౧౨౪.

చ॥ పవనుఁడు మాధవుండు దలపన్ ఘన దుస్సహ జాతి వైరులీ
కువలహితుండు నేను మునికుంజర చక్రివి యోగ పాశనో
త్సవులగు వారమిట్టి మము శాంతతఁ గాచితి నిగాన మేమునీ
దవునడ గెల్పు కంబములమై చరియింతుము ముజ్జగంబులన్॥ ౧౨౫.

క॥ అనివినయమ్మున మునిపీ। డ్కొనితనతలనట్టిచూచుకొనినునుదావ
చ్చిన తెరవు నమరలేన్ ద। ఝ్ఝ నమహిమం బాత్మకద్భుతంబొనరింపన్॥ ౧౨౬.

సీ॥ కరుణావధూటి పైఁ బరగ నిల్పిన దృష్టి వారింప నేరఁడ పారికాంక్షి
మతిశాంతి కాంత పై మరులుకొన్న మనంబు మరలింప నేరఁడ మాని భర్త
ఘనతపస్స్యాంబుజానన మీఁదఁ దగు బుద్ధి నాఁగంగఁ జాలఁడా యతివిభుండు
బ్రహ్మవిద్యాభామ బాయకుండు వివేక మడ్డగింపఁగ లేఁడ తత్తపస్వి
యట్టి జటి కేలమనతోడి వట్టి గోడవ।ముక్కఁ బట్టుక కన్నులు మొగిచి నముచి
మదను బెదిరించి పొంచి యస్మద్ది దృక్షు। నుండుమునిముచ్చులకుఁ గాకనువిదలార॥

వ॥ అని పలుమఱుం దదీయ మహిమంబభినుతించుచు వేలుపుం జిగురాకుఁ బోఁడియు నమ్మదను వెంబడి నేచని ముని యుదంతం బాద్యంతంబుఁ దన కెఱుంగించిన నులుకునలుకునుం దలకొననాక్కించుక విచారించి, తత్తఃఫలంబు మదీయ స్థలంబే యని నిశ్చయించి, ఇతికర్తవ్యతామార్గ్యంబున సేయున దినేరక, గగన నిరంతరీభూత వీక్షణాయత్తుండును, శిథిలీకృత సకల భువనావన చిత్తుండును, ధారాళ బాష్పధారాతిరోహిత నేత్రుండును, సముదిత శ్రమజల సమభిషిక్త గాత్రుండును, అధర ద్రవశోషణచణ పునఃపునరుద్గతోచ్ఛ్వాస పరిమ్లానముఖుండును, సింహాసనఖచిత చింతామణి తలోపరి సముల్లేఖనాన పాయిపదాంగుష్ఠనఖుండును, అంకతలక రకపోణిపాణిస్థల స్థాపిత కపోలుండును, పరిగళిత ధైర్యగాంభీర్యశీలుండును నగుచు నప్పురందరుం డెందేనియుఁ బోవన్దలం

చ॥ సంచలితస్వాంతంబున॥ ౧౨౯.

వరుసస్నాతనుమూఁడుగాళ్లముసలిన్ వర్జించి తేజోధురం
ధరమిత్రప్రియపుత్రపుణ్యజనులన్ వర్జించి రత్నాకర
స్ఫురదావాసమహాబలార్థవరవిస్ఫూర్తుల్ విసర్జించియీ
శ్వరభావంబెడలించిపోవలసెఁగా సారంబు దూరంబుగన్॥ ౧౩౦.

గీ॥ అనినవినియింద్రుఁడిపుడునీవనినమాట। వ్యంజకంబయ్యెమావెంటవచ్చువారు
కారువీరన్నసర్థసూక్ష్మతకుభళిరె। యెంతదలఁచితివిదిబుద్ధికెటులదోఁచె॥

మ॥ ఇదెనీవెంటసపుత్రబాంధముగానెందేనియున్శక్తిసం
పదమీఱన్ జనుదెంచువారమనిజంభద్వేషికిన్దెల్పి స
మ్మదమొప్పన్ బయనంబుజోకకునిలింపస్వామిలీశానము
ఖ్యదిశానాయకులేగివేగపయనంబై వచ్చుచోనత్తఱిన్॥ ౧౩౨.

{ఈశ్వరుఁడు పార్వతికినింద్రాదుల తెఱంగెఱుంగింపనయ్యు మతపసికోరిక నెఱవేర్పఁ బ్రసన్నుఁడై వరంబొసంగుట.}

మ॥ గిరిరాజాత్మజవింటెయొక్కటి భవత్కేళీవనీవాటికాం
తరసీమన్మునియొక్కఁడుగ్రతపమూనంజూచిభీతిన్నచీ
వరుఁడెందేసకుటుంబుఁడైవలసబోవన్బూనెవెంటన్ దిగీ
శ్వరులుందారుసదారులై కదలిపోవంబూనిరాపన్నులై॥ ౧౩౩.

క॥ మనమునువారలతోడన్। జనవలయుందామసింపఁజనదతివేగం
బుననిప్పుడుపయనముఁగ। న్మనితనపతియానతీయనబ్బురపడుచున్॥ ౧౩౪.

క॥ అకటాపదుగురిలోఁబదు। నాకఁడైతివిదేమినాథయొనరఁగమునినా
యకునితపస్థితివేటొక। టికినజ్రిక్కెఁదాననోపటిలనేమిటికిన్॥ ౧౩౫.

క॥ అదిదేవరవారలెఱుల। గుఘురెటేఁగియునీగతిఁబలుకుటనమ్మని బె
ట్టిదపుఁదపంబీడేర్చుట। కిదివేళయటంచునానతిచ్చుటదోఁచెన్॥ ౧౩౬.

క॥ అటుగావుననేనిపుడా। జటిశేఖరవరతపంబుసఫలముగమరు
త్పుటభేదనపరివృఢసం। కటపాటుడిగించిమిమ్ముఁగడునలరింతున్॥ ౧౩౭.

చ॥ అనితనప్రాణనాయకుని యానతిఁగైకొనిసంభ్రమంబునన్
బనులుఘటించుచున్విబుధభామలుముప్పదిమూఁడుకోట్లు చు
ట్టినుభయభక్తియుక్తులఁగడున్బ్రమదంబొసరించికొల్వఁగీ
ల్కొనుకనుసన్నలన్బనులుగొంచుఁబ్రసన్నశరణ్యమూర్తియై॥ ౧౩౮.

సీ॥ మగనికిసగమిచ్చిసగముఁదాఁగొనియెనాఁడుఱుమునజాఖల్లితునకజెల్వఁగ

సంచితభాగ్యారుణాంశుపుంజంబునాఁగరుణారసంబుకన్గవలఁదో
స్తాంగమైఁగన్పట్టుశాంతరసంబునాఁబూసినగంధంపుఁబూఁతఁదనర
బుసికిఁగోర్కులొసంగనిదివేళయనురీతిరతనంపుటందియల్రవళిఁజూపఁ
దనదుసౌందర్యమిలదృష్టిదాఁకకుండ।దండిమైనెత్తుసొన్నంపుఁగుండలనఁగ
ముత్తెసరిమిన్నచన్గవముగువుఁజూప। నమ్మహాదేవిజటికిఁబ్రత్యక్షమయ్యె॥ ౧౩౯.

గీ॥ అతులసాక్షాత్కరించినయాదిశక్తిఁ। గాంచి భావించి సేవించి కరుణనెంచి
నిటలతటమున నంజలిపుటిఘటించి। మేనుబులకింపనిల్చియమ్మౌనివరుఁడు॥

సీ॥ జగదంబదుర్గదాక్షాయణిపార్వతియార్యయంబికమేనకాత్మజాత
సర్వమంగళగౌరిశర్వాణిచండికశివకాళికాదేవిసింహవాహ
యుమశక్తిసతిమహాయోగినికామాక్షిశకలేందుధరమహిషాసురహర
షణ్ముఖజననియీశ్వరినిత్యకల్యాణియాదిమాయ యపర్ణయన్నపూర్ణ
యమరవందితచరితయాద్యంతరహిత। భక్తవత్సలయవ్యయప్రణవవినుత
యనుచుఁగొనియాడఁగరుణాంతరంగయగుచు।నమ్మహాదేవియత్యంతసమ్మదమున॥

క॥ నీతపమునకేమెచ్చితి । నీతలఁపుఁదెలుపుమనముని నీరేరుహాసం
భూతలిపిశ్రీహితఫల । జాతవిభూతాభివాంఛసమకొనఁబలికెన్॥ ౧౪౨.

మ॥ హిమశైలాత్మజతావకీనకృపచే నేనింతపర్యంతమీ
క్షమపైనాడినమాటచెల్లుబడిగాసత్యప్రతిజ్ఞావిధా
నముసార్థంబగునట్లుగ్రుమ్మరితిమన్నామంబుపేడెత్తనీ
కమదిష్టంబిడుపేద్యసర్వమతివర్గా దుర్గభర్గాంగనా॥ ౧౪౩.

క॥ నావుడుఁదద్భావమునిజ । భావారూఢంబుగాఁగఁబరికించికృపా
సేవితచిత్తాంబుజయై । పావనతరచర్య యార్య పలికెంబ్రీతిన్॥ ౧౪౪.

చ॥ ఇదికడుదుష్కరంబయిననిందుకుపాయము నేనొకండుజె
ప్పెదఁగలఁడింద్రసేనుఁడరిభీకరతేజుఁడువాఁడు పాలితాం
గదకరుణావిశేషమునఁగాంచెఁగుమారతరుజ్ఞిరాయువై
బ్రతికెడువాని వానికలరామనొసంగఁ బొసంగుఁగోరికల్॥ ౧౪౫.

## శారికారూపంబునున్న చిత్రరేఖోదంతము.

చ॥ అనినిజశక్తి నన్బిలిచియాదరమొప్పఁగ నాభవాని నీ
వనుపమలీలనేపగిదినైననువానికిఁజిత్రసేనరా
ట్తనయనుగూర్చియమ్మునిసుధాకరుకోర్కిఘటింపఁజేయుమీ
యని దయనానతిచ్చి ననునంపి తిరోహితయయ్యె నంతటన్॥ ౧౪౬.

క॥ మాయమ్మయిటులఁబంపను। పాయంబునఁజిత్రసేనపార్థివుదేవిన్
డాయన్ వినివెచ్చెలినై। యాయమ్మమనంబువచ్చునటులున్నంతన్॥ ౧౪౭.

మ॥ ఒకనాఁడాయ్యనుభావచిత్తరువు నేనాయ్యారపుంబాగునం
బ్రకటింపంగనికూర్మినన్బిలిచిభామానీప్రయాసంబుఁజూ
డకసీమంతినితోడ నెంతయును వేడ్కంగూర్చ నీదైనరా
జకుమారున్ లిఖియించితేవలెఁగదాసర్వంసహాస్వేషతన్॥ ౧౪౮.

చ॥ అనుచుబహూకరించి నను నానరనాయకుదేవిపంపఁగాఁ
బనివిని నే సమ స్తజనపాలకుమారులఁజూచినట్టులం
దనరలిఖించియాధరణినాథకుమారుని నిన్నునాక్కటన్
గొనబుగవ్రాసియిప్పుడిదిగోగొనిపోవుచునుండు త్తఱిన్॥ ౧౪౯.

క॥ ఘనమృగయాకౌతూహల। మునసీవువనంబులోనమునుకొని యొక దే
గనుముష్టింగొనివేఁటా।డునెడన్మరికించియేఁగడుముదంబొదవన్॥ ౧౫౦.

వ॥ ఇప్పుడిప్పుడమిఱేని నెలయించుకొనవచ్చి వనధరావరోహాయగు నవ్వరా రోహంగూర్చుటకు నిదియ సమయంబగునని శారికావేషధారిని నైశ్యేనం పాతాకుతూహలివగు నిన్ను నెలయించుకొని వచ్చి తదీయసందర్శనానంద కందళిత పులకాంకురుండవగుటఁ గనుంగొని నాకోర్కిసఫలంబయ్యెనని తలంచి, హసించి, తద్వేషంబుడించి, యీతేవనీకెవ్రిఁవనిలిచితి ననుడు నద్భుత ప్రమోదంబులును బెనంగొన నారాజపుంగవుండు॥ ౧౫౧.

{ చంద్రాంగదుండా చెలిం దనకుఁగూర్చఁ జిత్రరేఖచే ।
నొప్పించుకొని సేనాసమేతుఁడై పురంబున కేగుట. }

క॥ నాపాలిభాగ్యదేవత। నీపేరిఁటనెనుటఁజేరినిలిచెన్ గృపచేఁ
జేపట్టిమనుపనన్నిఁకఁ। గాపాడుమనంగవలమగా నలినాక్షీ॥ ౧౫౨.

క॥ అనుడుఁజిరునగవువెన్నెల। కనుఁగల్వలవింతకాంతిగడలుకొనంగా
వనజాననన్నపసుతునిన్। గనుఁగొనియిట్లనియెమధురఘనతరఫణితిన్॥

ఉ॥ ఇంతవచింపఁగావలెనెయీశ్వరియానతి చిత్తవోవు నే
చింతిలనేలనీకున్నపశేఖర తత్పురికేగిమిక్కిలిన్
గాంతకునీపయిన్మనసుగాఢఁగఁజేసి స్వయంవరంబుచే
నెంతయువేడ్కనిన్నువరియింపఁగఁజేసెద దేవిసాక్షిగన్॥ ౧౫౪.

క॥ నాయత్నముసఫలంబుగ। మీయిరువురకొకరికొకరి మీఁద సమానం
బైయుద్భవించెఁబ్రేమం। బీయెడనంచాకటాక్షవీక్షామహిమన్॥ ౧౫౫.

వ॥ కావున వారికి నీచిత్రపటంబుఁ జూపి తావకసౌందర్యాదిగుణంబులు, మీ కులస్థానపౌరుషంబులుఁ దెలిపి, మీమనోరథంబు సఫలంబుఁ జేయుటకుఁ జనవలయు నిట్టిదఁడయంబని లేదని చనియె నాసమయంబున॥ ౧౫౯

సీ॥ కాంతీరవికగర్వగంధిలాలాపముల్ పౌండరీకికమదభాష లెనసి
శారభికానేకసముదగ్రవచనముల్ భైరుండికోగ్రశబ్దములఁ బెనఁగి
సైరిభికాహంక్రియారవస్ఫురణముల్ వారాహికోద్ధతధ్వనుల బెరసి
గావయికోద్దండఘనవాగ్విజృంభణల్ ఖాడ్గికవిరుదవాక్యములఁ గలసి
మైనికానీకకోకూయమానమౌని । తప్రగల్భరుతుల్ పాతుకిప్రభూత
విలసదతిశయోక్తులుగూడి విసఁగనయ్యె । నబ్ధిమథనోన్నతధ్వానమనుకరించి॥

సీ॥ అన్నినాదస్ఫూర్తి వెన్నుఁ దన్నుచు వచ్చె జంఘాలకంఖాణసముదయంబు
కంఖాణసంఘంబుఁ గదలిపోవఁగ నీకఁ జను దెంచె నంచితస్యందనములు
స్యందనోత్కరములనవలసాగఁగనీకఁ గదు వేగ యేతెంచెఁ గాలుబలము
కాల్బలంబుల నెల్లఁ గడఁగిమించఁగనీకఁ బారు దెంచెను గంధభద్రగజము
లిప్పగిదిఁ జూడవచ్చిన చొప్పుఁ దెలిసి । బలసియరుదెంచు చతురంగబలము వెంటఁ
గొలువ నాశారికారూపలలనపలుకు। లరుదొనర్పఁగఁ బురికేఁగెనవనివిభుఁడు॥

## ఆ శ్వా సాం త ము.

మ॥ నగజాధీరత ధీరతాచలచలన్మందార మందారతా
శుగసన్మార్గణ మార్గణాదర దరత్సుగ్రీవ సుగ్రీవ శీ
లగుణామోచక మోదకారణ రణాలంకార లంకారమా
బ్జగజై రావణ రావణాహిత హితశ్యామాంగ శ్యామాంగకా॥ ౧.

క॥ సారాచ్ఛగుణాధారా । ధారాధరకృత్తమత్తదనుజకుమారా
మారాంగజిదాకారా । కారాగృహవిహరదరినికరసంసారా॥ ౨.

కవిరాజవిరాజితము॥ కలుషవిమోచన కాంతివిమోచన కంజవిలోచన నిర్మలధీ
యలఘుదవక్రమ హాసిభుజాక్రమ ణాధికవిక్రమ కీర్తినిధీ
ఖలజనశిక్షణ కార్యవిచక్షణ కాతరరక్షణ నమ్రసుధీ
సలలితభాషణ సౌవరపోషణ సాగరశోషణ దాశరథీ॥ ౩.

## గ ద్య ము.

ఇది శ్రీరామచంద్రచరణారవింద మిళిందాయమానమానస సకలశాస్త్రార్థ్వరిరంస పైడిమఱ్ఱి పద్మనాభాధ్వరివతంసకృపాభూషణ పర్వతరాజతనయ వేంకటపతి విరచితంబైన చంద్రాంగదచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీధరాయ నమః.

# చంద్రాంగదచరిత్రము.

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీరమ్యశ్రవణభుజా। వారితతరవారిభిన్నవైశ్రవణకృపా
పారావారతరంగ। ద్ధారాళదృశాభిరామ, దశరథరామా॥ ౧.

వ॥ అవధరింపుము; తదనంతరకథాక్రమంబెట్టిదనిన నట్లునిజనగరంబున సాత్తెంచి హజారంబుననిలచి సకలసామంతమంత్రిబాంధవనికాయంబునంచి యంతఃపురంబుఁబ్రవేశించి యనాదరంబున యథోచితంబులయిన భోజనమజ్జనాది కృత్యంబులు నిర్వర్తించి మందిరోపవనంబునందగు నేకాంతభవనంబున వసియించి తదంగనాంగ శృంగార వైభవోత్తరంగితాంత రంగుండై వితర్కించుచు॥ ౨.

### చంద్రాంగదుండు విరహమున వితర్కించుట.

సీ॥ విమలేందుముఖివేణి వీక్షించినట్లైన సారెసారెకుఁజక్రిసంస్మరించుఁ
గనకాంగినెమ్మోముఁగనుఁగొన్నయట్లైనఁబరిపూర్ణవిధునాత్మఁబాదుకొల్పు
ధవళాక్షిచనుదోయిదర్శించినట్లైన శ్రీధరాకారంబుఁ జింతసేయు
మానినీమణిమధ్యముగాంచినట్లైనహరిపదంబునదృష్టి నలవరించుఁ
బలుకఁడెవ్వరిడోడనుఁబరిగణింపఁ। డాత్మజానందవిస్మారితాస్యుఁడగుచుఁ
బూర్ణతరకీర్ణరుచినూత్నపర్ణశాల। నెలకొనివిరక్తుఁడౌటనానృపవరుండు॥ ౩.

చ॥ సదమల నీల నీరదకచన్ జపలా చపలాక్షినెన్ని య
మ్మదవతి యంగమున్ గనఁగమానసవీథిఁదలంచుతేనికిన్
దదవయవోపమాన వరదర్శనసౌఖ్యముఁగూర్చుకోరికన్
మదిఁదలపోసియో గనుఁగొనంబడియెన్ జలదాగమంబిలన్॥ ౪.

### వర్షర్తు వర్ణనము.

సీ॥ జలకీర్ణబిలవర్తి సర్పదర్శనకృతాబ్రహ్మణ్యదారవక్షైకకులము
మాభీరితీరితమండూకభయనివారకవాక్యదారవరతమయూరి
పవనాశనాశనప్రత్యూహబర్హిణప్రార్థనాయితగర్జితాంబుదంబు
జలదకృతఘ్నత్వకలనాకృతస్తనవిధ్యానచాతకనీడజాత

మేకకాలప్రవర్తనానేకమైత్ర్య । కలితతదనామయప్రశ్నలలితవచన
దనుపమవినిస్వనబలాకికాండజాత।జాలమలవానకాలముద్వేలమయ్యె॥ ౫.

ఉ॥ ధాకదలిర్చుమబ్బు డుబుడక్క మెఱుంగు మ్మెఱుంగు పట్టుసం
జ్ఞోకబలాకికాసమితిచుక్కలనామపురేకనెమ్మి బ
ల్కేకసరోజభేకములకీడును మేలును దెల్పుకూఁకగా
జోకఘనాఘనంబురహిఁజొచ్చెమహిన్ డుబుడక్కవాఁడనన్॥ ౬.

సీ॥ ఘనఘనీలవారికావనధినర్మసఖుండు గొనబునెత్తములగుండెదిగులు
చక్రాంగసముదయోచ్చాటనమంత్రంబు కడిమిచెట్టులపాలికమ్మటీఁడు
తతపిపాసార్తచాతకనీడజప్రప బెగ్గురుతండంబుపిలుపుదీము
వలితకైతకవనీవైహాసికవరుండు నట్టువుపిట్టలనట్టువుండు
దనరెనంతదురంతదుస్తరలతాంత । కుంతభుజవిక్రమనితాంతతాంతపథిక
యుజవనస్వాంతసంభవద్దవథువీతి।హోత్రభస్త్రీమయంబుఘనోచ్చయంబు॥ ౭.

మ॥ మరుఁడంభోదముపేరిభేరిఁజఱపింపన్ గేకికంఠంబులన్
బరగెన్గేకలుతోడుదోర్తఁ బెడబొబ్బల్వోలెనప్పట్టునన్
విరహివ్రాతసముద్గతశ్వసనముర్విన్ మింటనుంబర్వెనాఁ
బరితఃప్రాప్తసమీరవారములుగన్పట్టెన్సమగ్రస్థితిన్॥

మ॥ అనువొందన్పథికాశ్రునిశ్వసనధూమ్యాతాపవహ్నిస్థితిన్
వనధూమాగ్నిలసన్నిజాంగములకున్ వర్ధిష్ణుతన్ గూర్చిచి
క్కనవాతాంగముఁబ్రోదిసేయుబలుపూన్కిన్ బూనిత
త్ప్రాణముల్ గొనమేఘుండుఘటించుతర్జనలపొల్పుందెల్పెగర్జల్ దివిన్॥ ౯.

గీ॥ మింటిపైనుండితమవెంటనంటివచ్చు । కాలసర్పంబులనవానకాళ్ళదనర
దానవెఱనొందినలుదెసఁదాఱుమాడ్కి । సారెకునుదెమ్మెరలల్ నేలఁజఱచివిసరె॥

॥ ఇలకిపుడింత శైలములకింత పయోధులకింత కానన
స్థలులకునింత వానయని సారెమొగుల్ కరుణన్ మెఱుంగు మేల్
గిలుకలగంటముల్ బొదలలెక్కలువ్రాయజనించు నారవ
మ్ములగతిమించెనప్పుడుఱుముల్ జలదాగమరాజసన్నిధిన్॥ ౧౧.

మ॥ అలతేజస్తిమిరౌఘముల్ నిఖిలలోకాక్రాంతికై చంచలా
జలదవ్రాతమిషంబునద్దాడరి ముష్టాముష్టిఁబోరాడఁద
త్కలనన్ రాలినయస్త్రఖండములునాఁగన్పట్టెవర్షోపలం
బులుతద్రక్తకణంబులోయనఁగనొప్పన్నక్రగోపావళుల్॥ ౧౨.

మ॥ తనపైవచ్చి శరాళినించిన శరత్కాలంబు మట్టుంబు లే
గ్గున వర్తించిన వంచు నంచలపయిం గోపించి విద్యున్నికా
య నితాంతప్రతిబింబరక్తతరవర్షారాళధారోగ్రవృ
ష్టి నిదాఘాంతము గ్రాయు నిష్ఫలనఁ దోఁచెన్నక్రగోపావళుల్॥ ౧౩.

ఉ॥ పాడిఁదలంచియర్జునతపఃఫలమైచను దెంచిపీటుబల్
క్రీడయొనర్చి కైతవపులిందునియందమునన్మొగుల్ వన
క్రోడమువానకాళ్ళవడిగొబ్బుననంటి మహా శరంబునన్
దోడనెముంచె మంచుఁగనిదుస్తరగర్జితసింహానాదమై॥ ౧౪.

చ॥ అలఘు ఘనార్భటిన్నభయమాపసరద్విజగర్భభేద ని
ర్గళదురురక్తముల్ కరుదుగట్టిన కైవడిమించె మింటిపై
నలప్రతిసూర్యబింబ మనిలాహతిఁద్రుధిరంబురేకలై
నిలిచినచందమంది జిగినిక్కి మహేంద్రశరాసమత్తతిన్॥ ౧౫.

మ॥ పరికింపన్పథికాళిమర్మములుఛింపన్మారుతభ్రాంత కం
దరజాతాయతశాణకోణములనస్త్రంబుల్ వడిన్ దీఁడెడున్
మరుఁడౌనౌనిపుడట్లుగానియెడశంపాసంఖ్యదంభంబునన్
బరఁగన్ గారణమేమిక్రొమ్మిణుఁగురుల్బల్మాఱు వీక్షింపఁగన్॥ ౧౬.

మ॥ ప్రతిసూర్యుండనుకమ్మటంబు మఘవద్బాణాసమగ్నాటు రో
హితమన్పేరిఁటియూఁదుఁగ్రొవ్వి చపలోపేతాంతరాంభోదసం
తతియన్మచ్చులసంచి కావిరనునిద్దాటంకము న్గన్పడన్
జతసాన్నారిచెడంగునన్దనరె వర్షావేళ విన్నంగడిన్॥ ౧౭.

సీ। దివిజాపగాభూమిసవనాలయము గాఁగఁ జికిలిక్రొమ్మొగులువేదికలు గాఁగ
జనితరోహితముమార్జనిక వేదము గాఁగ నచిరరుగ్వితతిహోమాగ్ని గాఁగ
బలువానకాళ్ళుయూపస్తంభములు గాఁగ నెమ్మలుబుత్విగ్గణమ్ము గాఁగ
నలచాతకవ్రాతమభ్యాగతులు గాఁగఁ బ్రతిసూర్యుఁడాజ్యపాత్రంబు గాఁగఁ
బ్రబలుఘనతరక్షామంపుఁబశువుఁబట్టి। యాగసంపదఁదగనిదాఘాంతయజ్వ
యంబునవలక్ష్మియనుసోమిదమ్మఁగూడి। బ్రహ్మరథమెక్కితోలెసంభ్రమము మెఱయ॥

వ॥ ఆసమయంబున మేఘంబులన్నుంగొని విరహవేదనాదోధూయమానమాన
సుండై యక్కుమారశేఖరుండు॥ ౧౮.

సీ॥ అరసియాపగవారినైనఁబ్రోవఁగఁజాలి కుజనులనైనరక్కలుపఁజాలి
కడవారినిధులైనఁగనిభరింపఁగఁజాలి యేపగాగమునైననిముడఁజాలి

యహిభయదాయుక్తైయహితంబులిడఁజాలిగోత్రగిరిగతినైనఁ గొలఁజాలి
యతిజడాశయపాళినైనఁ జెంపఁగఁజాలి చంచలావళినైననుంచఁజాలి
ప్రబలునీవుభవత్తాల్యబంధుభావ।లలితతరనీలకచకృనా లకుచ కుచకు
జీవితేశుండనగుటనాసేమపరయ।వలసివచ్చుటయరుదె యో జలధరంబ॥ ౨౦.

మ॥ అవుగా నీవుతదీయగానసుధచే నభ్యున్నతింజెంది యా
యువతీరత్నముగారవించు మద మాయూరార్భకశ్రేణి కు
త్సవమొప్పన్నటనంబునేర్పుదువె తత్కాంతావనీవాటికా
నవభూజావళివృద్ధినొంద నదనన్ వర్షింతువే నీరదా॥ ౨౧.

సీ॥ చెలులుసిశ్శ్యంపుగుబ్బలఁజిల్కుపన్నీటనెగసిగప్పనగప్పినిగుడుపొగలఁ
గాంతామణులుజేర్చుకపురంపుఁబలుకులఁదనువునఁదరికొన్నతాపవహ్నిఁ
గామినులెదనించుగంధంపుబరువునవెడలినక్కట్టూర్పువెట్టగాలిఁ
జెలికత్తియలగప్పచిగురుటాకులయుమ్మఁగ్రమ్మిచెక్కులజాలుకమ్మచెమటఁ
దరుణినిన్నుసృజించిహోతనయవస్థ।నాకుఁదెలుపంగనినుఁబంపెఁగాకయున్న
నినువిలోకింపవేదననివ్వటిలునె। నిక్కముగఁదెల్పుదాఁపకనీరదంబ॥ ౨౨.

సీ। ఇంతిమైతాపాగ్నియాచంచలలమాడ్కిఁదేజరిల్లునటంచుఁదెలుపుకొఱకు
నీలనాగనేత్రాంబులీవానచందానవెలయునెప్పుడటంచుఁదెలుపుకొఱకు
కలికిఘుర్ణోదకకణములీవడిగండ్లవలెనేరాలునటంచుఁదెలుపుకొఱకు
మదవతీమోహమీమబ్బుకైవడిఁజాలనలమియుండునటంచుఁదెలుపుకొఱకు
మెఱుపుదులకించజడివానమెఱుపుగాంచఁ। గరకలురక్షించనిరులునల్గడలమించ
నీవువచ్చితివనితోఁచెనెమ్మనమున। నిజముగాఁదెల్పుదాఁచకనీరదంబ॥ ౨౩.

సీ॥ నామీఁదనాఁటిననాటిప్రేమముఁజిత్తమునన్నిల్పిమరువకుమనఁగదయ్య
వనజాయతేక్షణయనుఁగునెచ్చెలువల నందఱినడిగితిననఁగదయ్య
యలరుఁగ్రొవ్వాఁడితూపులఁనించువలతేని ననవింటికేనోర్వననఁగదయ్య
తనుఁజేరియితగమెన్ననినాదుహృదయంబుఁ గనిపరామర్శింపుమనఁగదయ్య
యరయకిటులెంచుటనుచితంబనఁగదయ్య।యాలసించిననతిమోసమనఁగదయ్య
వనజగర్భుండునిర్దయుఁడనఁగదయ్య।ప్రాణములొసంగిననునేలుమనఁగదయ్య॥

చ॥ అలఘువియోగతాపముననార్తివహించి తపించి మిక్కిలిన్
గలఁగెడునట్టినావలనుగన్గొనుచున్ జపలాతనుస్థితిన్
దెలిపితివిట్టిజీవనమునిల్పితి నీయుపకారమేమనన్
బొలఁతికిఁదెల్పునావిధముపొమ్మిఁకదె నీరద నీకుమ్రొక్కెదన్॥ ౨౪.

మ॥ అనిప్రార్థించిమనంబులోఁదెలిసి యాహా యెవ్వితెఱంగ్యాప
బ్బునకుఁ లోనయినాఁడ వీఁడువదరుంబోలిప్డు నాసేయు వం
దనముల్ గైకొనఁడా సుధాంశుముఖికిన్ నాచందముందెల్పఁడ
వ్వనితారత్నముపద్మపాణియగుటన్ వైరంబె సాధింపఁగన్॥

గీ॥ గాలిసోఁకిమిగులఁగాఱుపులఱచి । రాలరువ్వవీని చాలనమ్మి
ఘనుఁడటంచువేడఁగాఁబోయిననుబెట్టు । పిడుగువైచిచంపువిట్టుపిడుగు॥

సీ॥ రాజుతేజముఁగానరాకుండఁగాఁగిట్టిపద్మినీతతిఁబట్టిబాధపెట్టి
ఘనులెల్లమలినులై కడలనిల్వఁగఁడాసిసరసులఁగలఁగించిచౌకఁజేసి
మిత్రప్రతాపంబుమెఱవడిఁగుదియించియతితపస్ఫూర్తిఁజయ్యనహరించి
యెలమిసత్పథమెల్లనలజడిఁబడవ్రాలిపరమహంసావళిఁబాఱఁదోలి
ఘనచపలతానిరూఢిచేఁదనరునిట్టి। విషధరాగమసమయమెవ్విధిఁదరింతు
నాశరచ్చంద్రబింబాస్యయాననంబుఁ । గనకయుండినఁబ్రాణమేగతిభరింతు॥

వ॥ అనుచు దురంతరచింతనున్న సమయంబున॥ ౨౯.

## శరత్కాల వర్ణనము.

సీ॥ కువలయభర్తకాయువిదనవ్వులఁబోలుతేటవెన్నెలఁజూపితెలివిఁజేర్తు
రసికాగ్రణికినాసతిసునేత్రములఁబోలువెలిదామరలఁజూపికలఁకఁదీర్తుఁ
బున్నాగమునకునాపొలఁతియూరునుబోలుమదరేఖఁజూపిసమ్మదమొనర్తు
రాజహంసమునకారమణిపాకెళిఁబోలుతెలికొలంకులఁజూపిచెలువుఁగూర్తు
ననుచునెమ్మదినెన్నియోననుచుగోర్కె। తళుకువెన్నెలలకుఁదామరలకుఁగులుకు
మెఱుపుమదములకలకొలంకులకుఁబొలుపు। వెలయవచ్చెశరత్కాలమలఘులీల॥

సీ॥ వరపద్మకలితానవధికరేణుచయంబుబహుళనిస్తంద్రసంపదఘటింప
రయభాస్వదసమాశ్వరాజమండలములుదిక్తటంబులుమించితేజరిల్ల
వెలిడాలుగనుపట్టవెడలిచక్రాంగముల్ సముదారగమనవిభ్రమముఁదెలుప
సముదగ్రఘనసారశయపదాతిస్ఫూర్తిఁజూపట్టినలువంకనేఁపుఁజూపఁ
బ్రబలవరశాలిరైయశరప్రభుఁడునిలచి । దీప్రసారంగపత్రరథప్రచండ
వేగసంపత్తినున్నఘనాగమంబుఁ। దఱిమికడువిజృంభించెనత్యంతగరిమ॥ ౩౧.

మ॥ పొలుపారన్ శరదంగనాతిలకమంభోజాకరంపుంజొకా
కొలికిన్ దామరకొల్కిపూసవెసఁగీలోఁకఁజేసికాంచాద్రితా
వళలీలన్ దగురెండుబార్లచెలువారన్ వచ్చురాయంచబో
దలపేరన్ ధరియించె నచ్ఛతరముక్తాధామమొంతేరహిన్॥

చ॥ శరవణజాతబాణహతిసంధిలుగాయముగ్రతాధురం
ధరతరగంధసింధురరదక్షతినెట్టగయంగ నందు దు
స్తరగతిజాలు నెమ్ములవిధమ్మునగానఁగనయ్యెఁ గ్రౌంచభూ
ధరవివరాంతరాగతసితచ్ఛదవార మపార లీలలన్॥ ౩౩.

చ॥ అలశరదాహ్వయంపుజలజాసనుఁడంబుధరాగ మక్షయ
స్ఖలనవనీపతద్భువనజాతపునఃకరణప్రవీణతన్
నెలకొనితావసుంధరనునిల్చెనిజంబటు గాకయున్నచోఁ
దలఁపఁగఁదత్తురంగములుతద్దయుభూమికి డిగ్గనేటికిన్॥ ౩౪.

గీ॥ ఘనరసావేశవిస్ఫూర్తిఁగరగఁబారు। ధరనదుల్ చెలుల్ వోలెఁదత్ప్రతిప్రసన్న
దృష్టిగనివండుపేరవార్ధిఘటించి। యమృతసారగుణములు తెల్ల మిగఁజేసె॥

సీ॥ బిసభుక్తిఁగ్రొవ్వితుంపెసలాడురాయంచకొదమవెట్టిన తెలిగ్రుడ్లనంగ
నినకరస్పర్శనంబునఁబుట్టిచూపట్టుఘనసాత్త్వికస్వేదకణములనఁగ
ఝషపలసోఁకునతంద్రచంద్రాతపంబునఁబొడమిన బెడిదంపుబొబ్బలనఁగ
భ్రమరనాదముపేరకొమరుఁడధ్యయనించుతతిరాలి నెరసిన త్రప్పలనఁగ
సలిలదేవతలాత్మీయసౌధములకు। సరగ నెత్తించుహీరకుంభములనంగఁ
దరుణపద్మవిశాలపత్రములఁబొలిచెఁ। దొలఁకునిర్మలసలిలబిందువ్రజంబు॥

గీ॥ కొండలంతేసిపనులుచేకూర్చుకొనఁగ। భువనమాలిన్యముడుపని సవతుజగతి
గనినసీయగస్త్యునకుశరత్కాలమొసఁగు। బిరుదుఃకుంచియలనఁగఁగప్పురము లెగసె॥

చ॥ విమలశరప్రచారములలిన్ సితపత్రికిఁదెల్పి కుంభజుం
డమరఁదదీయపక్షజమహాబలవృత్తి వెలార్చె దుస్సహా
సమదళవిస్ఫురద్రుపదజాతపరాగములెల్ల నట్లుస
త్యమెకదతత్పరాగమరయన్మలియాతఁడువిస్తరించుటల్॥ ౩౫.

చ॥ కృతియయి పాండుపుత్రతతికిన్ సదయాగతధార్తరాష్ట్రసం
తతికిఁబ్రియంబుఁగూర్చె ఘనధర్మపలాయనకారియైసమం
చితగతి నేగుదెంచి కలశీతనయుండు విచిత్రవైఖరిన్
శ్రుతిఁగనరాని తెల్విసుసరస్థితివారికెనించియుత్తతిన్ ॥ ౩౬.

చ॥ అలరువడిన్ ఘనాఘనపుటల్లులఁబట్టకతొట్టునీటఁ గా
సిలితెగవానకాలమనుసేతువుగర్దమయుక్తటాకపున్
జెలువువహించెనింగియరచేతిబలెన్ వెలిమబ్బులందునీ
రలమిన వెండుగుంటలక్రియన్దనరాశరద్దినంబులన్। ౪౦.

మ॥ మనఁగానీయవుహంససంఘములఁబల్కొఱంచురోషంబునన్
మునిహంసంబగునయ్యగస్తిగదియన్మున్నబ్ధిలోనుక్కినా
తనిచందంబులెల్లుంగుఁగాన ధరక్రిందందూఱిచూడంగ ని
క్కనవర్షోదకధారలోయనఁజెలంగెన్ శెల్లుగుంపుల్ రహిన్॥ ౪౧.

సీ॥ కలికివెన్నెలభూతికాయలిస్తవిభూతిమినుకుటుంచలబాలువునుకపేరు
నెగయకప్రపుజాలుసిగనూలుకొనుజాలుకమరరేణుచ్ఛటల్ కడిఁదిజటలు
కాదంబజాలంబుకరిచర్మచేలంబుకహ్లారములపంటకంటిమంట
యమలాంబుకాసారమహిరాజమంజీరమలక్షైరవపురంగునెలవెడంగు
గాఁగభ్రమరకీటన్యాయకలనమరుఁడు।వీరమునవెప్పుడీశుఁబాలించుకతన
నహాహతాద్రూప్యమిలఁబూనియఖిలలోక।గర్వసర్వస్వసంక్షోభకారియయ్యె॥

సీ॥ దాండయాత్రికరాజదర్శనాగతదేవవ్రజయానభ్రాంతివర్ధకములు
చంచలాభోగినీసంఘాతనిర్ముక్తకంచుకసందేహ కారణములు
భానుతాపితవియత్పరిలిప్తహిమవాలుకానేకఫలకమోహప్రదములు
పురుహూతసింధురోద్భూతరోషోత్పతత్పంచాస్యసంశయాపాదకములు
సలిలపానసమాగతజలదనికర । మతివిధాయిసరఃకేళిగతగజావ
లోకనపలాయితమరాళలోకబుద్ధి।దములుశారదసితనీరదములుచెలఁగె॥ ౪౩.

వ॥ ఆసమయంబునఁదదవలోకనంబున మనసుతల్లడవడ నాధరణీవల్లభుండు॥

శా॥ నాళీకాకరకేళిసల్పుటకుఁబూనన్ రాజహంసావళుల్
పోలన్గన్గానిజిష్ణుచాపశరముల్బోనాడివెల్వెల్లనై
తేలావల్వనివైరమంచుఁజనుచోనీవెచ్చియంభోదరా
తోలేడంగఁదొడంగుదో వదరుఁబోతున్ జాతినీచందముల్॥ ౪౪.

చ॥ నిరతముచంచలుండవిఁట నీరసవృత్తినిబల్కనిట్టిని
గ్గరకరిగాఁగనేమియనఁగారణమేమిపయోద నిచ్చలున్
సరసులవెంబడిన్ దిరిగిసారముఁగాంచినరాజహంసముల్
గరుణఁదొరంగిజేవురుమొగంబులఁగన్గానసాగనేమనన్

వ॥ అని రాయంచల విలోకించి॥

చ॥ ఘనకచకేనుగూర్తునని కాదెమొగంబులుజేవురింపఁగ
న్గానుట యిదేమి మేఘసమకుంతలయానను చేతదర్థవ
ఘనకచయన్పదంబునకుఁగాదదియర్థముబల్కఁచంబుగ
ల్గినదనుటంచలార యదిగెల్చెఁబయోధరముల్కఁచంబునన్॥ ౪౫.

మ॥ జడవృత్తిన్ జరియించువారలగుటన్ సారస్యముల్గానకీ
వెడబుద్ధుల్ గణియించి మాయెడలవిద్వేషించి హీరీయెడన్
విడనాడంగఁదలంచినారలుక విద్వేషంబుఁ గ్రానింపరే
క్కడనైన న్నలవంశజాతులిదినిక్కంబాత్మనూహింపుఁడీ। ౪౯

మ॥ నలభూజానికి భీమరాజతనయన్ నారీమణిన్ నీలకుం
తలఁ జేకూర్చినపెద్దతావకకులాధ్యక్షుండుకాఁడోటు మీ
రలుతన్నైస్రత్రిమనంబునన్నిలిపి గారామొప్పవీక్షింపుఁడీ
యలరన్నాప్రియఁగూర్పుఁడీయిపుడ నాప్రాణంబుఁగాపాడుఁడీ॥ ౫౦

సీ॥ పరమహంసస్ఫూర్తిఁబరిఢవిల్లినమీరు ఘనవిరోధంబుఁ గైకొనకయున్న
మానసప్రియలీలనూనియుండినమీరు సరసులఁదెగిభంగపఱుపకున్నఁ
జక్రాంగవిఖ్యాతిసవధరించినమీరు భువనజాతమునొంచఁబూనకున్న
వరశారదావాహగరిమఁగాంచినమీరు పదఁపడిసత్యంబువదలకున్న
నఖిలసద్ద్విజకోటిలోనంచలార। నెంచవెలిపుల్గులనుపేరుఁగాంచుటెట్లు
విప్రయోగులుమీపేరువిన్నయంతఁ। గడఁకఁదాళకదహతహపడుటయెట్లు।

సీ॥ పంకజోదరులౌటభావించఁగానైతి ఘనవైరులఁగుటనేఁగాంచనైతి
నచలరంభాప్రియేషుతైయుంటఁగననైతి నప్రియులగుటనే నరయనైతి
మాటమోపరులౌటమదినెన్నఁగానైతి నిలవిజాతులరౌటనెఱుఁగనైతి
మందవర్తనులౌటమదిఁగనుంగొననైతి మానసోన్నతులౌటఁగాననైతిఁ
బలుపలుకులేలవలరాజుబలిమికదరి। యక్కటామిమ్ము శుచిపక్షులనియు సత్య
నిలయులనియును ముఖరక్తిగలుఁగువార। లనియునెమ్మదినమ్మిరాయంచలార।

వ॥ అనుచు వెచ్చనూర్పుచున్న సమయంబున ॥ ౫౩.

## హేమంతర్తువర్ణనము.

చ॥ నలుగడభీతిహైమఋతుగునన్ జోరచారకయున్నయత్తఱిదం
టలుబిగిసళ్లఁగాగడగడన్ వడఁకించుటనాకుబంధుఁడీ
సలలితకీర్తియాతనికిఁ జాలభయంబానరించ నంచమె
క్కులుచెడ వానినోటికడిఁగూల్తునటంచుగణించియోయనన్॥ ౫౪.

సీ। జలజసంహృతికిగాఁజనుదెంచురయమునఁదొరఁగినచెమటబిందువులనంగ
గహ్వరీస్థలివిత్తగాఁదెచ్చినెఱపినవాలారుఁజలివిత్తనాలనంగ
లలిమించుశారదలక్ష్మిఁబాఱఁగఁద్రోలి లిఖియించువరజయలిపు
ఘనశుభప్రదముగాఁదనహైడిగంగనల్ లీలఁజల్లినసేసఁబ్రాలనం...

ర్ణాలతాదికములనంతటనుబర్వి। హిమకణమ్ములమిళితమ్ములైనకీనగరిమ
వచ్చెహేమంతమంతటవంతమగుచుఁ। బడమినబువంకఁబ్రబలెడుగడవడంక॥

మ॥ రమణీసంభృతపద్మరాగమణిహారశ్రేణిహొంపొన్నదుక
దమతైపుట్టినగానియాత్మ్యముసకున దాత్మైనవత్త్వోజ దు
ర్గమలబ్బిగ్గినయంతరుద్ధబహిరాక్రాంతక్రుధావహ్నివి
భ్రమురజ్యత్తుహినాంబుశీకరకదంబంబున్విడంబించుచున్ ॥ ౫౭.

గీ॥ తలఁపరోధోహసంతికాంతరమునందుఁ। గాలిచల్లారుకొఱవులకరణినిలిచె
జలజములుమాడిభసితసంచ్ఛన్నవహ్ని। ఖండమనఁదోఁచెరవిహిమాకలననపుడు॥

సీ॥ పద్మాకరంబులబాళిమైచొరఁబాటి నెత్తమ్మితూడులు సెమకి సెమకి
యచ్చోటబిసములనరసికానఁగలేక మెట్టతమ్మిబయళ్ల మెలఁగిమెలఁగి
యణియుఁగన్గానరాకనాఁకఁటఁగడునొచ్చిజడలికమైసోలఁబఱచిపఱచి
నీటఁగందథ్రాంతినిగుడించరవియత్నులు జేగురించుకచూచిచూచి
నెమ్మిఁదత్కారములుమృణాళమ్ములనుచుఁ। బొడిచిపొడిచినోరికిఁదగుల్పడకయున్న
విడిచివిడిసలంకవనడలునట్టి। బడుగుటంచలఁగాంచియప్పార్థివుండు॥ ౫౮.

గీ॥ తగినమాటయొకటిమొగమెత్తిసేయక। యంచలారయాలకించివినుఁడు
తెలివిఁగలుఁగుహారికెలననుండెడుమీకు। నాలిముచ్చునడకనడకగాదు॥ ౫౯.

గీ॥ మానసంబునఁబ్రేమంబుఁబూననీని। మచ్చరంబుననుండుటమాననేని
మానసంబునఁబ్రేమంబుఁబూననీని। మచ్చరంబుననుండుటమానరయ్య॥ ౬౦.

సీ॥ ఎంచఁగామీజాతిశాంచెపునడకది వసుధనెన్నఁగమీరు వాతరట్లు
తెలియంగమీకూటములువేళకొలఁదులు చూడమీరలుగండిచొరవకాండ్రు
పరికింపమీరాకపక్షపాతధురీణ మరయంగనెఱబొల్లులకటమీరు
తలఁపమీగతులుతమ్ములవేరువిత్తులు వర్ణింపమీరాకవాకువార
లౌనరమీయున్కిగగనప్రయోజనంబు। పొలుగలవారివలననేర్పడఁగఁదెలిసె
భేదబుద్ధివహించినపెద్దలగుట। పొంచియుండకచనుఁడురాయంచలార॥ ౬౧.

వ॥ అనియధిక్షేపించి వానికాకరంబులైన జలజాకరంబులన్గనుంగొని॥ ౬౨.

ఉ॥ ఇట్టివనాటకోటిఁజరియించినభంగమువచ్చునంచునె
ప్పట్టునలోఁదలంపకయపార రసంబునఁదొట్టికొని తోఁ
బెట్టుకయున్నమీకిఁక గభీరతవక్కనా భూజనాళిమీ
యట్టిజడాత్ములన్సరసులంచుమదిన్ గణుతింపనేర్చునో॥ ౬౩.

మ॥ పరహంసస్ఫురణక్రమంబునకునోర్వన్లేనిహేమంత మి

ప్పరహంసక్రమవిస్ఫురత్కలనకున్ బ్రాహ్మణమిత్రోర్చ్చితే
సరసుల్మీరలెఱుంగరే యిదినిజస్వాంతంబులన్నిల్పఁగా
ధరమీతమ్ములనాంచియిమ్ముశరశ్శైత్యస్ఫూర్తినొందించుటల్ ॥

మ॥ అననేలా మిము నింతినోముగనుపుణ్యంబబ్బకున్నన్ దదా
ననసామ్యంబువహించుతామరలనైనంజూచుభాగ్యంబుగ
ల్గెనుమీవంకనునాకటంచుననురక్తింజెందఁగానక్కటా
కనిచూపోపకదైవమీపగిదిస్రుక్కంజేసెనింకేమనన్॥ ౧౫

సీ॥ పాలఁతుకకెమ్మోవిఁబోలుసారసమరందరసంబులింకనెన్నటికిఁగల్గుఁ
బాలచన్నులఁబోలునాళీకకోరకోన్నతిచెల్వమింకనెన్నటికిఁగల్గుఁ
జానకన్నులఁబోలుశతపత్త్రపత్త్రవిస్ఫుటశోభలింకనెన్నటికిఁగల్గు
నెలఁతబాహులఁబోలునెత్తమ్మితూండ్లవిన్నాణంబులింకనెన్నటికిఁగల్గుఁ
దెఱవనిద్దంపుమెఱుఁగుమైఁదీఁగఁబోలు।నలినలతమేల్మియింకనెన్నటికిఁగల్గు
నకటతెలుపఁగరాదెకోకాదిరతిక। రమ్ములారయోపద్మాకరమ్ములార॥ ౧౬

వ॥ అనుచుఁదహతహంబడుచు మదనవేదనాదోధూయమాన మానసుండగు-
నున్న సమయంబున ॥ ౧౭

## శిశిరర్తువర్ణనము.

మ॥ తలిరుంబోఁడిని నెమ్మదిన్నిలిపికందర్పప్రతాపోష్మని
చ్చలుగాసిల్లునృపాలశీతరుచికిన్ శైత్యంబుఁగావింపఁగా
నలతన్వంగిమెఱుంగుఁజన్నుఁగవనౌష్ణ్యం "బుష్ణముష్ణేనశీ
తల" మన్నుక్తిఁదలంచినిల్వనన నంతన్ శీతువేతెంచినన్॥ ౧౮

మ॥ జలజాప్తుండునువారివాహపథసంచారంబునన్ స్రుక్కితాఁ
జలికిన్ దాళఁగలేకబాడబశిఖిజ్వాలాకలాపంబునన్
జలిగాయంగమనంబునందలఁచినిచ్చల్ శీఘ్రయానంబునన్
జలధిన్ గ్రుంకఁగఁబాఱఁగాదె దినముల్ సన్నంబులయ్యెన్ దగన్॥ ౧౯

మ॥ సిరిమైగోవజవాజిపూఁతకలిమిన్ జెంతన్ గుభాళింప గు
జ్జరినిద్దాతటటాకురాళములో సంపంగిపూఁబాన్పునన్
సరిగంచున్నవిపట్టుసుగ్గడితపున్సయ్యాటపున్నప్పులన్
దరుణుల్ గాంచిరిసౌఖ్యసంపదనితాంతాశ్లేషశైయత్తతిన్ ॥ ౨౦

చ॥ దళమగునైంద్రిసేనుతనుతాపభరంబుసహింపలేమిచే
బలెశిశిరర్తువేగకనుపట్టెనసంతమనంగకాంతమై

వెలువునఁదన్నుఁబోలునృపుచిత్తముఁడింపుపడంగమిక్కిలిన్
వలపుఘటించితత్ప్రియ నవశ్యముగూర్పఁదలంచియోయనన్॥ ౭౧.

## వసంతర్తువర్ణనము.

సీ॥ భళిపాండుపత్రౌఘములునేలకుఁదొఁఱంగఘనవనప్రియలీలకడువెలుంగఁ
బాగురేవేమాఱుశరములువికసింపఁగువలయంబొకవింతకొమరుఁగాంచ
బాపురేయెండయేర్పడలోకమొఱపొంద వనిసారసవనంబుపెనుపుఁజెంద
నయ్యారెపథికసంహతివడంకఁదొడంగ నిలదోఁపుపచ్చడంబులెచెలంగఁ
గనదమితజాతివిస్ఫూర్తికడకుఁబాయఁ। బుడమిఁగనుపట్టిమిగులనద్భుతమొనర్చెఁ
జారుతరమూర్తిసకలర్తుచక్రవర్తి।మధుఁడుతనయందుసకలర్తుమయతఁదోఁప॥ ౭౨.

మ॥ వనజాప్తుండుప్రవృద్ధుఁడై సముచితవ్యాపారతన్ దక్షిణా
వనికిన్బట్టముఁగట్టిపట్టి హిమవద్వన్యాగ్రవీధిన్ వపం
బనవద్యస్థితిసల్పఁగా నరుగుచాయంజొయెఁడాను త్తరం
బునకుండాపసనాథవైఖరిఁగనస్ఫూర్జజ్జటాపాళియై ॥ ౭౩.

సీ॥ జాతిసౌభాగ్యమార్జనహేమలేఖను లుదితాస్త్రమదనశ్లోదయములు
సురభిప్రరస్ఫురత్కరదీపికావళు లలమధ్యకర్కరికాననములు
కుజఘూతభగ్నసంకులబాలరవిఘృణుల్ గ్రులతామిథోరాగవిలసనములు
పికసమాహ్వానకల్పితమాంసఖండముల్ మారుతప్రాపితమలయధాతు
లమితవనదేవతాకేళికాసమాన।చంద్రశాలావినిర్మాణసముచితోద్ధి
తప్రవాళమణిస్తంభతతులపార।కలనఁబల్లవాంకూరముల్గలయమొలిచె॥ ౭౪.

సీ॥ జాతివైభవసముచ్చాటనమంత్రంబు కామప్రతాపాగ్నిసామిధేని
సారభాగమసూచిసాహిబానినాదంబు శైశిరసమయాభిచారసూక్తి
తరులతాపరిణయోత్సవకాలశుభగీతి బాలానిలాగ్రతఃపఠితబిరుద
మసమానకిసలయగ్రసనాస్నసూక్తంబు పథికమనోంబుజప్రళయగర్జ
ఘుననవీనరమాసూతికాగృహాయ।మాననానాదిగంతరోద్యానవాటి
ఘటితశుద్ధిపుణ్యాహసంకల్పమొసఁగెఁ। గాఁతుకాకుంతకలకంఠకంఠరవము ॥

చ॥ శిశిరభగీరథాహృత విసృత్వర శుభ్రహిమాభ్రవాహినిన్
భృశతరవేగలీల సురభిస్మరఘుస్మరుఁడొఁగి నిల్పుచో
విశదముగా లతాజటలనెల్వడు తత్కణబృందమోయనన్
దశదిశల న్గడుంగసముదాయమలన్దగెఁగోరకచ్ఛటల్॥

చ॥ తొడిమలచుట్టుఁజుట్టుకొను తుమ్మెదలంగనుపట్టుమొగ్గపూఁ

దుడుములుకంటికింపెసఁగెఁ జొట్టినకిన్కమసంబులోపలన్
గడుతమకంబురేఁప బలుకాననపుం జెఱసాలశీతులే
బుడుతలఁబట్టిమాధవుఁడు పూనికసంకెలలూఁడ్చెనోయనన్॥ ౭౭.

మ॥ తలిరుంగేలికినీలకంకణములై తళ్కుల్ పచారించు కు
ట్మలదంతావళికస్వఁగప్పయినిగాఢస్వచ్ఛగుచ్ఛ స్తన
స్థలికిన్ మారకతోపలాగ్రసరమై చంచద్వనీదేవతా
లలనాసంతతికిన్ ఘటించెఁ గడుచెల్వంబత్తతిన్ దుమ్మెదల్॥ ౭౮.

మ॥ కలయంజొక్కపుముక్కుటెక్కుజిగిమొక్కల్ నిక్కరాచిల్కపి
ల్కలుగుజ్జుంజిగురాకుమావిపొదలోఁగావెడెము ల్వెట్టిదృ
గ్జలజాతంబులకింపుఁగూరిచె భవిష్యత్పౌష్పపాలాశవో
జ్జ్వలవర్షాగమసూచిసారపరివేషశ్రీవిడంబింపుచున్ ॥ ౭౯.

చ॥ హరునకువెట్టుజుట్టిన యమాలయవాటికఁజేరియచ్చటన్
మరుఁడుతదీయశాసనమునన్ విరహిప్రకరంబునొంపదు
ష్కరగతినెట్టఁబోగొసఁగఁగైకొనివచ్చినలీలవచ్చెఁగ్రొ
వ్విరిరవదున్నచాల్గొనిదివిన్ మలయాచలవాతపోతముల్॥ ౮౦.

మ॥ తలిరుంగేల మరుత్కిశోరగమితాత్యచ్ఛప్రసూనాంతరో
జ్జ్వలకింజల్కసమాఖ్యకోద్రవము లెంచన్నించి శేఁదేఁటి పి
ల్కలపేరందగుబొగ్గుజీనువులజోళ్లన్ బట్టియాడించె న
ట్రి లతాంతాయుధుఁగూడి మాధవుఁడు జాతిస్యూతసూత్రచ్యుతిన్॥ ౮౧.

మ॥ అలరుంబుట్టశిరోవిలగ్నమధుబింద్వాసక్తరేణుచ్ఛటా
కలితస్ఫారఫణామణీకమధులిట్కాహివేవెల్వడన్
నిలిపెన్ సంపంగితావికొమ్మ తవిటీనిద్దంపుబెత్తంపువే
టులఁదద్ధూళి విభూతిలిప్తుఁడయిగాడ్పుంజోగి యెంతేరహిన్॥ ౮౨.

మ॥ తలిరుంజొంపపుడాలుపూరజపునిద్దాజూలుబత్తేఁటిగం
టలచాలున్ విరితేనెమేలుతరులంటంబ్రాఁకులేఁదీఁగచే
ర్కలబారీలు జగాచొకా యలరుజాగా మావటీలొప్పఁ
వలరాదంతులకైవడిన్ వనములోఁబ్రవన్ ద్రిమ్మరున్ దెమ్మెరల్॥ ౮౩.

సీ॥ ఇగురుకైజీతంపుటెక్కటీలకుగుజ్జుపరపుమామిడిఁగట్టుబడిగఁజేసి
చలువపూఁదేనెగాసపునల్లప్రజలకు నలకుటీరమ్ములుమ్మలికలొసఁగి
పాలుపొందుపండుకావలిపాళెగాండ్రకుగున్నదాడిమమిచ్చి కుదురుపఱచి

వలితావియేర్పాటువడిగలబౌరకుఁబుష్పాడిదిన్నెగము లేలుబడిగఁ జేసి
తలిరువిలుకాఁడు కేరలిపోఁజులుఘటించె।హ త్తివిరహులమీఁదదండె త్తఁదలఁచి
రతియుఁదనమ్రోళ్ళఁగడువడిరతులఁదేలఁ । బంతమాడుచుఁజాలవసంతవేళ॥

చ॥ చలమునదానయోగిజనసంఘము వెంపరలాడఁబూనిపూ
ములుకులువింటఁగూర్చుతఱిముక్కులఁబీల్చితదీయసారమ
గ్గలముగఁగ్రోలఁగా నుసురుఁగాలములన్మరుఁడేయ వ్రేటుచా
యలనలరెన్ బలాశముకుళాంతములంటుకమూఁగుతుమ్మెదల్॥ ౮౬.

మ॥ వదరుందత్తడిసానిచెంతఁగడు తేవన్ వచ్చు లేమావికొ్రం
బదనుంగెందలిరాకుడాల్వలపుబాబాయెక్కుడుంగండుఁదేఁ
టిమనేదారులవెండిగిండిగమిసూటిన్నించుపూఁదేనెసం
పదనాక్కించుకవిచ్చుక్రొమ్మొగడజొంపంబుల్ వనీవీథులన్ ॥ ౮౭.

మ॥ తలిరుంగైదువురాయఁడధ్వగులపైదండెత్తఁ లేఁగాలిబె
స్తలచేఁబంపినపండుటాకుఁదవిటీజాబుల్ గనుంగొంచువిం
తలుగా వారికిఁజైత్రుఁడిచ్చుబురుసాదట్టీలుముత్యాలతా
వలములో్ప లెఁదగున్ జిగుళ్ళుకలికావారంబులీరంబులన్॥ ౮౮.

సీ॥ సుమనోరథుఁడుధాత్రిసుమనోరథుండయ్యెశుకములుప్రకటితాంశుకములయ్యె
మాకందమలఘురమాకందమైమించె వకుళంబునవపల్లవకుళమయ్యె
రోలంబమగమశిరోలంబమైపాల్చె జాతులు హత నిజ జాతులయ్యెఁ
గలకంఠమనువేలకలకంఠమైయొప్పెఁ బవనుఁడు సేవితోపవనుఁడయ్యె
మధురతరశీతమధుపూరమహితకుసుమ । పరిమళమ్ములుఘుమ్మనిపరిమళించెఁ
దలిరులేఁదీఁగ యువిదకై దండయొసఁగెఁ। జెలఁగివనపీథిఁజైత్రుండునిలుచునపుడు॥

వ॥ ఆసమయంబున నిజవియోగశిఖిశిఖాసమీరవ్యాహారంబులగు కీరప్రసవ శిలీ
ముఖపరివారంబుల ననుంగొని॥ ౮౯.

ఉ॥ కీరమనీవుకొంతచెలికిన్ సరిగావుననీదుమాటలన్
గీరమసైచితిన్మధుపకీటములేగయికొన్నయీబెడం
గీరమచేరిసేయుబుతువేవినఁ జూ రతిపుష్పకోమలాం
గీరమణుండుతాళకపకీలననున్ దలఁద్రెవ్వనేసినన్॥ ౯౦.

క॥ పదమావికిపొదపా। పదమాయిటనుండకున్నఁబతియగునలరా
పదమానసుమీయిదెచల। పదమామాయెమటనిలువఁబడపట్పదమా॥ ౯౧.

సీ॥ దాడిమీవనమెల్ల ధారబోసెదమీకుఁజెప్పఁడీనావంతఁజిలుకలార

# చతుర్థాశ్వాసము.

మాకందవని సర్వమాన్యంబు జేసెదఁ బ్రకటింపుఁడీ నన్నుఁ బికములార
కమలాకరము పాళెముగఁ బట్టుకొసఁగెద నెంచుఁడీ నాదెస నంచలార
తావిక్రొవ్విరిపొదల్ దడయక కేలించెదఁ దెలుపుఁడీ నాలాగు తేఁటులార
పలుకులాలింపఁ దిన్నని పాటవినఁగ । మురువు నడ జూడ ననుఁ గొప్పమూర్కొఁ
వెలఁదిఁ జేరిన వేళ నా విన్నపంబుఁ । గరుణ దొలకంగ నంతరంగమున నునిచి॥ ౯౨.

వ॥ అనుచు నెచ్చనూర్చుచు॥ ౯౩.

సీ॥ ఆపూర్ణచంద్రాస్య నాత్మలోపలనుంచి వైవర్ణ్యచంద్రిక వాడఁబారు
నానిశారోమాళి నాత్మలోపలనుంచి మోహాతమోవృత్తి ముడుఁగఁబారు
నా కేకినిభకైశ్య నాత్మలోపలనుంచి రోమాంచశిఖల మైస్రుక్కఁబారు
నాఘనాఘనవేణి నాత్మలోపలనుంచి కన్నీటజడివానఁ గలఁగఁబారు
నెపుడు నా చక్రపతి యా మహీశపుండరీక మా దివ్యతరభోగి యా కుమార
హంసముల కేళికావనాభ్యంతరమున । సురభిసాయకసాయకజ్వరితుఁడగుచు॥ ౯౪.

సీ॥ తనతనూకంపంబు లణఁగింపఁ దన్వంగి చెమటపన్నీటితోఁ జేరఁ దలఁచుఁ
దనవియోగాగ్నివేదన మాన్పఁ జంద్రాస్య యూర్పుగాడ్పు బయళ్లనుబుకఁ దలఁచుఁ
దనలేఁత చెమట యొయ్యన నార్పఁ దనుమధ్య యుదిటి కౌఁగిఁటి యమ్మనుండఁ దలఁచుఁ
దనపరిగ్లాని నెంతయుఁ దలంగింపఁగా మగువ వెన్వెంటఁ ద్రిమ్మరఁగఁ దలఁచు
రాకుమారుఁడు మరుదలిరాకుఁబాకు । కడిఁదిమొనతాఁకుచులుకుచీకాకుపలుప
గాంచు రేగిన నెమ్మది కొంచువారి । తలఁచిచూచినఁగ దువిచిత్రంబు కాదె॥ ౯౫.

సీ॥ వెయ్యాలు జెనకిన వేధఁ జెందని మేనుఁ జెల్లరే యిటు సొమ్మసిలఁగఁ జేసె
నెంతకార్యంబైనఁ జింతఁ జెందని చిత్త మక్కటా కళవళమందఁ జేసెఁ
బైమిన్నువ్రాలినఁ బవరని ధైర్యంబుఁ గటకటా కలఁచి చీకాకుఁ జేసెఁ
బ్రతియెచ్చటను లేకఁ బ్రబలిన శౌర్యంబుఁ బాపురే యాడనిఁబాడఁ జేసె
సూనములె పూని యిల పాంథమానసేంధ । నప్రతాపాగ్ని భుజుఁ మీనధ్వజుండు
వీనిఁ బోలిన శూరులేవీట నైనఁ । గలుఁగరని యెంచు జనపతి యలఁతఁ గాంచు॥

సీ॥ అనఘవిక్రమధుర్య యని కవుల్ వినుతింపఁ గొంచిచ కంగీకరించు టెట్టు
లచలితోన్నతధైర్య యని బట్లు బాగడఁగా సిగ్గులేకవిచెవిఁ జేర్చు టెట్టు
ఘనవివేకధురీణ యని బుధుల్ గొనియాడ నాత్మరోయక ముదమందు టెట్టు
లత్యంతబలనిధులని భూమిజను లెన్నఁ దలవంచుకొనక నే నలరు టెట్టు
తలిరుఁగైదువు నెఱజోదు దారికోడి । మనసు తాలిమిఁ దూలిమున్నెనక గాన
లేక కడు సొమ్మసిలి లేవలేని నేను । బాపురే యని వగచు భూపాలసుతుఁడు॥ ౯౭

**నర్మసఖుఁడు చేరంగని వేటకుఁబోయిన రాజుఁ దాఁ**
**జూచిన చెలిని చంద్రాంగదుఁడు వర్ణించి చెప్పుట.**

గీ॥ అప్పుడువిభుఁ జేరినర్మసఖాగ్రగణ్యుఁ । డలఁతఁగన్గొనిపుని యొసఁయంతవాని
కింతవలవంతఁ దెచ్చినయిగురుఁబోఁడి। యెచటనుండెనోచూచుటయెన్నఁడొకొ॥

సీ॥ అనుడుభూపాలుఁడిట్లనియె నేనొకనాఁడు వేఁటపైవేడుక వెడలియడవి
గండభేరుండాదికములఁద్రుంచుచునంతఁ బులుఁగులఁజోపుచోవెడలునాక్క
గోరవంకపైడేగఁగొని వేయనదిదానిఁదఱుమ వెంటాడితత్తడినినూకి
కొనిపోయియలసియొక్కటికేళివనిఁగాంచియటనిల్వచెలులు నెయ్యమునఁగొలువఁ
గలువకైదువునెఱజోదుపాలుపుఁదెలుపు । తళుకునునువంకచూపులనాలసిసొలసి
మాటిమాటికిఁగ్రేఁగంటమర్మమగలఁ । గలయఁదిలకించునాకమచ్చకంటిఁగంటి॥

సీ॥ సాంద్రదీప్తకపోలసాంకవామోదంబునాదోజమృగమదసౌరభంబు
వేనలిఁజెరివినవిరిదండనెత్తావిఘనసారతిలకవాసనలకలిమి
కర్ణభూషణదరకైరవగంధంబుకరగతనీరేజపరిమళంబు
మైనలందినకుంకుమప్రసౌరభ్యంబుబాహుమూలవుఁగదంబంపువలపు
కలసియొకవింతవైఖరిఘుమ్మురనఁగ। నమృతరసపూరమారూపమైనపగిదిఁ
జెలులఁగూడిచరించునాకలువకంటిఁ। గంటిఁజెలికాఁడకన్నులకఱవుదీర॥ ౧౦౦.

క॥ కంటికినింపొదవంగాఁ । గంటిన్మరువింటిపాలుగాఁజెలినోవిఁకా
వెంటనెమామకహృదయముఁ । గంటిన్మరువింటిపాలుగాఁజెలికాఁడా॥

సీ॥ చెలికురుల్ పులుదిండిచలుపలౌమామకస్వాంతతృణగ్రాహులయ్యెఁగాన
నాతిమోమిందుఁడౌనాకన్నుఁగలువనెచ్చెలిపుల్గులకువిందుఁజేసెఁగాన
నబలచన్గవమందరాద్రియౌమదవార్యగాంభీర్యపాథోధిఁగలఁచెఁగాన
జలజాక్షిపొక్కిలిసరసియౌనాత్మవీక్షణమీనములయునికిఁగనియెఁగాన
మఱియుఁజెప్పెదసఖుఁడయమ్మంజువాణి। తళుకుఁగపురపుఁబలుకునెత్తావిఁజిలుకు
పలుకుపలుకులనలయాడుకుందనంపుఁ। బసిఁడిపనిబొమ్మయామోహమొసఁగెఁగాన॥

గీ॥ వినుముచెలికాఁడయొఱిఁగింతుఁగనినతెఱఁగు। రాజునకురాజునిక్కమారామమోము
దానికరభోరుసంపదఁదతిమిగెలుచు। దానికరభోరుసంపదఁదరమెపొగడ॥ ౧౦౩.

సీ॥ నీలాలకవిదిర్చునెరసినకురులచౌక్కపురంగుకటికిచీఁకటిచెడంగు
ముద్దులాడిఘటించుముఖమజ్జనపువేళఁదూడిచినతడియొత్తుత్తుహినకరుఁడు
నలినాక్షికల్కపట్కులులఁజిందునమృతపూరముపూరచంద్రికా[illegible]యంబు

# చతుర్థాశ్వాసము.

మగువమిన్నపదాంగుళిమణిశలాకి । కలఘృణులపైకినెగఁబ్రాఁకనలచివాలుచు
తళుకుమైచాయయచ్చరతలిరుఁబోండ్లు । నిజముచెలికాఁడవినుముస్సందియమువలదు ||

సీ|| మించుదట్టపుసాటికించుదట్టంపైన సతిమోముతోసాటిచంద్రుఁడగును
రసదాళిచెఱకుతోఁబ్రతివెట్టిచెఱకైనఁజానవాతెఱప్రతిచక్కెరగును
ధరరామచిలుకతోసరియాకుచిలుకైనఁబడఁతిపల్కులసరిపైకమగును
నునుదమ్మినూలికినెనదూదినూలైనకలికికౌనునకెన గగనమగును
గాకనీలీలవర్ణింపఁజోకయగునె । యెక్కడెక్కడియాపమ్యమేటిమాట
యలలతాతన్విసౌందర్యమనుపమాన । మెన్నఁజెలికాఁడనీయానయిదినిజంః

క|| ఆయింతిచూపుచూచుక । కాయొ పండో తెలియదుగానిమదాత్మన్
బాయకతగునాశాపా । ధేయంబిడివెంటనంటితిన్ జెలికాఁడా|| ౧౦౬.

శా|| ఎంతేవేడ్కఁజూచుచున్నతఱినాయిందీవరాక్షీమణుల్
దంతీంద్రంబునుబోలెనత్తుకొనియుద్యల్లీలలన్ బోవనా
కాంతారత్నముమెల్లనేచనియెఁదత్కాంతావియోగార్తినేఁ
జింతిల్లంగడునద్భుతంబాదవ వచ్చెన్ శౌరి నారీ గతిన్|| ౧౦౭.

అట్లుచనుదెంచి తనవిధమాలతాంగి । వృత్తమెఱిఁగించిచెవులకువింతనించి
యాసమాటలనాకకొంతయాసఁబెట్టె । నాదవుపేరాసవచ్చితినోవయస్య ||

ఆరామామణివిమలత । నూరేఖావిభ్రమములునుతియింపఁదరం
బేరసఫణిపతికేనిన్ । ధారాపతికేని శారదా పతికేనిన్|| ౧౦౯.

సతికచంబుననిరాకృతిఁజెందితినటంచు భ్రమరికృపీటజాతమునఁబడియెఁ
బడఁతికొప్పునఁబరాభవమొందితినటంచుజలదసంఘంబువిషంబుఁగ్రోలెఁ
జెలివేణిచేఁదిరస్కృతిఁజెందితినటంచు నహిపొట్టనాశుగంబాని నిలిచె
నతమధ్యకురులధిక్కృతినొందితినటంచు హరిమణిగరసూత్రమంటివ్రేలె
నెట్టిదైవబలంబొయొక్కింతయైన । విషమపదవృత్తితాపనిర్వేదనముని
పల్లవోద్గమనంబునుపద్రవంబుఁ । బొరయకవిగాంచెమిగులవిస్ఫురణగరిమ|| ౧౧౦

జలజదళాక్షికన్నులకుఁ జన్నులకు న్నునుగౌనుదీవకున్
దలఁకిపరాభవంబుగనుతామరసాచలరాజసత్పథం
బులవగదీర్చునేర్పననుముద్దియవేణికినోడిచేరియ
య్యళిశిఖిమేఘముల్ తమనిరాకృతిఁజెప్పెరుతిచ్ఛలంబునన్|| ౧౧౧.

శ్రవణశ్రీలువిశాలలోచనయుగచ్ఛద్మాత్మపాణిద్వయిన్
నిలుడుంజోక్కపుటల్లిపట్టుమరసెం తేగంజికాల్వట్టత

త్పత్రివృతభూత్రిలతికాకరుండువిశ్రుతభూత్రినైకపాదుండునై
నవకేళింగనుబాలచంద్రుఁడనఁగన్పట్టెన్నాసల్కాంతకున్॥ ౧౧౨.

క॥ సతితీరుకరన్యాస । స్థితిమెచ్చుతటిన్ దగినరతిప్రభునాకుం
చితతర్జనికాంగుష్ఠాం । చితాంతరంబనంగనుదురుసిరినొప్పారెన్॥ ౧౧౩.

చ॥ ఘనకచనేత్రముల్ ధవళకంజములంచుఁగనీనికామిషం
బ్బనిరుమేనుదాల్చియటబొందనిజేశ్వరుతోరమింపఁగాఁ
బనివడికంటిపాపలనెపంబువహించిన శ్రీల లజ్జ గీ
ల్కొనలనొతదీయవాచకములున్ గడనిల్చెశ్రుతిచ్ఛలంబునన్॥ ౧౧౪.

మ॥ చెలియాస్యద్విజరాజుపద్మవిజయశ్రీఁదెల్పనుద్యత్కళా
త్యలఘుప్రక్రియమెచ్చొనర్పఁగసుదృగ్వక్త్రాధిపత్యంబుని
శ్చలతంజెల్లఁగఁధారవోసియలవ్యాజ్ఞాతుండుపాలింప రం
జిలుగొప్రింబుత్తడిశాసనాలనఁదగున్ జెక్కుల్సువర్ణస్థితిన్॥ ౧౧౫.

చ॥ అలికచనెన్నొసల్ భ్రమరకాంచితమైదనరార·రాహువుమం
డలకబళీకృతార్ధనలినప్రతిరోధివిధంబుఁదాల్పఁద
త్కలనకుఁబెద్దలౌటఁదెలిగన్నులువీనులపేరిబావుల
న్నిలుకడఁగ్రుంకిలేచియటనిల్చెవిమోక్షణమజ్జనార్థమై॥ ౧౧౬.

సీ॥ చంపకామోదవీక్షణములసాటియే తుమ్మెదల్ గేదంగితుదలమన్నఁ
జంద్రికాహాసవీక్షణములసాటియే తమ్మిలుతరగలదండనున్నఁ
జక్రవక్షోజవీక్షణములసాటియే బేడిసల్లలువలగూడుకొన్న
ఘనతమోవేణివీక్షణములసాటియే నెలపుల్గుఖంజనకలనఁగన్న
ధాత్రినిందులకొకయలినేత్రయొక్క। కంజలోచనయొకమచ్చకంటియొక్క
మదచకోరాక్షివాడుకఁగదిసెనేనిఁ। బంతమునగెల్తువలరాజుపాదమౌన॥

క॥ కనురెప్పతుదలఁదోఁచిన । కనుబొమలోరెప్పవెంద్రుకలుప్రతిబింబిం
చినరెప్పవెంద్రుకలొగనఁ। గనుబొమ్మలెటుంగరాదుకాంతామణికిన్॥౧౧౭.

గీ॥ అన్యములడించిముఖవర్ణమభిలషించి। కూడెనాగెలుసంపంగికోమలాంగి
నాసయనమించేఁగాకున్ననాతిముక్కు।వానివలెనున్నదనవెట్లువాసికెక్కు॥

చ॥ చెలినునువంకకన్నుబొమసింగిణిదిగ్విజయంబుఁగూర్పఁగాఁ
దొలుతటియించువిల్లునిమితుంటలుచేసి మరుండువాచవుల్
గొలుపుటకైసుధారసములోబలుమొఱునుముంచి పల్కఁజి
ల్కలకిడునొంటితుంటయనఁగాఁదగెవాతెఱమాధురస్థితిన్॥ ౧౨౦.

# చతుర్థాశ్వాసము.

అరుణసుధాకరరుచిధా। స్వరసంగతిగనుకతననోననితామధురా
ధరమెటుఁగనుఁగొననియ్యక। పరఁగించుఁ మోహతమముబహుళస్ఫూర్తిన్॥

అయథావాదవిలగ్నవాక్పటిమ కాహా యొడిఁయెంతేకర
ద్వయిపైవ్రాలువిపంచికాతిలకమేతాదృగ్విధా నేతకా
పయికంబుల్ గనలేకపైకము తృణప్రాయంబుగాఁబల్లవో
చ్చయముల్మెక్కు శుకంబులెక్కునటవీశాఖాగ్రభాగంబులన్॥ ౧౨౨.

ఆతరుణీలలామవదనామలభాసవికాసలక్ష్మిక
త్యాతతచంద్రచంద్రికలకారయభేద మొకింత లేదు వి
ఖ్యాతలసత్ప్రసన్నగుణగౌరవసంపదచంద్రచంద్రికల్
ఛాత్రతలాడానివక్త్రముకురంబునకున్ జిలునవ్వు తేటకున్॥ ౧౨౩.

జడదారికంటిపాపని। వడువుననున్నది లతాంగివదనంబేకై
వడిదారకునాకన్నుండన్। గడపటఁగనుపాపవిపియుఘనులుగలరెకా॥
పరిపరివిధములజనముల్। సొరిదింబరికింపఁ దానుచుక్కనమొరయున్
దరమదిసరియగునెసుధా। కరవాక్చాతురులవలుకఁగలగళమునకున్॥ ౧౨౪.

ఉదిరిబంగరుగిండ్లనాదవిననిగనిగల్ గరికుంభములనున్న గౌరవంబుఁ
గులధరాధరములఁగలయున్నతత్వంబునెత్తమ్మిమొగడలనెగడువాఁడి
వీణకాయలనుబర్వినవర్తులత్వంబుఁగవజక్కవలఁజెందుకలికితనము
మణికందుకంబులమలయుకాఠిన్యంబుమెఱుఁగుతాళపుదోయి మెఱయుసమత
గూర్చియజుఁడింతిచన్నులుగూర్చెఁగాక। యట్టిజిగియట్టిపృథులత్వమట్టినిక్క
నట్టిమొనలట్టిబటువట్టిసొంబగు। నట్టిబిగువట్టితుల్యతయెట్టుగలుఁగు॥ ౧౨౫.

॥ కోరిబంతులఁజాలగుణవంతములటంచుఁజెట్లమారులనీడుబెట్టఁదగునె
తాళముల్జూడఁగీర్తనపాత్రములటంచుఁగొట్లమారులజోడుగూర్పఁదగునె
సముద్రగ్రకలశముల్ చక్రవర్తులటంచుమొట్లమారులసరిమొనపఁదగునె
కిన్నెరకాయలువన్నెవాసివియంచుఁగట్లమారులనుద్దిఁగట్టఁదగునె
మొచ్చమొకయింతలేకనత్యున్నతులను। దులనుబూనకపూర్ణకాంతులనుబొదలు
కుక్కజక్కవగుబ్బెతచొక్కటంపు। నిబ్బరపుటుబ్బుగబ్బిచన్గుబ్బగవకు॥ ౧౨౬.

వ॥ ఘనపదవృత్తిహేమమయకంజములన్ గలసారవాహినిన్
గనుఁగొనిసారవాహినియొకావునఁదానుగళిందకన్యయా
ఘనపవవృత్తిహేమమయకంజములన్ దగఁబూనినిల్చెనో
యనఁజెలిమధ్యభాగముననారుదనర్చెఁగుచావతంసమై॥

వలరాయండను వేఁటకాఁడలయువవాృతంపులేఁజూపుపి
ట్టులఁజెట్టిన జెలినాభియన్జలమదండన్గానుగొృమ్మించుడాల్
వలయేంతేఘటికియించిచన్నుఁగవకేృవన్పాంచెఁగాకున్నరో
మలతాకైతవనీలసూత్రమునఁదన్మధ్యంబుగన్పట్టునే ౧౨౯

క॥ సతినిద్దపువెన్నడుమునఁ। బ్రతిబింబితమైనవేణిఁబరికించిభృమా
వృతినూగారంమరుగా। కితరంబులకచటనుండనెడయున్నలదే॥ ౧౩౦.

గీ॥ హృదయమువాస్తవ్యుఁడగుమారుఁడెలమిఁబెంచు। చక్రవాకద్వయిలతాంగిచన్నుదోయి
దానిఁగట్టిననీలసూత్రంబెయారు। వెలయనందలికోనకుచ్చువలుదనాభి॥ ౧౩౧.

క॥ వనజభవుఁడవయవమ్ములు। దనరారస్పజించిసావధానమతిన్గ
న్గానికొనాక్కలెదబ్బలు। యనిబుజయిడుపగిదినాభియంగనకలరున్॥ ౧౩౨

గీ॥ సూనసాయకుఁడమ్ములసానబట్టు। మానికపుశాణచక్రమామగువపిఱుఁదు
దానిజిగిజాళువాపిడియానుకాను। తనరనదులనుగనుపట్టుదరులుతఱులు॥

గీ॥ ఇద్ధలావణ్యకవచసన్నద్ధవిపుల। కటిరథారూఢుఁడగుచుజగంబుఁగెలువ
నంగజుఁడుజంఘలనుదానలరమున్నఁగఁ। గనుఁగొనఁగనైనకరభమల్కలికితొడలు॥

క॥ వనజదళాయతనేవలో। చనచరణములాత్మజాతశైలేయమలౌ
టనాకొయప్పట్టునరా। జనపుంబొటకరలునిగుడెజంఘలపేరన్॥ ౧౩౫.

గీ॥ ఆలమునవెన్కఁజొరఁబాఱునంపదొనలు। కలనుగనియెంగలికిఁజొచ్చుఁగాహాళములు
యెన్నసరిగావుకావుననన్నెలంత। జంఘలకునన్నెలంతుకజంఘలీడు॥ ౧౩౬.

చ॥ పదములరేఖికాచలనఁబాయకకొల్చితదీయసామ్యసం
పదసహవాసిమైనయలపద్మముఁజెందఁదదీయసాదృస్యసం
పదలనెతత్పదాబ్జములపైఁబడియందెలమోృఁతపేరనిం
పొదవఁగవేఁడుకూర్మములయోజఁదగున్ బ్రపదంబులింతికిన్॥ ౧౩౭.

మ॥ జలజారాతిసఖీముఖామితకళాసౌభాగ్యలేశంబుదాం
గిలిపాలీకపెనంగవబ్జముతదంఘ్రిద్వంద్వముందాసము
జ్జ్వలరేఖాకృతిఁజేరియాత్మరుచిలంచంబిచ్చితోఁపింపఁగా
వెలనిగ్గుల్గనుపట్టెగొళ్లపగయుట్టెన్ దానికాహేతువున్॥ ౧౩౮

సీ॥ ఘననీలవర్ణశోభనభూతికొప్పునసనుదుటనువిధుకళానూనకలన
శ్రీవరలక్ష్మివిశేషంబువీనులశార్ఙ్గసంభవధర్మసరణిబొమల
శ్రీవత్సలాంఛనస్థితినేత్రయుగమునఁగనకవాససస్ఫూర్తిగొనబునాఁస
మాధవోజ్జృంభణమధురాధరంబున నలముకుందఖ్యాతిపలువరుసల

నాస్యకుచమధ్యమునసజ్జారిధరహా।రిప్రకృతిసప్తపత్త్రిధామప్రతతి
తోడలఁగమలాప్తవైభవంబడుగుదోయిఁ।వాల్చునాకొమ్మనుతికిఁబాత్రమ్ముగాదె॥

చ॥ వళులుపసిండిమెట్టులిరువంకలవెన్నననంటితోఁచువే
నలికడయంచులారుజతనంబునఁదీఁడిబిగించికట్టుతం
త్రులుజఘనస్తనద్వయముతోఁరపుఁగాయలుకౌనుజాళువా
యొళువునాతిజవ్వనమహామహిఁగాంచెఁగడున్ బ్రవీణతన్॥ ౧౮౦.

సీ॥ వెడవింటిదొరదాడివెడలనుత్సాహించుజిలుకపైకములువిందులకుఁదిరుగు
రతికాంతయెక్కుమర్పుఁగఁగేలవిలుబూనుదుమ్మెదగములుబంతులకుసాగు
ఫణిగణంబులుపటాపంచలైపరువెత్తనెమ్మిబోదలుపేరణమ్ముదొరక్కు
ననిలంబుగ్రొత్తలాయపుఁగల్మిముదమందుజలజారిభోగేచ్ఛఁగలయఁదివురు
నంచలాసించుఁదామరలడరుగాంచుఁ। జెలిపలుకఁజూడఁదలయెత్తజిలికిమెఱుఁగు
బటువుమొనగోటిజిగిబిగిబయలువరుప। ముకురసఖమైనమఖమభేముఖముసేయ॥

పంచచామరము॥ రతీశబాణసంపదన్నిరాకరించుమేనహా
రతీశుకామినీమనశ్శరవ్యవింటియల్లికా
రతీర్పరుల్ కురుల్ మనోజసైంధవాళికిన్
రతీబొసంగుమోవియప్పురంధ్రినెన్నశక్యమే॥ ౧౮౨.

చ॥ అడుగడుగ్గంటఁద్రొక్కుచిగురాకులబాకులఁగేరునారునె
న్నడకడకొత్తుహంసమిథునమ్ములఁ దమ్ముల నోము మోము కీల్
జడవిడనాడుమారుగుణజాలముజాలముఁబూనుకొనుచో
ప్పుడఁబడఁతిన్నతింపఫణిభర్తలుకర్తలుగారుధారుణిన్ ॥ ౧౮౩.

క॥ వలమురిజిగినగుమెడకలు । వలమురిపెమ్ముఁజూపుచూపువనజాతమునా
వలమురియిుంచుమొగముశై । వలమురివిహసించువేణివనితకుఁదనరున్ ॥

గీ॥ విన్న చెన్న దన్నుఁ గన్నియ లేఁగౌను। సోము గోము నోము భామ మోము
నక్క టెక్కుఁ జెక్కు నాతుకచెక్కులు।మించు సంచు మించు మెలఁత మేను॥

క॥ అనియనిశమూఁదలఁచుచుఁబా।యని యనితర వేద్యమైన యలఁతంజేకా
యని యనిగల యల వలరా।యని యనివారిత శరాళినదరుచునుండెన్॥

## చిత్రసేనపుత్త్రీవిరహవర్ణనము.

సీ॥ అంతసక్కడకేళికారామమునకేగివచ్చినదారిగావాడఁబారి
సీమంతినీకామినీమణిమజ్జనభోజనాదికకృత్యములునిరావ
రమునసల్పుచునవత్రపకల్మినిజవాంఛితంబెరికించుకంతయునుదేట

పడకుండడదినములుగడపిగడపిగుట్టుగుట్టలపాలుగాబిట్టుగల్గఁప
మధునిసాహాయ్యమునవచ్చుమరునిదాడిఁ । చాల్మినిలుపోపఁగాలేకతలిరుటాకుఁ
బ్రానుపునటొయ్యనాయ్యనప్పఁబవ్వళించి।సురుచిరాంగంబులెంతయుఁబరితపింప॥ ౧౪౩.

సీ॥ వనకేళిపై నేలపెనుబాళిజనియించె జననియందులకేలసమ్మతించె
విరితోఁటనపుడేలవిరులసంపదమించె నతఁడేలయానేలకరుగుదెంచెఁ
జెలియేలతనకేలఁజివురుదీవియవంచె వానిసోయగమేలగానుపించె
నదియేలధృతిస్రీలమదిజాలిపుట్టించె మరుఁడేలదాలిమిమట్టగించె
నేమిసేయుదానవెవ్వరికెఱుఁగించు । దానదీనికేనుపూనుదాన
ననుపడంతిఁగాననక్కటక్కటదీన । నేమిపుట్టునొక్కొయెట్టులొక్కొ॥

సీ॥ ఆమన్మథాకారుఁడచటికెక్కడికేగు చిత్తంబుకలిమివిచ్చేసెనొక్కొ
యచటనుండునొలేకయొచటికేనరుగునో యవ్వార్తఁదెలియువారెవ్వరొక్కొ
యతఁడుండెఁబోభావమరసినన్నెఱుఁగించుమవ్వంపునెచ్చెలులెవ్వరొక్కొ
యొటిఁగింపఁగలవారలెవ్వరేఁగలిగినఁదగదన్నుఁజేపట్టఁదలఁపఁడొక్కొ
తెలిసితలిదండ్రులేమనితలఁతురొక్కొ । విన్నబందుగులేమనివింతురొక్కొ
మోహమెంతయునెమ్మదిమోసులెత్తె।నహహావలవంతబలవంతమయ్యెననుచు॥

మ॥ తలయూఁచున్వగఁజేర్చునూర్చునలవంతన్ బొక్కుస్రుక్కున్నగున్
బలవించుంబులకించుమైఁజెమర్పగ్రమ్మన్ దాలుఁదేరున్విని
శ్చలతన్ గాంచుఁజలించుగద్గదికమించన్పల్కు నుల్కు స్సమా
కులభావంబునఁగంధుఁగుందువెతఁబొక్కున్ గ్రుక్కుబాష్పంబులన్ ॥౧౪౦

సీ॥ భుజగలోకాధీశభోగితల్పశయాన హరిరూపధరమహాపురుషయనుచు
నతులార్ధమకుటవర్ణితపాదరాజీవ రామార్చనీయశ్రీరంగయనుచు
మారీచమదభంగమహితవాయవ్యాస్త్ర శరదనిద్రితనేత్రశౌరియనుచు
సముదగ్రవర్ధానసరయోగనిద్రాళ కరిరాజవరదశ్రీకాంతయనుచుఁ
దలఁకునులుకునునలుకుపెగ్గిలుచుఁబలుకు । సఖులనయనస్వరశిరోజచరణకలన
పవనకందర్పఘనహంసజవనతురగ । భటనటప్రియసముదాయపటిమదోఁప॥

సీ॥ చతుఃపయోవృష్టిజలచంద్రయోగంబు పాండిమచంద్రికాపౌర్ణమాసి
వివిధప్రియాలాపవిద్యాప్రదోషంబు కఠినగుప్తాశయగ్రంథటీక
వితతచింతాలతావేల్లనోపఘ్నంబు సతతతాపేంధనసామిధేని
బహుచిత్రవిభ్రమపథికపాథేయంబు మహితలజ్జాంభోధిమందరాద్రి
యగుచువిరహాంబుపులకాంకురాళిపుల । విపులనిశ్వాసవాతూలకపిలచపల

చపలతరజీవనాకృష్టిజరగుకపిల। కపి లభించినకలయయ్యెఁగంజముఖికి॥ ౧౫౨.

క॥ అకటకట తెలియదెటుద । ర్పకజిద్భ్రుకుటీప్రకటితఫాలాగ్నికిమా
తృకయోపుత్రికయోయా। శుకవాణివియోగతాపశుచిదర్కింపన్॥ ౧౫౩.

మ॥ కులుకుంగుబ్బలఁగ్రొన్నిహారమణిపజ్క్తుల్ వక్కలైనిల్చెవిం
తలుగాఁగ్రొన్నిజనించులేఁజెమటసున్నంబయ్యెమేల్దప్పియా
కులలీలంగనుపట్టెఁగ్రొన్నిప్రియునింగూర్పన్మరుండెంతయున్
గెలివిందానికిఁబెండ్లిపీడియముసాగింపన్మదిన్ జూచెనో॥ ౧౫౪.

శా॥ మున్నల్లచ్చటమాకుఁజూపునృపరాణ్ముఖ్యానర్థన్యునిన్ ధన్యన
స్మన్నాథున్ గృపఁజూపిబ్రోవుమనుచున్ బ్రార్థింపఁగాఁజేరునో
జన్నిల్చెన్ దమయన్నషట్టెడలి పంచప్రాణముల్ బాళిమై
యన్నాళీకదళాయతేక్షణకు నేత్రాంభోజయుగ్మంబునన్॥ ౧౫౫.

క॥ ఈలీలవియోగానల । కీలామాలాతితాపకీలితహృదయాం
దోళనహతఖేలనయగు । బాలికనాకసకియగదిసిబ్బరవసమలరన్॥ ౧౫౬.

సీ॥ తెలిగన్నుతెప్పముత్యపుఁజిప్పతుదలంటి మొలిచినజిగికెంపుమొలకఁజూచి
స్తనకుంభయుగములో మొనసినరోమాంచనమువిభిన్నీలాంకురములఁజూచి
గళశంఖమునసంభవిలుక్రొంజెమటబొట్టుమగటాల్తిలేమొక్కతెగలఁజూచి
నునుగప్పుకొప్పుమబ్బునమోసులెత్తినమిసిమివెంద్రుకపసవఁజూచి
న్యస్తతర్జనికావాసనాసయగుచు। నబ్బురంబందితలయూఁచియారయనుచుఁ
దతవిసాదదురాపసంతాపతప్తమానసాంభోజయగుచుసంభ్రమముమెఱయ॥.

సీ॥ క్రేఁగంటమరుపిరంగీదారిసీరులాగునజాలుకన్నీరుగోటమీటి
తలకెక్కుమోహంపుమొలకగుంపులుబోలెనెరసినకప్పుపెన్నెరులుదువ్వి
వలిగుబ్బకనజక్కవలుబెట్టుఁగ్రుడ్లనాఁజెదరినహారముల్చిక్కుదీర్చి
యనురాగలహరిఁబొంగినలీలవిలసిల్లుచెంగావిపయ్యెదకొంగుజేర్చి
పట్టియెలమావిలతఁజిగుర్పంగఁజేయు। నట్టులాడినమణిభూషలలవరించి
మచ్చికదలిర్పఁగౌఁగిటఁగ్రుచ్చియెత్తి। కలికిపల్కులముద్దులుగులుకఁబలికె॥ ౧౫౭.

సీ॥ చివురుగుంపులపెంపుజవురుకెంపులసొంపునిద్దంపుఁగేళ్రఁగంటనిగుడనేలె
విరులనన్నగుబన్నసరులజెన్నగుమిన్నవలుదగుబ్బలఁగ్రాఁగితొలఁగనేలె
నెరులవ్రైపులుబూపునెరులరూపులకోపుజిగికప్పుఁగొప్పునజెదరనేలె
తుళుకుమించులయంచుగులుకుమించులసంచుబెడఁగునెమ్మెనల్లబడఁగనేలె
తెలుపఁగారాదొమాకదితెలియరాదొ। చెప్పిపనిగొనరాదొమాచేతగాదొ

తలఁపునకురాదొ తలఁచుటతగవుగాదొ । యమ్మలికయేలరమ్మూయమ్మయనుచు॥
వ॥ మదనవేదనాదోధూయమానసయగుమానినీమణిం గనుంగొని॥ ౧౬౦.
సీ॥ పతియింతిహృదయాబ్ధిఁబడిగ్రుంకెనయనాశ్రుకణబుద్బుదంబులుగలిఁగెఁగానఁ
దన్వంగియాశాలతలుపూఁచెఘర్మాంబుపూరమరందంబుజాఱెఁగాన
నళినాక్షియనురాగనదిపొంగెఁబాఁడిమంబనుపేరఫేనంబుమొనసెఁగాన
మగువకుమదనాగ్నిమదిఁబుట్టెనిశ్వాసధూమరేఖాస్ఫూర్తిదోఁచెఁగాన
రమణులారయిందుకువిచారంబుఁజేసి । లేమఁగాపాడఁగాఁదగు లేకయున్న
మనలకందఱకపకీర్తిమరుఁడుదెచ్చు । దీనికనుమానమున్నదే తెలిసిచూడ॥ ౧౬౧.
సీ॥ తాపాగ్నిఁజూడసాధారణంబనఁగరాదేరినిచేరరానిదగాన
నటులైనమిక్కిలియధికంబనఁగరాదుకంతుఁడుమదినావ్రేఁగనఁడుగాన
నగ్నిసంస్తంభనంబతఁడొందెననరాదుహరలోచనాగ్నిలోనణఁగెఁగాన
వాఁడిందుఁజొచ్చినవాఁడుఁగాఁడనరాదుగలఁకసీధైర్యాబ్ధిఁగలఁచెఁగాన
నక్కటాయిప్పుడోఁచినదొక్కమాట । యంగహీనుండుగానవాఁడంతకోర్చెఁ
గుసుమకోమలియిదియోర్చుకొనుటయెట్లు । పిన్నపనిగాదుపైచింతనెన్నవలయు॥
సీ॥ పఱచరేపుప్పొడిపాన్పునెచ్చెలులార యలఁదరేశ్రీగంధమతివలార
చల్లరేపన్నీరుపల్లవాధరులార ముడువరేక్రొవ్విరుల్ ముదితలార
వీవరేనెత్తమ్మివీవనల్ సఖులార కప్పరేచివురులుకాంతలార
ప్రాయరేక్రొమ్మావిపూఁదేనెసతులార గుప్పరేకపురంబుఁగొమ్మలార
మిసిమిగలతావినెఱతావిపసపుటాకు । పసిమియెగఁబ్రాఁకుజిగిరేకుబవరిటాకు
పఱపుతెలివట్టివేరుచప్పరములెత్తి । సేదదేర్పరెకోమలారచెలువకనుచు॥ ౧౬౩.
క॥ ఏఁప్రసఁబల్లవచాపా । రోపణచణకుసుమరోపరూఢదురాపా
వ్యాపితపరితాపవిని । ర్వాపణమతినిపుణులగుచుఁబ్రౌఢలిర్వుర్॥ ౧౬౪.
సీ॥ చెలిపాదములఁబట్టిచిగురులుగుమిలించి ఘనభీతిఁగనెఁబికకంఠియొకతె
కోమమేనికొప్పించిసుమములనుడికించి చెందెవిభ్రమమళిచికురయొకతె
వెలఁదిబాహులఁజేర్చిబిసములనాగిలించి కాంచెవంతమరాళగమనయొకతె
కొమ్మకన్నులనుంచితమ్ములగ్రుక్కించి సుడివడెఁజక్రవక్షోజయొకతె
యహహయాహారమనుటతామరయకెట్లు । చెలిమిగనుపట్టబలుకూర్మివలుదగబ్బి
కులుకుఁబాలిండ్లనెయ్యంపుఁదలిరుబోండ్లు । చేరిశైత్యోపచారముల్సేయునపుడు॥
క॥ అప్పుడుడాశిశిరవిధిన్ । నిప్పులఁబొరలించినట్లునెమ్మదిఁబొగులన్
ముప్పిరిఁగొనువేసటనా । కప్పురగంధులనుగనుకఁగనుఁగొనిపలికెన్॥

సీ॥ పన్నీరనుచు నన్ను భ్రమియించి యక్కటా సలసలఁగాఁగు క్రొంజమురుఁజ
కపురంపుఁబలుకంచుఁ గనుమూసి కటకటా బూది గప్పిన నిప్పుఁబాఁదుకొల్పి
గొనబు కెంజిగురాకులని మాటిచెల్లరే తళుకుఁగ్రొవ్వాఁడికత్తులు ఘటించి
పూరజంబని చాల బొంకించి యమ్మరో కుమిలి నిగ్గులు దేరు కుమ్ముఁ గ్రమ్మి
వెతలఁ బెట్టంగఁ బనియేమి వెలఁదులార । ప్రాణసఖులంచు మిము నమ్మి యనుదినంబు
నెనసి తిరుగుట నాకుఁ దోడ నెఫలించెఁ। జాడ లేకున్న ననుఁ దెగఁ జూడరమ్మ॥ ౧౬౮

మ॥ అనయంబున్ననవింటి బోయ దారవేఁటాడన్ యథాస్థానమం
దినిలంగా వెఱఁబూని కంఠబిలమార్తిం జొచ్చు ప్రాణంబులన్
నిను పారంగ పురంపు లేఁ బారసురంటీ గాడ్పు దీమంపు వెం
టను నైకోగమకింపఁ బ్రాణసఖులౌటన్ దెల్లముయ్యోంజుమీ ॥ ౧౬౯

సీ॥ తల్లిబిడ్డలమాడ్కి నల్లిబిల్లిగనుండి గుణిగుణంబుల వాడ్కిఁ గూడి మాడి
తనుజీవముల పోల్కి నెనరు నవర్తించి యలరుఁదావుల ఘాతిఁ గలసిమెలసి
పాలునీళ్ళను బోలె నాలీనమై నిల్చి పదపదార్థముల నాఁ బాయకుండి
చంద్రచంద్రికలట్లు జతవీడక మెలంగి కులశీలముల యోజఁ జెలిమిఁ జేసి
జంటవదలక తిరుగు మీవంటి చెలుల । వెంటఁ దిరిగిన భాగ్యంబు గుంటువడియె
గెంటు పడఁజూడుఁడింకఁ దొల్లింటి నెయ్య। మింటికే గుడు మీరు వాల్గంటులార ॥

మ॥ అనుడుం బ్రాణసఖుల్ భయాకులితచిత్తాంభోజలై గ్రుక్కుమి
క్కనుచున్ శైత్యోపచారగుణజన్యంబై విజృంభించు గెం
టని కోపంబునఁ దమ్ములంజలుకు మట్టం జూచు నాకన్యనే
ర్పునఁ జేరం జని పల్కిరిట్లు భయ సంప్రీతియున్ దోఁపఁగన్ ॥ ౧౭౦.

సీ॥ ఘనసారమని సనోవనజాతవాసన వడియ సారంబని నుడువకమ్మ
కైరవంబని సనో కలితబింబాధర పలుమాఱు వాదించి పలుకకమ్మ
కోరకంబని సనో చారుమీనేక్షణ యరిగాఁగ నదిజూచి యాడకమ్మ
రసజాతమని సనో బిసలసద్భుజ కాండ కినిసి సాధారణంబనకుమమ్మ
కొమ్మ యటులైన ఘనకైరకోకసార । సముల గను పట్టి నీ పేరు సైఁచునోటు
విరహపరితాపహరము లౌ వీని నకట । యేలపగ జేసికొనియెదే చేలపగుచు ॥

వ॥ అనుచు శైత్యోపచారంబుఁ జేయు నెడ ॥ ౧౭౧.

సీ॥ జలితంపు గబ్బిగుబ్బల జాఱు ఘర్మంబు వలపుఁ బన్నీటి చే జలకమార్చి
ఘనమైన విరహంపుఁ గాఁకఁ జెందిన పాండిమంబన శ్రీచందనంబలంది
నిదురకంటికి లేమిఁ బాదలు కెంజాపుఁ జెంగలువ చేసుమాంజలి యొసంగి

నిబిడమైగనుపట్టునిట్టూర్పుఁబొగచేతనెమ్మిధూపసమర్పణమ్ముజేసి
భక్తిఁబూజింపమదినున్నపంచశరుఁడు। వెలఁదిఁగృపఁజూచివిరహాగ్నివెడలఁద్రోఁచె
ననఁగమైకప్పురముదాపఁగునవెలింగె। ననుచుఁజెలులెల్లఁగడువిన్ననగుచుఁదొలఁగ॥

శా॥ ఆరామామణికంఠభాగమునసాహోమించుముక్తామణీ
హారంబుల్దొలుదొల్తనీలపుసరాలై యొప్పెనాపిమ్మటన్
హేరాళంపుమెఱుంగుఁగెంపుసరులై యింపారె నత్తోదుతన్
హీరాంచత్సరులైతనర్చెవిరహాగ్నిప్రాభవోదగ్రతన్ ॥ ౧౭౪.

క॥ కడువడిరావంగడపుం। బడఁతుకబాహాప్రతాపభరముంగనికీ
ల్వడిమిక్కిలిలోఁదుకతుక। నుడికినగతిఁదమ్మితూఁడులుడుకన్గాడఁగెన్ ॥

మ॥ మకరాంకానలతప్యమానకుచకుంభద్వంద్వమధ్యస్థల
ప్రకటస్వేదజలప్లుతాంబుజదళవ్రాతంబులొప్పారెద
ర్పకశస్త్రంబులగాఁడిపారునవలాఘావంపుబల్గాయమా
దుకగాఁపంగఁజెలుల్ఘటించుకలిపోత్తుల్వోలెనప్పట్టునన్॥ ౧౭౬.

క॥ రమణీకుచయుగగళిత। శ్రమవారిభరానతాంతరంబైతన్మ
ధ్యమునందగుకోకనదం। బుమహోగ్ర కోకనదముపోలికఁదనరెన్ ॥

ఉ॥ అట్టియెడన్లతాంగినయనాంబుకణంబులుగాలిగుబ్బచ
న్నిట్టలఁజిట్లితత్సఖులుమిట్టిపడస్వెడిఁదాఁకెఁడెంవఫుం
బట్టునసెట్టుకొన్నసుమబాణుఁడువేఁయుతుపాకిగుండ్లునా
రట్టొనరించునూరుపులురంజకపుంబొగచందమందఁగన్॥ ౧౭౮.

క॥ ఈరీతిన్గెందలిరుల। కోరీసురతాణిగాఁకఁగూర్చఁజకోరీ
నారీకీరీమత్తమ। యూరీరవములకునులికి యుగ్మలిమదిలోన్॥ ౧౭౯.

చ॥ తొలఁగెఁగడంక ప్రీలెధృతి దూఁలెవివేక మడంగెబుద్ధి చె
గ్గిలెనభిమాన మేగెఁద్రప గెంటెనయంబు భయంబుగుంటె గా
సిలెబిగి తారెమేర కులశీలముగ్రుంగె ముడింగెగౌరవం
బలఁకువతగ్గెదైవమకటాయెటువచ్చునొ యేమివచ్చునో॥ ౧౮౦.

క॥ జనియించుమొదలుబాయని। తనుజీములక్కటావితావితప్రియవ
స్తునిరూఢలాభలోభం। బునఁదొరకుడుపడివిభక్తములుగాఁదలఁచున్॥

సీ॥ కసుగందకుండనాక్కటమోవివిరియాని యేఁదేఁటికొదమనొ యెన్నఁడొక్కొ
యవలనూరుపుఁబుచ్చకధరామృతముగ్రోలి యేఁబావురమునొ యెన్నఁడొక్కొ
పంటవాతెఱదొండపండుగట్టిగనొక్కి యేఁజిల్కబోదనొ యెన్నఁడొక్కొ

# చతుర్థాశ్వాసము.

తొగరు లేఁ బెదవి కెంజిగురు నజ్జుగఁ జేసి యేను గోయిల నాట యెన్నఁడొకొ
ఘనరసతరంగసంగరంగన్మదీయ । మానసాన్మాన కేళికా మానసీయ
యానమున నమించు నారాజహంసు నెనసి । యేను రా[illegible]యించలేమనా యెన్నఁడొక్కొ ।

చ॥ అలజలజారివైరియగడాడెడు చిల్కయనన్ బజాటిబ
ల్తులువ చకోరి వారిజము తూరిన నామదిలోలకోరి వాఁ
కలబకదారి మాలికలకంఠ మెఱుంగ దొకింత దారికే
వలము తుటారి శారియని చాడికడున్ వలరాకటారికిన్ ॥ ౧౬౩.

గీ॥ మానసప్రియ లీలఁ బూనలేని । చెలువ జీవనమది యొకజీవనంబె
వేఱె యొక జన్మమున నైన విభునిఁ గూర్పు । నతనునకు మేనొసంగుదు ననుచుఁ దివ్వర ॥

క॥ ఆవేళ ననుఁగుఁ బోటులు । భావజసుమబాణవహ్ని పాలగు నవలా
భావంబు లెగువ నెవ్వగ । భావించి మనోంబుజముల భయము దలిర్పన్ ॥ ౧౬౪.

సీ॥ చలువగాఁ గపురంపుఁ బలుకులు మైఁ జేర్ప విరహాగ్ని దానవిస్ఫురితమయ్యె
విరహాగ్ని నార్పఁ బై వెదజల్లఁ బన్నీరు నిట్టూర్పు పొగ దాన నివ్వటిల్లె
నిట్టూర్పుఁ బోగమాన్ప నెత్తమ్మిలను వీవ నేత్రోదకము దాన నెఱయఁ దొడఁగె
నేత్రోదకము డంప నెఱపఁ జందనధూళి గాద్గద్యమలదానఁ గ్రందుకొనియె
నారయ నారీతి శైత్యోపచారమహిమ । వెక్కసంబైన కాఁకలు బిక్కటిల్లె
నంబుజాక్షికి నిది విషమంబుగాదె । తెలిసి చూడుఁడు చెలులెల్ల దీనిగుణము ॥

సీ॥ తనకుఁ గందొనరించు తలిరుటాకుల పాన్పుఁ బైకొని కమలించెఁ బడఁతి మేను
తనకు నాకుల గూర్చు తళుకుఁ జామరతూఁడు టారుగు బిట్టుడికించె నువిద కేలు
తను బిట్టు నొగిలించు గొనబుఁ గప్రపుఁ బల్కు తలగడ వెలిఁగించె నెలఁత చెక్కు
తను నొత్తుకొనిన నెత్తమ్మి పూబటువు బిల్లలవేచి పొడిజేసె లలన యడుగు
తౌరయదిరా చకన్నియ యగుటకతన । నేత దంగంబులిప్డొక యింతయేని
యొరయుటకు నోర్చుకున్న వేయు విదలార । కంటి రేయని యమ్మచ్చ కంటిఁ గదిసి ॥

సీ॥ చాంపేయసుమగుచ్ఛసముదాయసముదితసౌరభ్యపతితపుష్పంధయంబు
పతితపుష్పంధయప్రభవమేఘవ్రాతమతిపలాయితహంసమండలంబు
హంసమండలపలాయనపునఃప్రావృడాగతిశంకినిష్కుహూకృతిపికంబు
నిష్కుహూకృతిపికాన్వితతామసభ్రమవ్యాకులీకృతలీనకోకకులము
నగుచుఁ బెనుపొందు తావకోద్యానమహిమఁ । జరుణి కనుఁగొనరమ్మింత దలఁక నేల
భృంగములకును మత్తచక్రాంగములకుఁ । బికములకును రథాంగడింభకములకును ॥

వ॥ అని బుజ్జగింపుచు రతిస్ఫృతహృదయసదనమదనోపచారనీరాజనదీపాంకురా

యమానదృక్కోణారుణాశ్రుకణంబులు తాపాగ్నివిస్ఫులింగముల యంగ
నఖాగ్రమ్ముఁగొని. చనుఁగొండలదండ మెండుకొను విచిత్రపత్రలతావితానం
బుల రూపుమాపంగఁ గొనలమసిదగిలి నిలిచిన తదీయంబులగు మోటువసుల
పసలఁ దెలుపు పులకాంకురంబులం గెడసి జడిసి మడిసినవడువున నాడలుప
అచి వెడలనెఱుంగక పడి బడలుతనూదాహకరణహిమకిరణ నియోగస
మాగతనిస్తంద్రసాంద్ర చంద్రచంద్రికచందనంబున నందంబగు పాండిమం
బునకు భీతిల్లి సంచలించు కమ్మతావిసెత్తమ్మితీవియకైవడి గడగడనవడం
కునెమ్మెనుబడివాసిపుడమికిడిగ్గినిలిచి బయలఁబ్రాఁకుశంపాలతసొంపు సం
పాదింపఁగడలుకొనుమమత నెదిగి పొదువుజలదమాలికాకృతికిం బ్రకృతియై
యొప్పి విప్పనీలంపులప్పలఁ దెప్పి తప్పులువట్టుగొప్ప నెఱికప్పుఁగొప్పు చెదరి
గుప్పనం గప్పుకొన వెఱచఱచి పఱచువెరవెఱుంగక తఱుచుగానఱచురా
యంచయన్నులకన్నులంబాటమరిలితొటతొటనదొఱంగుకన్నీటి చిటిపొట
లనీటునటియించు చటులనిశ్వాససుఘటిత వక్షస్తటప్రకంపజనిత ఘ
ర్షణసముద్ధితఘుర్ఘురస్వరస్ఫురన్నవమౌక్తికశ్రసరమాలికా భంగభంగుర
శ్రమజలతరంగిణీనినదంబు కంఠబిలంబునం బ్రతిధ్వనితంబగు విధంబునంబొ
దవునిజహృద్గదిక యగు గద్గదిక చెఱమువిలుకఱకు వలపులదొరకు గెలు
పుఁగొలుపుకొఱకుఁ గాసహాయుండై యంకంబునకు శంకింపకవచ్చి శశాం
కుండొనరించునవేళ క్ష్వేళారవమ్ము ననుసరింప వెఱచు నెత్తమ్మితేకులము
దుంగుటఁగదిరెనోయనంగ నుపట్టుకను మోడ్పు ననంతర్ముఖంబులగు వీక్షణ
మ్ముల హృదయాంతరసనాథుండగు ప్రాణనాథునవలోకించి కించిదా
శ్లేషంబునం బరవశయయ్యెనో యనఁగదలమెదలనెఱుంగక నిలుచుటం జేసి
డాసివెడవింటిదంటు వింటు నవనీతకల్పంబగు సంకల్పంబువలవడిసెనోయన
విజ్ఞానహీనయై మూర్ఛిల్లి తోడననాక్కింత దెలసి యనంగకేలికీలాపరితాపి
తాంగియగు నమ్మోహనాంగింగనుంగొని కరాంగుళీదళంబులు వట్టిలేవనె
త్తిపయ్యెదఁ జక్కనొత్తి చెక్కులఁదొఱంగుక్రొంజెమట తువ్వరలఁ దుడి
చికురులుముడిచి యిత్తెఱంగున మెఱుంగుఁబోండ్లు మెల్లమెల్లనఁ దమంగ
లసిమెలంగునట్లుగావించిన ॥ ౧౮౯

కపురంపుటరిగెనొక్క విలాసినివహింపఁజిగురాకుగొడుగొకమగువబూన
నగరుఁగుంచియనొక్క పికవాణిధరియింపనలరుఁబావడయొక్క చెలువపైవఁ
దమ్మిగొప్పివ్వరిగెండిఁగొమ్మయొక్క తెదాల్పఁగలువకాళాంజియొక్కరితదేర

# చతుర్థాశ్వాసము.

మొగలిఱేకడప మొక్కగురు స్తనిభరింపఁగురువేరుసురఁటిఁనాకర్రుబూనఁ
జేరినడ తెంచుముద్దురాచిలుకలనఁగఁ। గలికిచిలుకలకొలుకులు గెలననడువ
రతివిధంబునఁగడునాయారమునఁబొదలి। వనవిహారంబునకువచ్చె వనజవదన ॥

## వనవిహార వర్ణనాదికము.

సీ॥ వలరాచమత్తమావులపండ్లుగననిమావులసండ్ల నేకము లులుపబ్బ్రి
గుములు గాఁబొలుచుపూగములఁజెన్నొందుపూగములఁగొన్నింటిఁ జైకొన్నజేసి
చిగురాకుఁదిండ్లపల్లవమంటు కెసఁగుపల్లవమంటుపమునని ల్వంగనునిచి
సరిలేకనలరుకేసరములమించుకేసరముల సరములసరము జేసి
యాకొమిరెప్రాయపుమిటారిరాకొమారి। యడుగులనువ్రాలి లేచి తోడాదరంబుఁ
గాంచి మొగపుఁగేలునవిన్నవించిరపుడు । వరుసవనపాలికలువనీవైభవములు ॥

సీ॥ ఇదికోయిలలుమెక్కునిగురుసంపఁలఁజకోరులువెన్నెలలలేటఁగ్రోలుచక్క.
యిదియంచలుజరించుకొదమతుమ్మెదతెక్కకరువలిఁదొఱఁగుగప్పురపుదిబ్బ
యిదిచిల్కపోటులనిడియుదాడిమఫలమ్ములజాఱురసముజాల్వారలుహాఁక
యిదిగాడ్పుబాబాలనెక్కిక్రొవ్విరితావియబిసీల్దువాళించునట్టిబయలు
పావలునిదిగుజ్జుగొజ్జంగిపూవునీటి । యేటికాలువఁబడినాఁటునాటుకొన్న
బొండుమల్లియవిరితోఁటఁబువ్వుఁబోఁడి। నిండుమదిఁజూడుకన్నులపండువుగను ॥

సీ॥ ఈసంకుమదగంధియీదాడిమవనంబుఁగాపాడుఁజిలుకలుగ్రమ్మకుండ
నీచంచలాలోకయీమావిలేఁదోఁపుజొట్టుగ్రుమ్మరుఁబికుల్మెట్టకుండ
నీచంపకామోదయీక్రొవ్విరులతోఁటఁబ్రోచుదుమ్మెదపిండుబాలయకుండ
నీఘనాఘనవేణియీతామరకొలంకుఁబాలించునంచలువ్రాలకుండ
ఫలసమత్కారములుగంటిపరచుననుచు। లేఁజిగురుజొంపములునాగిలించుననుచుఁ
దావిక్రొవ్విరివాసనల్దఱపుననుచు। నిడుదనెత్తమ్మితూఁడులుగెడపుననుచు॥

వ॥ అనియిట్లు వనపాలికాజనమ్ములు విన్నవింపుచు వచ్చు సమయంబున॥. ౧౯౪.

మ॥ చలితాంఘ్రిద్వయనూపురధ్వనులుకాసారస్ఫురత్కేళికా
కలనాలోలమరాళజాలములనాకర్షింపఁగర్ణావతం
సలతాంతాసవవాసనల్ గురులుమించన్ జాల హేలాగతిన్
జలజాక్షుల్ విహరింపఁగాఁదొడఁగిరుత్సాహంబు రెట్టింపఁగన్॥ ౧౯౫.

సీ॥ ఖంజనేక్షణలార గదసియీసంపంగివిరితావిబలుపొదలరయరమ్మ
శుకవాణులార యీనికటదాడిమవనీస్థలినాకించుకసేపుమెలఁగరమ్మ
కంఠులారయీకన్నెమామిడిగున్ననీడలఁదరలకనిలువరమ్మ

యలివేణులారయీయలరుఁబుప్పొడిదిన్నె గమ లెక్కి తగుచోట్లు గాంచరమ్మ
యలఁత దిరుగంగ నేటికిఁ బలదటన్న । నెగరిపడ నేల నెమ్మొగమెట్టి నేయ
నేలకన్నులఁ గెంపుగ్గ నేలమఱియు । మొరయ నేలవితావితమగువలార ॥ ౧౯౬.

సీ॥ లతకూనలారయీలావుపుప్పొడి విన్నె నీకొమ్మ పాఱిపున నెక్కరమ్మ
ముద్దియలారయీపెద్దతోఁటకలంకులీ పద్మినులనంటియీఁదరమ్మ
గురువేణులారయీమరువంపుమళ్ళకు నియ్యాళి వెంబడి నేగరమ్మ
భోగినులారయీపాదలు గేదఁగిగుంపులీసువాసనబడియొదుగరమ్మ
యొంటిమై నేగుచలములనుడుగరమ్మ । మెళవపిడరమ్మ కవగూడి మెలఁగరమ్మ
తగినజతగూడి తలఁపులుదలఁచరమ్మ । యేను దెలిపినచందమేమెన్నరమ్మ ॥

వ॥ అనుచుండ మలో సరసవచనరచనాచమత్కారంబులం బ్రౌఢ్ఘ గడపుచు ॥

సీ॥ కలవులేవనఁజాలు గౌఁదీవలు చలింప వల్లీమతల్లికల్ వంచి వంచి
సమపీనకుచగుళుచ్ఛములు కంపముఁ జెందఁ గ్రొవ్విరిగుత్తులు గోసి కోసి
లలితాంఘ్రిపల్లవాంఘ్రులు దొట్రుపాటొందఁ జిగురుటాకులబారుఁ జిదిమి చిదివి
భుజమూలరుచి హేమరజముబయల్ ప్రాఁకవలపుఁబుప్పొడులెల్ల దులిచి దులిచి
బాహునాళాధరోష్ఠబింబకరకిసల । వదనజలజంబులకు మూఁగువరమరాళ
శుకపికశిలీముఖాళికి జుణిఁగి జుణిఁగి । సఖులు పుష్పాపచయకేళి సలుపునపుడు ॥ ౧౯౯.

సీ॥ పతిత సంస్పర్శనంబతిపాపమనుచునో యెలనాగరాలు బం డ్లేరవయ్యెఁ
జండాలులున్నెడనుండ రాదనుచునో యువిదపూఁబోదరింటనుండదయ్యె
మొగి రజస్వలలఁ దాముట్ట రాదనుచునో చెలిపుష్పజాతులు జిదుమవయ్యె
నలమధుప్రియభోగ్యమౌటఁ గాదంచునో తరళాక్షి తలిరులు దడవదయ్యె
ననుచు వనకేళి పైబాళి మొనపసని । యరతిచేనున్న సతిభావమాంతరమునఁ
దెలిసియును వేఱొకరీతిఁ దేలఁబలికె । చెలికి వనకేళి పైబాళిఁ గొలుపఁదలఁచి ॥

సీ॥ సితపక్షములు చాయశిఖులు గేఁకలు వేయను నుగప్పఁ గొప్పమాపున నుగునియఁ
గదుఁదుమ్మెదలు స్రుక్కఖంజనమ్ములు నిక్కజగి మేని నెత్తావి గుబులుకొనఁగ
బకములులోఁగఁ జాతకసంఘములు మూఁగఁదను కాంతి ధళధళుక్కనుచు మెరయ
నశోకములు వారనెలపుల్గు గమిగోర మొగమునఁ జిఱునవ్వు మొలకలెసఁగ
నాకజలదవేణి యొక్క చంపకసుగంధి । యొక మెఱుఁగుఁబోఁడి యొక్క బాహుళనితంబ
చంద్రికాహాసపుష్పాపచయమసేష । వనిఁ జరించిరి ప్రౌఢజవ్వనులఁ గూడి ॥ ౨౦౧.

సీ॥ ఉడిగె విమ్మద్ద హలాకకొందఱు నిలంగఁ బాదివెఁబల్లవకరల్ బొదువఁగొంద
టాదిగెఁ జంపకనాసలాకకొందఱే తేరఁ జెందె లేవిరిబోండ్లు జెందఁ గొంద

ఉడిగెసాంకవగంధులోకకొందఱరు దేరఁజేరెబింబాధరల్ జేరఁగొంద
ఱాదిగెనంబుదవేణులోకకొందఱుజోరంగఁగదిసెఁబద్మాననల్ గదియఁగొంద
ఱప్పుడలకోకిలబలంబులళికులంబు । చిలుకగములున్రాయంచపిలుకగములు
ఘనకుహూకృతిఝుంకృతికలితవచన । హుంకృతికేంకృతుల్దిందనందమొంద॥

చ॥ ప్రమదవచింపఁబొన్న సతిబాడఁబ్రియాళము భామయంటఁజూ
తము సకియానఁగ్రోవి చెలిదన్ననశోకము స్త్రీయెదిర్చహే
మ ముపిదయూర్చసింధుకము మానినినవ్వఁగఁగోఁగు కాంతయా
స్యమదిరకేసరంబు గజయానగనన్ దిలకంబురంజిలెన్॥ ౨౦౩.

క॥ ఘనశైశికములుమూపుల । గునియవతంసములుగదలకోమలకరకాం
చనవేత్రలగుచుఁజెలికిన్ । వనితలుజూపిరివిలాసవనవైభవముల్॥ ౨౦౪.

చ॥ విరహిజనంబులన్మరుఁడుపీఁపులడాగులవేయఁబూని ని
ష్కరుణనిజప్రతాపశిఖిఁగ్రాఁచఁగఁగ్రొఁగుసలాకలోయనన్
ధరపయినెల్లెడన్దరులదట్టములై చిగురాకుజొంపముల్
నిరుపమలీలఁబొల్చెఁదరుణీకనుఁగొంకెమిటారిచూపులన్॥ ౨౦౫.

మ॥ త్రిజగంబుల్ గెలువంగఁగోరిమరుఁడెంతేనిశ్చలాకారుఁడై
నిజశాతాసిముఖంబునన్నిలిచివహ్నిజ్వాలమధ్యంబునన్
నిజమారన్ దపమాచరించుగతిఁగంటే గెంటకీతేఁటిని
ల్చెజగాక్రొవ్విరిక్రొమ్మొనంగిసలయశ్రీజుట్టిరానెచ్చెలీ॥ ౨౦౬.

మ॥ నికటక్షోణికఁబువ్వుపీఁడఁదెరయైనీడల్ సభాసీనులై
శుకరాజంబుప్రసంగులై కిసలయస్తోమంబుదీపంబులై
పికముల్ పాఠకులై యళుల్ ప్రతిమలై పెంపొందఁజైత్రుండుద
ర్పకుఁడీక్షింపఁగబొమ్మలాటఁగనుపింపన్ జూచితే నెచ్చెలీ॥ ౨౦౭.

మ॥ లలనా మావి యలావకంతుని రాజాలమ్మొగ్గపూముల్కని
చ్చలపుందమ్మొదగుబ్బపూరజపుటేజానిల్పిపైకారవం
బులమొల్లాషరియింపుచున్ మధుజలంబులల్ జల్లి వేగాడ్పుభా
నులచేఁజైత్రపుసైదుజీర్ణదళవహ్నుల్ గంటెత్రొక్కింపఁగన్॥ ౨౦౮.

మ॥ పొలఁతీచూచితెతేఁటితెక్కరవగాడ్పుంబోదలేడ్తాకుజో
కలచేఁజాలుమెఱుంగుఁబుప్పొడులరేకల్ మీఱగుత్తంబులై
యలరుంబెజ్జపుమావి జంతికలఁజెన్నారన్ వనీదేవతా
కలకంఠీమణులొత్తుసామ్యెలగతిన్ గన్పింపఁగావింపుచున్॥ ౨౦౯.

గీ॥ విరహిణులనొంచనంభోజశరుఁడుమీరుఁడు। పరభృతంబులనచ్చోటఁబెంచుఁదీర్చి
నల్లప్రజనిల్పువాఁడుగుంటలాయనంగ। నళులయడఁకువగలపూలలలనగంటె॥ ౨౧౦.

మ॥ గణపుంగంకణపుంజగాతొడిమచోక్కాపొత్తెపుందళ్కుఁగ్రొ
మ్మెనపూముల్కియనంటిసోఁగకపురంపుంగాడనిద్దాగడల్
గొనబుంబుప్పొడిమట్టిపూఁతచిగురాకుందట్టిలేఁగాడ్పుసొ
దనజోదుల్‌దగసాముసేయుటకుఁగాంతాకంబెటోకియ్యఁగన్॥ ౨౧౧.

గీ॥ హరుఁడుదునిమినమరుఁడుక్రమ్మఱఁగబొడమ। యున్నవనదేవతకుమ్రొక్కుకొన్నమ్రొ
క్కుఁ। దీర్పమధుఁడెత్తుబలుగండదీపమనఁగఁ । దనరుఁబుష్పితచాంపేయతరువుఁగంటె॥

మ॥ నెలఁతాకన్నులపండువయ్యెఁగనుఁగొంటేయీవనాభ్యంతర
స్థలిఁగన్పట్టుచిరత్నరత్నవిలసచ్చాంపేయకుంజాగ్రని
స్తులపుష్పంధయగంధహృత్కుసుమసందోహంబనంగా లయా
త్యలఘుధ్వాంతనికృంతనక్షమసమగ్రాఖండదీపంబులై॥ ౨౧౩.

క॥ సుమదళయుగళిమధ్య। భ్రమరంబదిచూడుపడఁతిపక్షికస్వాంతా
హమికోపలహలికైసిరి । కొమరుండుఘటించుకట్టుగుండునుబోలెన్॥

మ॥ సొలపుందెమ్మెరసోగలేఁదలిరుమోసుల్ పూరజంబేతయున్
గలయంబర్వఁగఁదావికొవ్విరికడంకన్ వ్రాలుచున్ దేలుచున్
వెలసెన్మాధవకాననేందిరలపెండ్లిందీవపూఁబోఁడులు
త్కళికన్ గొట్టముతేఁటిపాటలెసఁగంగాదంచురీతింజెలీ॥ ౨౧౪.

చ॥ పసగలకాలకంఠకలభాషికలన్నిగమాద్యలందుఁగ్రొ
మ్మిసిమియెఱుంగవేమియనిమెచ్చకవాణిఁదృణీకరించినీ
వెసఁగఁగఁబూర్ణసుస్వరసమృద్ధిగఁబాడఁగనంచువేడ్కనీ
కొసఁగెఁబ్రియాళమో గురుపయోధర పుప్పొడి పచ్చపావడల్॥ ౨౧౫.

ఉ॥ ఓ సుదతీలలామ కనుమియ్యనతావకవక్త్రవాసనా
వాసితమద్యసేచనలవాసనచేమధుపాళికేశముల్
గ్గాసిలగాలిలేఁజిగురుకప్పదొలంగశుకోక్తులం బరీ
హాసముబట్టఁగావదరునాఁబొగడన్ బొగడొందుచూపులన్॥ ౨౧౬.

చ॥ పలుకులఁదేనెలుట్టిపడఁబల్కఁగనేర్తువటన్ననెయ్యపుం
బలుకునిజంబుగాఁదెలిసె భామరో సూడఁగదమ్మ కప్రపున్
బలుకులఁజల్లతావిఁజెఱబట్టిన నీ నునుముద్దుఁబల్కులన్
జిలుకఁగసాగెఁదేనియలుచెంగటిపొన్నప్రసన్నపుష్పమై॥ ౨౧౭.

చ॥ సుదతిరొ చూచితే వెసననశోకపుఁగొమ్మదెనీవుదన్నఁదు
మ్మదరొదనొఁకెలింపుచు నమేయపికధ్వని కట్టుమూల్గుచుః
గుదురుమెఱుంగురంగు నునుక్రొందలిరాకులపేరనాక్కట
న్నిదురఁదొఱంగిజొత్తిలఁగనెత్తురుకండలు గ్రక్కెనక్కటా॥ ౨౧౯.

మ॥ మెలఁతా సేసినమేలెఱింగినదిసుమ్మీయారసాలంబు నీ
వలరింపన్ గరమంటి నీయలఁతఁబాయన్ జేసెఁదోడ్తోడఁగొం
దళుకుందుమ్మెదతెక్కతెమ్మెరలచేతంజాలజవ్వాడు కెం
దలిరుల్ గేలిమెఱుంగుఁదేనియలనిద్దాతావిపూవీవనన్॥ ౨౨౦.

మ॥ తళుకుంబుప్పొడిపన్నెగందవడిపూఁతల్ మై గుబాళింపఁగెం
దలిరుంజందురుకావిదువ్వలువమేనంబూనిలేఁదేఁటి ప
చ్చలతాళిన్ విరిమొగ్గముత్తెసరులెంచన్నించె నిచ్చోటఁగం
కెలతాంగీతిలకంబుజల్సొగసువెట్టన్ నీవుజూడన్ రహిన్॥ ౨౨౧.

గీ॥ ఇదెకనుంగొనుసుదతినీవెదురుకతన । మొనిపెనెల్లెడసంపంగిమొగడగుంపు
లలిచికురవాటనినుగాంచునపుడు వెలికిఁ । గ్రమ్మునాతతరోసాగ్నికణములనఁగ॥

చ॥ వనజదళాయతాక్షినిడువాలికచూపులఁజూడవమ్మ నీ
వనిచినయూర్పుగాడ్పువలనంగను నీప్రసవంబునెంతయున్
వినఁగనఁగానిపల్లవికవృత్తిమెయిన్ గెడగూడి యక్కటా
కనుఁగొననయ్యెవాపిలితగన్ మఱి దీనికి వావి లేదొకో॥ ౨౨౩.

మ॥ చనిలీలన్ జెలినీవుకౌఁగిఁటబిగించన్ గోర్కెసంధిల్లఁగై
కొనియామోదముఁజెందునీకురువకక్షోణీరుహంబాత్మ సం
జనితామోదమొకింతయున్ గనకఘాస్వత్వన్ముఖామోదమా
నినినుందోలునిజాళిపైఁగినుకచేనించెన్మరందాశ్రువుల్॥ ౨౨౪.

గీ॥ కలికినీముద్దులేనవ్వుమొలకవలన । నహహయలగొఁగుమాఁకునునలరియబ్జ
బాణునిశిలీముఖంబులపాలుగాఁగ । బరులుమరుశిలీముఖములపాలుగారె॥ ౨౨౫.

క॥ నిరుపమలీలంగనుపం । కరుహేక్షణచంద్రకావిగవిసెనలిడుద
మ్మరునారిబోనపుటికల । కరణిన్ జిగురాకుకప్పఁగలవిరులలరెన్॥ ౨౨౬.

క॥ గగనగముతైనపొన్నల్ । చిగురాకులపొగడచాల్ చెలీకనుఁగొంటే
భగణంబుపొలుపుఁదెలుపం । దగుమొగ్గలసద్గణాశ్రితములైతనరెన్ ॥

మ॥ కరమొప్పారఁగఁగుంజముల్ శిఖులపాల్గాఁజేయుచున్ వల్లివా
గురులాడాడఘటించి క్రమ్మక వనక్రోడంబులంబాదపాం

రితాగ్రస్థలపుండరీక వనపున్నాగమ్ములం జైత్రుఁడ
క్కరో కన్గొంటివె బల్శిలీముఖములన్ గప్పెన్ సమగ్రంబునన్॥ ౨౨౮.

మ॥ తరుణీకేతకియొప్పెఁగన్గొనుమలిధ్యానంబులన్నీలకం
ధరమైత్రీకాదదలంకృతుల్ గొనిపగన్ దన్మత్తదంతావళో
త్కరముల్ ప్రుగ్గవిషాగ్నిపాల్పఱచెనింకన్నమ్మరాదంచున
మ్మరుఁడొక్కమ్మడినాకుటంపములఁద్రెంపన్మ్రొల్గుచందంబునన్॥ ౨౨౯.

క॥ కనకప్రసవసువాసన। లనినన్మ్రాగమెత్తిచూడవళులవెవీనిన్
గనుచెలిచిత్రముకనఁగా। వినఁగా నీపత్రయంబువిడిచినవిబలెన్॥ ౨౩౦.

గీ॥ తరుణులారధృతదోహదాచరణులగుచు। మరునికరములవారలసరణిఁదనరి
యలరుటడిదమ్ములుఘటించుతలిరుసెఱుపు। కొలుములనమించెనివెకొన్నికుజములిచట॥

క॥ అనివిన్నవించిప్రమదా। వసవిభవమునన్నుతించివనజాతశరా
సనిరాసనిపీడితయగు। వనితామణితాపమార్పవనరుహనయల్॥ ౨౩౨.

సీ॥ చిదుముఁడీచివురులుమదకోకిలాబల ప్రభునకుఁబల్లవపాణులార
కోయుఁడీతావిపూగుత్తులుసింధురద్గంధవాహికిఁబుష్పగంధులార
వడియుఁడీపూఁదేనెవరగుణీభూతషట్పదునకుమధురసభాషలార
దులుచుఁడీదాడిమీఫలములుశుకసమారోహికిదాడిమోరోజలార
కందకుండఁగ వసివాళ్ళుజెందకుండ। నాగలకుండఁగ నఖరులుదగలకుండ
ననుచురతిరాజపూజనాయత్తచిత్త। కలనఁబుష్పాపచయసముత్కంఠలగుచు॥

రగడ॥ పాలుమాలిన్పపాలసుతవనపాలుఁడిడునులుపాలుడాఁచెను
రాలుపూలసరాలుదెచ్చిమెరాలులేజవరాలువైచెను
రాకుమారిపరాకునీవిటరాకుగెందలిరాకుఁగోయఁగ
మాకులేదుసమాకులతరమ్మాకురుచవిరిమాకుడాయఁగ
రామయీయారామఫలమునిరామయంబిరామచిలుకకు
వామనములనవామలకములువామగతిడిగవామయళుకకు
కూళనీకనుకూలమైనపుకూలమీయకకూలద్రొబ్బితి
వేలగ్రొవ్విరివేలబళియీవేళచెలినీవేలగెల్చితి
పేరుకొనికడుపేరువడితెలిపేరునావిరిపేరుతులువలు
వేఱుసేయకవేరుగలకురువేరునకునవ్వేఱుచెలువలు
కింకబలునీకింకఁగనుమీకింకరిననీకింకమ్రొక్కెద
వంకగానావంకఁజనుగొరవంకలివెయీవంకడుక్కెద

జాలమేమినిజాలకమ్ములజాలకమ్ములుజాలముడువవు
మేలమిడశుకమేలబడుచెలిమేలపుంజలమేలవిడువవు
రంగలరసారంగములనారంగములఁజేరంగఁదలఁచితి
సంగనాచియనంగవైరమునంగడంగిమనంగఁదలఁచితి
కోరిమరునిలకోరిఁగొట్టు చకోరి నీది లకోరి నాదని
దారిఁగనకనదారిమిగులాదాగినదిబకదారిబోదని
తాలమెక్కిదెతాలకిటుకాంతాలపడుపంతాలదానవు
సాలములమొగసాలచెలిమోసాలఁగొనివేసాలమానవు
వాకువినకనవాకులములలవాకుగాఁగొనువాకుమెచ్చెద
నీకుజమ్ములనీకునేనువనీకుసుమములునీకునిచ్చెద
రమ్మసహకారమ్ములకుసుకరమ్మగాఁగిరమ్మవట్టెద
నమ్మవలదుమనమ్ములోఁజలనమ్మచెలినలినమ్ముదాట్టెద
కమ్మకొనుమొఁడికమ్మగాసధికమ్ములగుతిలకమ్ములంగన
మమ్మదూఱకుమమ్మరుచిరతమమ్ములగుకుసుమమ్ములంగన
కోరకములుచకోరలోచనకోరగ్గైకొనికోరకిత్తునె
నారదములేనారయుచునానారచనఁజెన్నార గ్రుత్తునె
కుందనముమాకుందరుణియిదెకుందములుగొనుకుందనేలను
మందగమనయమందగతిరామందమగుకొమ్మందఁజాలను
పట్టితివిచలపట్టియిఁకఁజేపట్టివిడురాపట్టిదొంగరులు
గట్టినీపనిగట్టిదానవుగట్టిగానాడిఁగట్టితిగురులు
నాలుగంటిటవాలుగలమరువాలుతెగమరువాలుగట్టెను
డాలుగలవిరిడాలునకునడ్డాలురాజగడాలుబుట్టెను
పాయలమునిరపాయమైనయుపాయమున ననపాయననలును
కోయలరువివెకోయకికచెలికోయననవిలుకోయఁగనలుచు ॥ ౨౩౮.

చ॥ అనివనకేళిఁదేలి లలితాంగులుఘర్మపయఃకణాపనో
దనచణపద్మినీసుమవితాన నవీనమరందబిందు చం
దనఘనవాసనా లసదుదార సమీర కిశోరవార సం
జనితసరోవిహార వికసన్మతులై గుమిగూడియంతటఁ ॥ ౨౩౯.

## వార్విహార వర్ణనాదికము.

సీ॥ అసమరాళమరాళయానమానయుతంబు సరససారససారసవ్రజంబు

వితతరంగతరంగవిద్ధబద్ధశిలంబుశఫరరాజవిరాజిజలధరంబు
వరరసాలరసాలవాలబాలతటంబుకనదవేలకవేలఘనతరంబు
మధుపరాగపరాగమాధురీధుర్యంబుకలితచక్రకచక్రవిలసనంబు
ప్రాంతపున్నాగసన్నాగరంగరంగ । ఫలితవంజుళహింజుళతిలకతిలక
పతితకురువకకురువకవాసవాస। నాకరంబగునాక్కపద్మాకరంబు॥ ౨౩౬.

క॥ కనిరికనితత్తటంబున । ఘనవిభవములుప్పతిల్లఁగానిలిచి వినూ
తనవిహరణకరణవినో । దనలీలాలాలసలయితద్దయఁబ్రీతిన్॥ ౨౩౭.

సీ॥ మకరందతుందిలవికసత్కవాలంబుసలిలమండితకమండలువుగాఁగఁ
గమలాగ్రసంచరద్భ్రమరికానివహంబు కరముపైరుద్రాక్షసరముగాఁగ
దటభూజవిగళితోత్కటజీర్ణపర్ణముల్ చారుకాషాయవస్త్రములుగాఁగ
సరజసాతివిశాలశైవాలజాలంబుకుటిలసంకటజటాపటలిగాఁగఁ
బొలఁతినాభోవిలాసంబుఁబూనఁదలఁచి।సరసియిభ్భంగిమౌనివేషంబుఁదాల్చి
తపముసలుపంగఁబూనినోయిపుడటంచుఁ।జెలువలూహింపఁతమలోనఁజెలువమంది॥

చ॥ తొడవులుదీసి క్రొమ్ముడిఁగుదువ్వలువల్లడవేసి జిల్గుపా
వడలొగిఁగట్టి మేలి నిడువాలికకొమ్ములువట్టియుద్ధులే
ర్పడఁగవగూడి యల్లపలరాయనిక్రొవ్విరిబోఁడికేని పాఁ
బడనియొయారిదారకనుపట్టఁగొలంకునఁజేరిరెంతయున్॥ ౨౩౯.

వ॥ ఇట్లుజేరితమలోన॥ ౨౪౦.

మ॥ పలుకుందొయ్యలిదంతియాటఁదెలిపెన్ బాలాకనుంగొంటెయీ
కలహంసంబెలదమ్మిఁదున్మతటివక్త్రింబంటుపుష్పాళ్యక్రొం
దళుకుంసిబ్బెముచెక్కలంబడుమరందంబుల్ మదంబంఘ్రిల
న్నలువాతామరనూలుబారిగరదన్నాళద్వయీచంచుమై॥ ౨౪౧.

మ॥ కవితాలీలల సంచరించుమనలంగట్టావిచారింపలే
కవితాభంగమునొందఁజేసెనీడెయీకంజాకరంబంచుసు
క్కవితావృత్తముతొచుమిత్రగతియేకాంక్షించియాచక్రవా
కవితానమ్ములుపీనిసెచ్చెలులువేడ్కల్మీఱఁగన్గొంటిరే॥ ౨౪౨.

గీ॥ పద్మసంతతిమెడఁగట్టుపాలపూస । పేరులోయనరాయంచపిలుకగములు
పంకజాకరసీమఁగన్పట్టెఁగంటె । కోకజిత్వరపృథులవక్షోజయుగళ॥ ౨౪౩.

వ॥ అనుచు వర్ణించుచు॥ ౨౪౪.

మ॥ ముదితల్గాంచఱుకెంపుటా బుఱటకొమ్ములూపునియేతేరసీ

టదళత్పంకజనేత్రయోర్తుతననీడన్ జూచియాకారణం
చుదలిర్పన్ జెలియెవ్వతోపగలుపంజుల్ మించనేతెంచెనే
నిదిగో దానిజయింతునంచుసుమికేన్ హేళావతుల్ నవ్వఁగన్॥ ౨౮౫.

సీ॥ నెలఁతలలోనెల్ల ములుసూపఁగాఁజాలునిలువీఁతనీపద్మినీలలామ
తరుణులలోనెల్ల సరసురాల్ దలక్రిందుగానీఁదనీకూర్మికన్నెమిన్న
యింతులలోనెల్ల నెదురెక్కుడనమించుజనుఁగుటీఁతలకునీచోరబుదుత
కోమలలోనెల్ల నెక్కుడుచూపుఁదేలిపల్కులునీఁదనీహంసమందయాన
యనుచుఁగొంవఱఁజెలులఁజేర్కొనుచుఁగనుచు। ననుచుబెనుకువనుద్దులఁబెనుచుకొను
చు। నీరజాకరసీమనిర్నిద్రగతుల। మచ్చికలుదోఁపరయమునఁజొచ్చియచట॥ ౨౮౬.

సీ॥ ఘనతరాలకతమ్మిఁగైకొంటివదియేమిసుదతిపద్మంబునాసొమ్ముగాదె
కలకంఠిజలమాఁగనిలిచినావదియేమి బిబ్బోకవతివనప్రియనుగానె
అనిమిషాక్షిమునుంగుటాటలాడెదవేమెపడఁతుకనేచోరబుదుతగానె
రాజకాంతరథాంగరాజిఁదోలెదవేమె యరిభంగమతివయర్థంబకాదె
యనుచునాకదిక్కుఁజేరిలావునసుమీటి। కొమ్మఁదగబూనియుడుపాళిఁగోర్కినాని
చలముదొరలంగనాడుచెన్నెలులఁగదిసి। సఖులుసరసతజలకేళిసల్పిరపుడు॥ ౨౮౭.

ఉ॥ వారణయానయొక్కతెయవారణవారణకేళినాక్కరం
భోరువుముంచికొమ్మనసమున్నతిఁబట్టినఁబుష్కరంబునన్
ఘోరముగాఁగనేయబలుగోరకబంధముఁబట్టియొక్కకం
ఠీరవమధ్యదానికిఘటించెభయంబదిసన్నుతింపఁగన్॥ ౨౮౮.

శా॥ చాలుగబారుదీరుకనశార్ఙ్గశరాశరశార్ఙ్గపాణులన్
బాలికలందుముంచిచలపాదితనంబునఁబోరనొరకీ
లాలముగంటిలేకవెడలెన్ దొడఁగెన్ మఱివారిమేనులన్
జాలఁగవింతజీవనముజాలినశింపమివింతయెంతకున్॥ ౨౮౯.

మ॥ వనితల్గాంధ్యబారుదీరుకశరవ్రాతంబులన్మంచఁబే
ర్కొనివారిన్మఱికొంవఱచ్చుతరవారుల్ బూనినొప్పింపఁద
త్తనుజాలంబులగుంకుమంపుమయిపూఁతల్ జాఱికన్పట్టెఁద
ద్ఘనఘాతంబులఁబారురక్తములచందంబందిసాంద్రద్యుతిన్॥ ౨౯౦.

మ॥ ననువుంగోరికలెచ్చఁగా హరివలగ్నల్ వెంబడించన్ జల
మ్మునదంతావళయానగ్రుంకబలితంపున్నిత్యదానంబునం
దినయిందిందిరనీలకైశికలునొందేయేగిశాకారమే

లునకుం జేరినవారలాపదలకుఁ లోనౌదు రేయక్కటా॥ ౨౫౧.

చ॥ వనితయొకర్తు గ్రుమ్మరుచు వారి నిజోరసిజానుబింబముల్
గనిచనుఁగొండలం జెలియ గంటివె యొచ్చటనైనఁ జూడు మీ
యనవును నిట్టి వాని సఖి యారయ మెన్న దు వీని మూలమం
దెనయఁగఁ జాలువాని తప మెచ్చని నెచ్చెలి నవ్వఁ గేరుచున్॥ ౨౫౨.

చ॥ చికిలికిరీటి పచ్చపని చిమ్మనగ్రోవి నిచంటనాని పూ
నికనొకకోలసీటఁ దనసీడఁ గనుంగొని చేరి నెచ్చెలిన్
సకిగనుఁ గొంటెకొండలకు సన్నలు సేయు వెడంగు నంచుఁ దా
వికవికనవ్వ నవ్వె నది వెంగలియంచు వయస్యఁ గేరుచున్॥ ౨౫౩.

చ॥ వెలికిలనీఁదు నొక్కయలివేణి చనుంగవ కుంకుమంపుమే
ల్కలప ముజాతి గోటి మొనఁ గాఁడిన రేకలఁ గాననయ్యెను
జ్జ్వల నిశితాంకుశక్షతుల వన్నియఁ జాల మెఱుంగు దేఱు పూ
విలుతుని వెక్కసంపుఁ గరివేత్రికపుం గుంభయుగంబు చాడ్పునన్॥ ౨౫౪.

సీ॥ రాకేందువదనయుఁ గోకస్తనియుఁ గూడ ఘనతమోనిభవేణి కడకు నొత్తె
నహిసోమరేఖయు హంసవాణియుఁ గూడ నీలకంధరకైశ్యదోలియాడెఁ
గంజగంధియు భృంగకచయుఁ గూడ సువర్ణకలికోపమాంగి చీకాకుపఱచెఁ
బృథులరంభోరువు బిసబాహయును గూడ నవ్యాజగజయాన నడచి గెలిచె
నతులితాంగబలంబులనలరుకతన । నిద్దతిద్దటికొకరొకరేరుపడుచుఁ
గాంతతరనీరజాకరాభ్యంతరమున । వేడుకలు చెల్లఁ జల్లుఁ బోరాడునపుడు॥

సీ॥ ఒకసరోరుహపాణి యొకసవ్యబిసబాహ యొలమిఁ గైకొనినిలువీఁతయీఁదె
నొకహంసగామిని యొకవీచికావళిబాదివిఱగ్గలకుండఁ బారలియీఁదె
నొకశిలీముఖవేణి యొకయుత్పలేక్షణ పైవుంచ వెలకిలఁ బడుచు నీఁదె
నొకకోకవక్షోజ యొకజలభ్రమనాభి దేలించి పరబిరఁ దిరిగి యీఁదె
కమలనాళమరాళరంగత్తరంగ। భృంగనీలాంబుజాతరథాంగనికర
గురుతరావర్తవిభ్రమమరసి సరసి । సరసజలకేళికాసముత్కంఠలగుచు॥

సీ॥ ఘనవేణియదె తరంగములకుబ్బు ఘటించె నదె గిరిస్తని నీళ్ళు కదిసి కలఁచెఁ
గలవాణియదె యంచకదుపుఁ బైకొనితోలెఁ గమలాక్షియదె పద్మకళికఁ బూనెఁ
బద్మినియదె గ్రుంకి పైకి నిల్చు కదే లేఁ బ్రమదాళియదె మధుప్రతతి కేగె
లతకూనయదె దరుల్ పట్టి పాఱఁ గఁ గసాగెనదె ముద్దియ పరాగమెత్తి నిలిచె
నొకసరసురాలొకసుగంధియొకకళావతియొక మోహనాకారయొక్కయుగు రాకు

బోడియొకయొసపరివన్నెలాడియొక్క। బిసభుజయొకవిభ్రమవతిచెరసికొలువ ॥
సీ॥ మనచక్రకుచయంచునన్రెగమ్మియమృతంబువెడలించెనీతమోవేణినాడిసి
మనహేమగంధిగమ్మునముంచిగెలిచెనీగంధపుష్పంధయక్రైశ్యఁగదిసి.
మనమేఘకచమించుఁబెనచిజీవనచయంబెడలించెనీహంసయానఁగదిమి
మనసింహమధ్యగోరసెబూనుక్షొనికబంధమువాపెనీగజగమనఁబొదివి
రాజముఖులారవరముఖాంభోజలార। చారుబిసబాహులారరంభోరులార
కందఁగానేలముడుఁగుచుఁగుందనేల। కళ్లగానేలతలవంపుగొళ్లలేల ॥
క॥ అనిపలికిమఱలఁబురికొ। ల్పనతాంగులతోడఁగూడిపాదలెడుదమినా
వనజాస్యలుగ్రమ్మఱఁబురి। కొనివిహరించిరిమనంబుకోర్కిదలిర్పన్ ॥ ౨౪౯.
వ॥ ఇవ్విధంబున జలకేళిఁదేలిచాలించిన ॥ ౨౫౦.
చ॥ మొనసిశిలీముఖప్రతతిముంచినపద్మిని శార్ఙ్గవిస్ఫుర
ద్ఘనశరఘట్టనన్నొగలఁదద్దళముల్ విరియించినారమిం
కనిచటుభంగమొందికలఁగంబడియుండెడుపీనినొంపఁగా
ననుచితమంచునోవెడలిరక్కొలనిందుముఖుల్ మహోన్నతిన్ ॥ ౨౫౧.
సీ॥ విసముమైనిలుపుటవసముగాదనుచునోతడియొత్తులనుమేనుతళ్కుదుడిచి
కపటముల్దాల్చుటఘనముగాదనుచునోతడిసినపావడల్ సడలఁదన్ని
అప్పదీరెనుభోగమొప్పనింకనుచునోవలిపెంపుఁజలువదువ్వలువలూని
ఘనరసంబౌదలనునుపరాదనుచునోకురులార్చికొప్పులుగుమురుపఱచి
మంచికపురంపుగీరునామములుదీర్చి। పొదలునెత్తావిసంపంగిపూలుదుఱిమి
చొక్కతరమైనగోవకస్తూరియలఁది। యలఘుతరమైనమణిభూషలలవరించి॥
గీ॥ వలసివల్లమిమునుమున్నసలిలకేళిఁ। దేలిచాలించివరసరస్తీరభూమి
నాత్మకింపనిశృంగారమవధరించి। తలఁకుసీమంతినీలతాతన్విఁజేరి॥ ౨౫౩.
గీ॥ కొమ్మనెమ్మదివలవంతగ్రమ్మనీకుఁ। గోర్కిలీడేరసద్భక్తికుదురుకొల్పి
కమ్మవిలుకానిపూజింతమమ్మయనుచు। నబ్జసాయకపూజనాయత్తలగుచు॥

## మనోజపూజాభివర్ణనము.

మ॥ వలపుంగ్రొవ్విరినీటియేటిదరిఁజల్వాల్జల్లులేఁబొన్నగు
న్నలనీడన్ బొదిగొన్నమల్లియలక్రిందన్ గప్రపున్నద్దియన్
దళుకున్గేవఁగిటేకునన్మరునిఁదత్కాంతన్ దదీయాప్తబం
ధులఁజందాద్రిదులవ్రాసి క్రొంబదనుకస్తూరిన్మదంబొప్పఁగన్ ॥ ౨౫౪.
మ॥ గరుడంచద్గుణగంధిలాయుధవపద్గంధర్వసద్వాసనా

తురగస్యందనమాధురీ పరిలసత్కోదండసంకల్పధు
గ్వరతల్పస్థలకామినీ సయనముక్తారత్నతూణీరస
ద్వరలాభంబొసఁగూర్పుమీచెలికి నిర్వ్యాజప్రభావోన్నతిన్‌॥ ౨౬౬.

సీ॥ శారికానాసీరజవనఘోటీకృతాంబుజమిత్రునకునీకు మోడ్పుఁగేలు
కీరవాజివిహారజారీకృతాదిమబ్రహ్మచారికినీకుఁబ్రార్థనంబు
ధిక్కృతశ్రీకంఠకుక్కుటీకృతనాకవాస్తవ్యునకునీకువందనంబు
కమనభీకరబాహకామితాత్మతనూభవాకృతబ్రహ్మకునీకువినతి
జటిలకుటిలాలకాకారసదయహృదయ। దీప్రతరకీలికీలేంధనప్రతాప
సూనచాపనమస్కృతుల్‌ వేనవేలు। పుంశ్చలీకృతతారకాపునకునీకు॥ ౨౬౭.

మ॥ కమలాగర్భసుధాపయోధినవరాకాచంద్రకందర్ప నీ
సమలెవ్వారునులేమిమాకుఁదెలిసెన్‌ సర్వంసహానందివి
క్రమసంచారగరిష్ఠులన్‌ హరిహరబ్రహ్మామరశ్రేష్ఠులన్‌
సుమనశ్చాపముఁబూనినారిదవులన్మ్రొక్కల్పిబంధించుటన్‌॥ ౨౬౮.

సీ॥ చేతికిఁజిక్కనిచికిలిక్రొమ్మొనచూపులెవ్వానితూపులై నివ్వటిల్లు
నిలువఁబట్టఁగరానిమలయమందసమీరమెవ్వానిదంతియైయేఁపుఁజూపుఁ
జూడ్కికిఁగనరాకసొబగొందునెమ్మనంబెవ్వానిశయనమైయింపొనర్పుఁ
జెప్పినట్టేరికిఁజేయనిజవ్వనంబెవ్వానిభృత్యుఁడైయొలమినిలుచుఁ
గంటిమొనపనిగాయముల్‌ గాంచిసారగు। ధరణినెవ్వానియసిధారవిరహిలోక
మిట్టినినువంటిజోదునకెవ్వరీడు। కాముకవ్రాతకృతపూజయోమనోజ॥ ౨౬౯.

సీ॥ నలువనీమొనతూపునకుడోకారముజొచ్చివాబల్మినాకమాటవాసిఁగనియేఁ
బశుపతినీమామపాదమాదలఁదాల్చియేలమిమైఁదనయిల్లునిలుపుకొనియె
జలరుహోదరుఁడునీసఖునామమువహించిపెంపొందుసిరినిల్పఁబేరుఁగనియెఁ
దమిపులోమవిరోధితావకసమయజ్ఞుఁడైయతిప్రమదాప్తినతిశయిల్లె
నున్నజనములనిఁక వేఱెయెన్ననేల। సాయకార్జితనిఖిలజేగీయమాన
జయరమాకామినీకేళిసదనకదన। పదనతసమస్తవిటవిటీవదన మదన॥

క॥ అనిప్రార్థించుచుసహకా। రనవ్యమధుజిద్వచనతిరస్కృతశుకులై
నినదన్యక్కృతపికులై। యనుఁగుఁజెలుల్‌ దన్నుఁజేరియాదరమొదవన్‌॥

సీ॥ నునుగప్పుఁగొప్పువాసనగుప్పమలయమారుతమహారథునకుమ్రొక్కవమ్మ
కలికితీయనిముద్దుఁబలుకుచెచ్చెరఁగుల్కఁజిలుకసాదినినుతిసేయవమ్మ
నఖరుచుల్‌ విరివసంతములాడమత్తాళినీగుణునిఁబ్రదక్షిణించవమ్మ

తఱివిప్పకన్గవకలువఱేకులనీన నెనయఃల్లుపైదృష్టి నిలుపవమ్మ
వఱలుభవదీయమానసవాంఛితంబు । సంఘటింపంగ జలజాతసాయకునకు
హృదయనీరేరుహముసమర్పింపవమ్మ । సాంద్రనిస్తంద్రరుచిపూర్ణచంద్రవదన॥ ౨౭౩.

క॥ అనివిన్నవింపనెమ్మన । మునఁగడులజ్జాభయములుమొనపఁగ నీష
ద్వినతాననసీరజయై । మనసిజునకుమ్రొక్కిమఱియు మదిబెగడొందన్॥

ఉ॥ తమ్ములమూఁగునంచలరుతమ్ములకున్ మగతేఁటిమేటిగీ
తమ్ములకున్ శుకాళిలపితమ్ములకున్ మృదువాతపోతజా
తమ్ములకున్ బికీలలసితమ్ములకున్ భయమందుచున్ నిశాం
తమ్ములతాంగిసేరిగతతమ్ములతాంతశరార్తిఁదాంతయై॥ ౨౭౪.

{ విమల తనపుత్రియగుసీమంతిని విరహిణియగుటఁదెలి
సి తనసఖియగు చిత్రరేఖం దలంప నది యేతెంచుట. }

సీ॥ తాళవృంతానిలోత్తాలవేదనకోడితాళకమిగులఁగాంతాళపడుచు
సారసారభసంఘసారచర్చలఁజేయుసారసాననలవేసారివినుచుఁ
గాయత్రితాబ్జినికాయముల్గనుఁగొనికాయజుఁడింకఁజేకాయఁడనుచుఁ
గల్పభూజలతాంతకల్పపల్లవతల్పకల్పనవిగళితాకల్పయగుచు
సన్నయైయుఁగనిచెలిచూచిసన్నగిలుచు । విన్ననైయున్నఁదద్వార్తవిన్నదగుచు
విమలకమలాయతేక్షణవిమలవచ్చి । సట్టియక్కునముద్దులసట్టిఁజేర్చి ॥౨౭౫.

క॥ నాయమ్మయిటులఁబొగులఁగ । నాయమ్మగునేభవన్మనఃకామనమా
కీయెడఁదెలుపంగా రా । దే యనినెచ్చెలులఁజూడఁదెలిపిరివారల్॥

క॥ మునుమీయానతిసీమం । తినితోడనిదాఘమునవనీవాటికకై
చనిమేముసుమాపచయం । బొనరింపుచువేడ్కమెఱయనుండెడువేళన్॥

సీ॥ మరునిసోయగముఁవేమఱునిందనొందించుకొమరువాఁడొక్కరాకొమరుఁడచట
మఱుఁగుఁబూఁబొదలఁగ్రుమ్మరుగుబ్బపుఁదావితఱుగుఁగైకొనుచలతఱుగుగాలి
మొదలిఝుమ్మనెడుతుమ్మెదలింపుమైఁద్రొక్కికదలింపుకపురంపుఁగదలినీడఁ
జెలువమెచ్చఁగనున్నఁజెలువనాఁటినపేర్మిఁగలువఱేకులచాలుఁగెలువఁజూచె
నాఁడుమొదలుగఁజెలులఁబోనాడునువిద । యామినియటన్నఁబులుకదాయామనయన
కనచుడుస్వామిఁగడురోసికనదునాతి । యున్నతోరోజగతియిదియున్నరూపు॥ ౨౭౬.

చ॥ అనవుడువారికిట్లనియె నా విమలా విమలాంగి వోయమ్మ నే
మనఁగలదాన నానరవరాత్మజువంశమునూరుఁజేరుఁ బెం
పునువినకేగుదెంచలిరి మోసమువచ్చెను చిత్రరేఖయుం

డిన నిపుడింతయుం దెలియనేరక వచ్చుచు నుంత పెచ్చునే॥ ౨౯.

రాదయ్యెం బోయిత డయుట। కేదినిమిత్తంబొ తెలియ దేమియు నని త
న్నాదేవి దలంచె నృతతి। నాపరమునం జిత్రరేఖ యటకే తెంచెన్॥ ౨౦.

## ఆ శ్వా సాం త ము.

శా॥ క్రుధ్యన్మత్తవిరోధి చిత్తదళనస్ఫూర్జత్ప్రకారానతా
రాధ్యప్రోన్నత భాగనిర్మిత సువర్ణస్వర్ణపాంచాలికా
బుధ్యాపాదక సేవ నాగత సురస్ఫూర్జత్స్వర్ణకుంభ ప్రభా
జ్యధ్యేయోద్యసరోజరాగమయహర్మ్య ప్రస్ఫురత్ఖేలనా॥ ౧.

క॥ చరణానతజనభరణా। భరణాన్మఘుజ ప్రతాపబలవికచరణా
చరణాత్తవిమతవరణా। వరణామోదితసుపర్వవరమునిచరణా॥ ౨.

మాలిని॥ జటిలసవనరక్షాదక్ష కోదండదీక్షా
త్రుటితగిరిశ చాపారూఢ బాహుప్రతాపా
చటులనిసితబాణాక్షయ్యమాణిక్యతూణా
పటిమహతనిరోధాపాదనోద్యద్విరాధా॥ ౩

## గ ద్య ము.

ఇది శ్రీరామచంద్ర చరణారవింద మిళిందాయ
మానమానస సకలశాస్త్రాధ్వరిరంసప్రౌఢిమత్తి
పద్మనాభాధ్వరివతంసకృపాభూషణ
పర్వతరాజతనయ వేంకటపతివిర
చితంబైన చంద్రాంగదచరి
త్రంబను మహాప్రబంధం
బునందుం జతుర్థా
శ్వాసము.

❊



శ్రీ శ్రీధరాయ నమః.

# చంద్రాంగదచరిత్రము.

## పంచమాశ్వాసము.

క॥ శ్రీమహితనూజనాయక । సాముద్రమదాపహారిసాయకసుమనో
భూమీధరకార్ముకభృ। ద్భామా నుతదివ్యనామ దశరథరామా॥ ౧.

వ॥ అవధరింపుము తదనంతర కథాక్రమంబెట్టిదనిన నట్లు చిత్రరేఖ నిజనగరంబు సొత్తెంచి ॥ ౨.

క॥ మచ్చికఁదన్ను నెదుర్కొను । నెచ్చెలులనుజూచియేమినెవ్వగమిమ్ముఁ
గ్రుచ్చినకైవడినున్నా। రచ్చెరువని చిత్రరేఖ యడిగినవారల్ ॥ ౩.

గీ॥ పూసగ్రుచ్చినట్లుపువుఁబోఁడివృత్తాంత। మెఱుకపడఁగఁదెలిపియిందుకిప్ప
డింపుముఖులువెనకముందఱఁగానక । కుందియున్నవారుకువలయాక్షి ॥

చ॥ అనవుడునెమ్మదిన్సిగులహర్షముఁజెందియెఱుంగనట్టుల
జ్జనపతిదేవిఁజేరిమగనిచయ్యన నాయమచే సమస్తమున్
వినుచుమహాద్భుతాకలన నివ్వెఱచేనటియించి తన్మనం
బునఁగలచింతకొంత తెగ మోదమునన్ బలికెన్ మహోన్నతిన్॥ ౫.

**నిషధన్విరహమునఁగుందునొక రాకొమరు వర్ణించి వాని చిత్రఫలకమును చిత్రరేఖ యొసంగుట.**

మ॥ సకియా నే భవదీయశాసనముచే సర్వక్షమానాథులన్
మకరాంకప్రతిమానరూపుల నిలింపగ్రామణీభోగభా
గ్యకళారూఢుల వ్రాసితెచ్చితటె నాహా నైషధక్ష్మాతలాం
తికసీమన్గనుఁగొంటి నొక్కవనమెంతేవేడ్కఁదీపింపఁగన్॥ ౬.

వ॥ కనుంగొని ॥ ౭.

క॥ ఇంపున నేఁడిటునిలిచి యి । దంపురభూవరకుమారదర్శనమున్నా
వింపుదునని యచ్చటవిహ । రింపుచుఁబరికింపనొక్కకేళివనన్ దేవా॥ ౮.

సీ॥ వదనప్రభాసరోవరనీలతటులునా దంతైనబవరిగడ్డంబువాఁడు
కమలావధూటిచొక్కపుటెదురిండ్లునా నాయితంబగుగన్నుఁదోయివాఁడు
వలతేఁడునవలాలవలపుటేటికినిడ్డయొడ్డుకైవడినొప్పునురమువాఁడు

తారుణ్యసంవాసతనుసౌధకనకకుంభములునామించునంసములవాఁడు
బాగయినవాఁడుమరుమామబాగువాఁడు। మేలయినవాఁడుభూచక్రమేలువాఁడు। పెం
పుఁగలవాఁడుపగతురఁజంపువాఁడు। కోమరుఁగలవాఁడుపుడమిరాకొమరుఁడొకఁడు॥

మ॥ చిగురుంజొంపపుగుజ్జుమామిడికడన్ జిన్నారిపొన్నారి లే
జిగిసంపంగిచెడంగుపూవుఁజవికన్ జెంగల్వపూఁబాన్పునన్
దగమైఁజేర్చినచెల్మికానితొడమీఁదన్ దార్చుకెంగేలిపై
వగఁగన్పట్టఁగఁజెక్కుఁజేర్చిమదనవ్యాలీఢచిత్తంబునన్ ॥ ౯.

క॥ రారాయనుచున్ దనసో। రారా పిలిచి మదనశరహతినీమే నా
రా రాపడెననుచున్ దా। రారాజనిభాస్యననవ్వడయుటెన్నఁడొకో॥ ౧౦.

ఉ॥ చక్కెరవింటిబోయయొకసక్కెములన్నియుఁదెల్పిమ్రొక్కినన్
గ్రక్కునలేవనెత్తిబిగికౌఁగిటఁజేరిచిముద్దుపెట్టి నీ
వక్కటనాకుఁగా సుమశరాసనుక్రొవ్విరియంపకోలలన్
జిక్కితివంచుమేనిమిరిచేడియయెన్నఁడుగారవించునో॥ ౧౧.

చ॥ ఇటువలెమచ్చరించుహృదయేశయుఁడైనలతాంతధన్వికో
క్కటఁగడువెక్కసంబడరఁగా నునువక్షువయ్యురంపులేఁ
జిటిపొటిసిబ్బెపుందళుకుఁజిక్కనిచక్కనిగుబ్బచన్నులన్
దిటముగఁగౌఁగిలించిసుదతీమణినాపగదీర్చుటెన్నఁడో ॥ ౧౨.

చ॥ పెడవిలుకానిప్రాసరుదువ్రేటులచేగెలనాటిదప్పి చేఁ
బడలితినింకజంకునడపన్ బనిలేదధరామృతంబుగ్రు
క్కెడుపెసనిచ్చిదప్పియడఁగించిచెలీననుఁబ్రోవుమంచు నే
వడిదయబుట్టనాడసతివాతెఱఁగ్రోలఁగనిచ్చుటెన్నఁడో॥ ౧౩

సీ॥ కొసరికొమ్మనుచుఁజక్కసగంబుఁగొఱికిన తెలనాకుమడుపువాతెఱనుజాపి
అడియాసఁగొలిపినాకదియీకగికురింపవలుకకసేనునవ్వులఁగఁబోరల
నలయించితిట్టిచెక్కిలిగొట్టిరాకొట్టిబలిమిమైఁబట్టితమ్మలముఁబెట్టి
మొనపంటనూనికెమ్మోవితేనియనానిగబ్బిగుబ్బలనొత్తికౌఁగిలించి
యలుక నీకేలరా యేలరా యటంచు। నవ్వి నవ్వించి మరునిదుండగములెంచి
మనసుఁగరఁగించి మన్నించి మమతఁబెంచి। యింతిపైకొనికూడుటయెన్నఁడొక్కో।

వ॥ అనిమతియును ॥ ౧౪.

ఉ॥ ఎంతయువెచ్చనూర్పుచురహింపఁగఁజిత్రపటంబునందు నీ
మంతినివ్రాయుయు వ్రాసి పలుమాఱునుదప్పకకాంచుఁగాంచి తా

ంతరవీథిఁ బాయనితదాకృతికిన్ సరిజూచుఁ జూచి తన్
జెంతనె వ్రాయు వ్రాసి బళి చేడియ యీడగు నీకు నాకనున్॥ ౧౬.

ఉ॥ ఏలవె నన్ను నీవ్వలుకయేలవె లెండియనుంగుఁ బచ్చబా
బాలవె దాడిరాఁదొడఁగెఁ బాలవెడంగె మరుండు వానిచేఁ
గూలవె ప్రాణముల్ ధరణిఁ గూళవె కావె యుపేక్షఁ జేసినన్
జాలవె సన్నినున్ బొందుచఁ జాలవె పాపములింతిరో యనున్॥ ౧౭.

చ॥ నిగనిగలీను కుందనపు నిగ్గుల వట్రువ పుట్టులింగముల్
జిగిబిగిగల్గు గునీతళుకు సిబ్బెపు గుబ్బలటంచు మ్రొక్కఁగాఁ
దగనటు జేరినా మనసు దక్క జెనంగితి మ్రొక్కవచ్చినన్
నగరను దోఁచుకొన్నగతి నాయమె నీకు మృగేక్షణాయనున్ ॥ ౧౮

సీ॥ చలిఁబాసి వత్తిల్లు సమయమా నిది చేర్చి కలకంఠ కఁఠిరో పలుకరాదె
యలరారుతమిఁ జెంచు నవసరంబిది పాటలామోద యామోదమందరాదె
తాపంబు హరియింపఁదగు వేళయిది బర్హి వేణిరో నటనఁ గావింపరాదె
కలఁగిన జీవనంబలరించు తఱియిది బిసరుహానన తెల్విఁ నెసఁగరాదె
పనికిమాలిన లజ్జ యీపాటి చాలుఁ। బదరి మదనుండు చొరఁ బారి పదను మోవఁ। గులు
కుఁ గ్రొవ్వాడి చిగురాకుఁ గుఱుచపిడెము। కోలఁదిఁ గ్రుమ్మినఁ దాళుకోఁగలవె యనుచు॥

వ॥ ఇవ్విధంబున మోహావేశంబునఁ బలవింపుచు నయనబాష్పధారాతిరోహితదర్శ
నుండై చెలికానితో నిట్టులనియె॥ ౨౦.

సీ॥ కనుఁగొంద మేకాంత కమనీయతర కుంతలములఁ బోల్ భృంగజాలముల సొబగు।
లరసివత్తమె రామయభిరామ కరతామరసము బోల్ మరుని నారసము తళుకు। వీక్షింతమే
సారసేక్షణకుచ కోరకములఁ బోల్ చక్రనాకముల బెడఁగుఁ। బోయి చూతమె బాల భు
జమూలరుచి యోలగములఁ బోల్ సుమపరాగముల మెఱుఁగు। లనుచు ననుచుఁ గోర్కులఁ
జాలఁ బెనుచుకొనుచు। మనుపననుపమాతను వహ్ని వెనుపు జొనుపు। కోలఁ కుఁ
గొలఁకుల తేనియఁ జిలుకుఁ గులుకు। గుమురు పూఁదీవియలఁ జూడఁ గోరి విభుఁడు॥ ౨౧.

క॥ వెడవెడఁ బొడమెడు యూర్పుల। దుదుముల గములు విరులగని తొడిబడఁ బైపై
బడఁ దివిరెడుఁ డుమ్మెదలని। జడియుచు లతికాగృహంబుఁ జయ్యన వెడలెన్ ॥

క॥ అంతలతాంతనిశాంతా। భ్యంతరమున కేగి చిత్రపటమున్ గొని నే
నెంతేరయమున వచ్చితిఁ। గాంతాతిలకంబ నిన్నుఁ గనుఁగొను వేడ్కన్

మ॥ ఇదె యీచిత్రపటంబుఁ జూడుము చెలీ యిందెంత యున్నించు న
మ్మదనాకారు గభీరు సారగుణసంభారున్ మహాదారుఁ జం

చదపాంగాకలనాపసారితసుధీసందోహదైన్యప్రచా
ర దయాస్మేరముఖారవిందజితతారారాడ్రుని న్నావుడున్॥ ౨౪.

క॥ తామసమిక్కనేటికిమీ। సీమంతినిసముఖమునక్కజెలివేచని యెం
తే ముదముదవ జూపుము। నా, మేలనిచిత్రరేఖనైపుణిమెఱయన్॥ ౨౫.

## చిత్తరువుంజూచి సీమంతినిపరితపింపనునయించుట.

మ॥ చెలిమిన్ జిత్రపటంబుఁజూపుటయునాసీమంతినీకాంత యం
త లతాంతాయుధకుంతసంతతి నితాంతావ్యాకులస్వాంతయై
వలపున్ గోరికసిగ్గుసాధ్వసముభావంబందుఁదోఁద్రోఁపుచే
సోలయంగాఁబులకించు నెంచుఁదలవంచున్ బ్రీతినెంతేఁదగన్ ॥ ౨౬.

సీ॥ పటచిత్రితాకారపతిరేఖకనుడాయవిప్పతెప్పలచేతనప్పళించె
నప్పళింపఁగనీకగప్పనఁగనుదోయినలమిపైఁబడలజ్జయడ్డకట్టె
నడ్డకట్టఁగనీకనలకేకరాక్షులువెడలజ్జపారఁజించివెడలఁబాతె
వెడలఁబాఱఁగనీకవడిఁగేకరాక్షులఁగన్నీటివెల్లువగప్పకొనియెఁ
గప్పగన్నీటివెల్లువకడకుఁదేలు। మొలకచూపులునాఁగఁజెక్కులురహించెఁ
బులకలిరువంకరతికంతులలుకసేయ। మొనపుమొనముల్కులనఁగనవ్వనితకపుడు॥

క॥ ఏవంవిధఘనసాత్త్విక। భావావృతినాలతాంగిభావోదితల
జ్జావనతాననసీరజ। యై వసివాడంగఁజెలులుహాసనోన్ముఖులై॥ ౨౭.

సీ॥ మనబోఁటికినిహితంబానరింపఁదగునట్టినిఖిలవిశ్వంభరానేతయితఁడు
విమలాత్మజాసమాహామికఁబోకార్చినపరమలావణ్యసంపన్నుఁడితఁడు
సీమంతినీమనస్సీమనేల్బడిసేయుభావమానతనూవిలాసుఁడీతఁ
డాగిరిస్తనిభాస్వదతనుప్రతాపంబుసమకూర్చురాజన్యచంద్రుఁడితఁడు
చూడరేయంచుఁదమలోనఁగూడికూడి। నర్మఘటనాచమత్కారిమర్మభేది
వచనమాధుర్యధుర్యతాహార్యరచనఁ। గదిసిగజ్జలకోలలుగదిరినటుల॥

సీ॥ భావించితప్పకపలుమాఱుఁజూచినధనువున కెంతయుద్దృష్టితాఁకుననియొ
దట్టంపుమరుకాఁకనిట్టూర్పుసోఁకినఁజక్కనిపతిమేనుబాక్కుననియొ
కందర్పుచారికగ్గముసేయుననినాథుగట్టిగాఁదలఁజేయిఁజెట్టుమనియొ
తాలిమిఁదూలించితలకెక్కవలపిప్పుజీవితేశ్వరనిరీక్షింపుమనియొ
జిగిబిగిమొయారిబిత్తరిచికిలితళుకుఁ। గులుకుక్రొవ్వాఁడిమొనమోరజళుకుజళుకు
సోగసునిడువాలుఁజూపులఁజూచిచూచి। యవనతాననయగుటసారంగనయన॥

సీ॥ ఉడికించునిజనాథునురముఁగ్రుమ్మిపగుల్పఁగులుకుగుబ్బలతోడఁదెలుపుకొంటకా

నీకాంతుఁబాయనినెలఁతోఁబెంపునమదినున్నమరునివాల్ వెదకుకొ ఱకొ
నీయందుహృదయమానిలిచిననావిభుఁడోలఁగనంపితివంచుదూఱుకొ ఱకొ
యితనిఁదెచ్చినకాంతకెచ్చుమెచ్చెసఁగఁగానురుహారమొకటినేర్పఱచుకొ ఱకొ
కట్టెదుటనిలిచినీకుసాక్షాత్కరించు । నంగసంభవనిభునినీప్రాణవిభునిఁ
గాంతులీడేఱఁగన్నులకఱువుదీఱఁ । గనుఁగొనుటమానితలవంచికొనుటయబల

సీ॥ నీరూపుఁగైకొనినీప్రాణనాథునినెనసియుండెడుకొమ్మయెవ్వతమ్మ
యెవ్వతెవేయింతియెలమినావిభుతోడఁ గలసియుండఁగనంచుఁబలుకవమ్మ
పలుకకూరకయున్నఁదొలఁగిపోవఁగనీకచయ్యనచేపట్టితివియవమ్మ
తివిచివైచినచోటఁదేటగానీపతిదెలుపునుత్తరమప్డుదెలియవమ్మ
తెలియకేరీతినాతనివలనలేని । నేరమొక్కటిఁగల్పించినీవునేఁడు
చుఱుకుఁగ్రొవ్వాఁడిచూపులఁజూచిచూచి। మగువతలవంచికొనియుండఁదగునటమ్మ॥

సీ॥ భవదీయధైర్యసంపదలెఱింగినయట్టికాయజన్ముఁడుతాపికాఁడుగాఁగ
దరితీపుఁజూపునీతళుకుఁగ్రొవ్వాఁడిబిత్తరిచూపుప్రాఁకుడుత్రాడుగాఁగ
ఁదావకీనదురంతతమమోహపుంజంబుగ్రమ్మినయంధకారమ్ముగాఁగ
దావకసాత్త్వికభావానుభావసామగ్రిచల్లినసాక్ష్యమందుగాఁగ
నైజలావణ్యమనెడికన్నంపుఁగత్తి। బూనిమదిఁగన్నపెట్టినమానచోరు
నితనిఁదెచ్చినమాకునీవీయకున్న ।మెచ్చఁగానైనవలదచ్చమచ్చకంటి ॥33.

మ॥ అనినర్మోక్తులుపల్కునెచ్చెలులవాక్యప్రౌఢికిన్ జాలకాఁ
గినబుద్ధిన్ గడకేగియొంటినాకచక్కన్నిల్చిసీమంతినీ
వనజాతాయతనేత్రచిత్రపటదివ్యన్నాథసౌందర్యద
ర్శనకౌతూహలమందలేమి యటమూర్ఛాక్రాంతయైయుండఁగన్॥ 34.

క॥ వేదండగమనయొక్కతె । కైదండయొసంగవిమలగలఁగుచువాడున్
బూదండపగిదిఁదగు నవ। లా దండకుఁజేరిమిగులలాలనమొదవన్॥ 35.

క॥ మున్నీటఁబొడమతరగల । పెన్నిటిన్ గడవఁజాలిపెనుపగు నుడుకుం
గన్నీటఁదేలుకనుఁగవఁ । బన్నీటను దుడిచితేర్చిబరవసమలరన్॥ 36.

మ॥ తనయా కుందకుమీభవజ్జనకుఁడేతద్వార్తమున్మున్నగెం
టనిప్రేమన్ విని తాస్వయంవరముఁజాటన్పంచినాఁడెల్లనే
టనైభూపాలురువత్తురంత నెనరంటన్నీమనోవల్లభున్
గనిపెండ్లాడుదుగాని యందనుకఁజిక్కంబట్టుమీధైర్యమున్ ॥ 37.

వ॥ అనుచు నుపలాలింపుచుఁజెలువఁ గాపాడుమనుచుఁ జెలులకొప్పనజేసి ని

జాంతస్సాంతంబునకున్ జనిరోయెనంత ౩౮.

## సూర్యాస్తమయవర్ణనము.

సీ॥ వెలఁదివిరహాగ్ని మిన్నంది వెలుఁగుచుండఁ। బడమరకు ఱిగ్గి కడుఁజల్లఁబడియెఁ బ్రొద్దు
ధరణి "సుష్ణముష్ణేనశీతల" మటంచుఁ। బలుకుఁబలుకు యథార్థమై పరిఢవిల్ల॥ ౩౯.

సీ॥ కొండలెల్లఁ బసిండికొండలై విలసిల్ల నదులెల్ల వాఙ్మానదులు గాఁగ
లతికలెల్లఁ బ్రవాళలతికలై రహిమించ విరులెల్ల మోదుగువిరులు గాఁగ
ఖగములెల్ల రథాంగఖగములై చెలువొంద మట్టిరేల్లను నెట్టిమట్టి గాఁగ
నాకులెల్ల నుజిగురాకులై పెనుపొందఁ బండ్లెల్లఁ గాకరపండ్లు గాఁగ
నిండెఁగను పండువగుచు నిర్నిద్రజలజ। పటలసౌభాగ్యభాగ్యసంపత్పరంప
రానుభవనాశసూచకరక్తవర్ష। మనుకరింపుచు జరఠారుణాతపములు॥ ౪౦.

క॥ తనజనకు నెదురువారల। వెనుకొని పోరాడి యతఁడు వీఁగినఁ బతిఁ జే
ర నరుగు యమునాసలిలము। లనఁ దూరుపుదెసకు నిగుడి యరిఁగెంజాయల్॥

సీ॥ మొనమెత్తఁబడుగల్వమొగడలు బరికించుఁ బరికించి కడుమెత్తపాటుఁ గాంచు
నరమోడ్పువగలం దరవిందములఁ గాంచుఁ గాంచి కన్నఱ మోడ్చి కళవళించుఁ
గరఁగఁ బారెడు చంద్రకాంతముల్ గనుఁగొను గనుఁగొని మదినంతఁ గరఁ బాఱు
రవికాఁక నడరెడు రవికాంతములఁ జేరుఁ జేరి తా రవికాఁకఁ జిక్కిపోగులు
జగిమ గని బిగిదెగుటకుఁ జిన్నఁబోయి। నాగులు నెగులును దిగులును బుగులు కొనఁగ
మగనిఁ దగిలిన వగలను బొగిలి పొగిలి। కందె వెఱగంది యొక్కొక్కజక్కవ వెలంది॥ ౪౨.

ఉ॥ చేరఁగవచ్చె రాజసతి చేరకుఁడిచ్చటి కెవ్వరంచుఁ జెం
పారఁగఁ బాటి పక్షిసముదాయము చారితవక్షదేశమై
చారు రుతిచ్ఛలంబునను సారె బరాబరి సేయఁగాంచి రో
సారసబాంధవుండు పరశైలముదాపునఁ జేరెనత్తఱిన్॥ ౪౩.

సీ॥ రవికాంతముల మంటరతిరాజు మదిఁ జేరె రతిరాజు కాంతిచక్రముల దూఱెఁ
జక్రసంఘము చెల్వుచాలఁ గల్వలమీఱెఁ గలువలనిద్రతమ్ములను గేరె
నలతమ్మిచెల్వంబు నెలపుల్గులను గేరె నెలపుల్గు కాఁకపాంథులను జేరెఁ
బాంథసంతతి యాశపరగ జారులఁ జేరె ఘనజారభీతి మానినులఁ దారెఁ
జకితమానినిమానముల్ సడలఁబాఱె। బత్తులెల్లను గూండ్లకై పరుగుఁబాఱె
నింగి లేసంజకెంజాయ నిగుడఁబాఱె। వెలితిచీఁకట్లు దిక్కుల వెడలఁబాఱె॥

మ॥ స్ఫురితాంభోరుహజాతభావము దయంపుంజోకలన్ దెల్పి యు
ర్వరకాకున్ మడిఁ బిట్టుపట్టు పగలుగ్రస్ఫూర్తిసూచించి సా

గరశాయిత్వమువాసరాంతమున వేడ్కన్ జూపఁజింతించియో
యరవిందాప్తుఁడు వేగ జేర్చెఁ దన మేనంభోధిమధ్యంబునన్ ॥ ౪౫.

## సాయంసమయాదివర్ణనము.

సీ॥ శరణార్థియై వచ్చునరుణున కెదురుగా నరుగు దెంచిన బాడబానలంబొ
కవజక్కవలమీఁదఁ గనలి దర్పకుఁ డేయు నాగ్నేయబాణసితాగ్రరుచులొ
సలిలేశుఁడిపుడ రాజకమంచు నస్త్రాద్రిఘుటియించు గండమంగళపుశిఖలొ
యినునివెంబడి నేగు దినలక్ష్మి యిడుకొన్న మేలిమిజాళువా మేలిముసుఁగొ
దినకరనిశాకరులు పాలు దీర్చుకొనఁగ । దిననిశామధ్యమస్థలంబున ఘటించు
తళుకుజిగి కెంపుఁబోలి మెరచలుపయో యనంగఁగనుపట్టెనపుడు సంధ్యావిభూతి॥

సీ॥ సాంధ్యరాగాన్వితచంద్రకాంతముఁ జూచి మవ్వంపుఁ డితఁడంచు మమతఁ బెంచు
నలిగరుమద్ధూతహల్లకరేణువుల్ గాంచి యాతపమంచు గారవించుఁ
గడకుఁబాఱఁగఁ దీరుఖద్యోతపజ్ఙ్క్తులు రవికరంబులటంచు రతి వహించు
మధుమత్తమధుకరీమాలికల్ బరికించి ఛాయాసతియటంచు సంతసించుఁ
గదిసి కాకున్నఁ దలవంచుఁ గళవళించు । దత్తరించుఁ జలించు నందతవహించు
నెగసియెగిలించుఁ బొంచుఁ గన్నీరునించు । వగ యెడఁద గాఁడి జక్కవ చిగురుఁబోఁడి॥

సీ॥ సమయపితృప్రసూసమవలోకాయత శమనసోదరి మేనిచాయలనఁగ
బహువిధతాండవభ్రమణవేగోద్ధ్వాంతహరకంఠగతహాలహలమనంగఁ
దారకాజనిత క్షతభ్రాంతినందిన కాకసీవోద్భవానీకమనఁగ
జలధిప్రవేశనసమయారుణత్యక్తరథరజ్జుకాలసర్పములనంగఁ
బథికహరణసముద్దండబాహుదండ । తోయరుహకాండరోదసీతూణనిహిత
నీలజలజాతసాయకజాలమనఁగఁ । గటికిచీఁకటిజగమెల్లఁ గప్పుకొనియె॥

సీ॥ బ్రహ్మయై యుదయించి భానుండులయ మొంద నెరసిన చతురబ్ధినీరమనఁగ
సమయంపుయవనుండు జాబిల్లికుపహారమొసఁగఁ దెచ్చిన చొక్కమిసిరియనఁగ
హరుఁడు సంజనటింప నతని మెచ్చి దిశాధిపతులిచ్చు గజచర్మపటములనఁగఁ
గవగూడియువకోటిఁ గలఁచ నేరనిసుమాంబకుఁ జెందు నపకీర్తిపంకమనఁగ
రాజకాంతోడుపథదండరాజరాజ । మానరోదసిచతురంతయానమునకుఁ
బరఁగఁ గప్పిననీలికప్పడమనంగ । నల్లనల్లనఁ దిమిరంబులాక్రమించె॥ ౪౯

చ॥ సులభముగాఁగ మన్మణి వసుప్రజమాఁగినవాని వంకవీ
నిలయమణీగణంబనుచు నింగిఁ దటాలున వాని యాదలన్
జలమునఁ బెట్టి పట్టుపిడి సానలనన్ గనుపట్టె దుర్దశా

కలిత తదగ్రకజ్జల నికాయమమేయమనోహరస్థితిన్ ॥ ౫౦.

## తారకోదయాది వర్ణనము.

సీ॥ అతివేలగగనలక్షితపతంగశతాంగకంఖాణఖురచంద్రకళలనంగ
గాఢతమోదంభకాదంబనికురుంబశకలీకృతమృణాళజాలమనఁగ
బరమేష్ఠిలిఖితసౌభాగ్యకారణనిశాలీలావతీఫాలలిపులనంగ
సాయమర్చాలిప్సుసకలదిశానీతసముచితస్ఫటికలింగములనంగ
రజనిముఖజాతతాండవభ్రమణవేగ। మండలితకీర్ణతరబంభ్రమత్పురాణ
శబరవరసామిపలితకేశములనంగ। విమలగతిఁదోఁచెఁదారకాసముదయంబు
సీ॥ పగలింటికాఁకకైగగనాధ్వగుల్ రచించిన తేటచదలేటిచెలమలనఁగఁ
బవమానవశతఁగల్పకసూనములనుండిరాలినపుప్పొడిరాసులనఁగఁ
గాదంబినీమార్గకేదారముననిండమొనపినవెన్నెల మొలకలనఁగ
వడిసావియరుకువిన్ బడిగంటబలుమబ్బుకొక్కుగుంపులకిడ్డకూలుకులనఁగ
సంజకెంజాయమెఱుపులజాఁదుకొనుచుఁ। గటికిచీఁకటికార్మొగుల్ గ్రమ్ముకొనఁగఁ
గనిభయంబునమానసంబునకునరుగు । కలికిరాయంచలనఁగఁజుక్కలువెలింగె॥ ౫౨.
గీ॥ కెలసినెలపుల్గుగములుగ్రుక్కిళ్ళుమ్రింగఁ। గ్రమ్ముకొనువచ్చువెన్నెలచెమ్మయేనఁగఁ
దాలుఁదెలుపుదోఁచెఁదూర్పునఁద్రుళ్లుమబ్బు। నుసురునకుఁజెట్టుబలితంపుటెసురువోలె॥
సీ॥ రమణఁగాలపుబోయరాజీవహృతికిఁజాచినవెండిగాలపుఁజివ్వయనఁగ
సమయకులాలుండుచక్రమెక్కటఁద్రిప్ప ంచుమహా త్తికదండమనఁగ
దటిపేరిమబ్బుతత్తడిరౌతుతామసావలినాంపనెత్తినవజ్రమనఁగ
వేళాజలదపాళివెసఁగ్రాఁగుకువలయంబారయనిడుసుధాధారయనఁగ
గగనతలమునఁగిరణమెక్కటియతోఁచె। మొనపెనావెంటనేరెండుమూఁడునాలు
గంతఁగ్రమమునమతికొన్నియధిగమించెఁ। జంద్రకిరణమ్ములీలీలసాంద్రగరిమ ॥
సీ॥ రేభర్తకుముదినీప్రియుఁడనిమొగమెత్తఁజేసెనోయనసంజచెలువుమీఱె
వరునిరాకకువిభావరికప్పనెఱిగొప్పుసవరించనఁదమస్సంఘమడరె
రాఁడాయెవిభుఁడనిరాత్రినించినబాష్ప కణములోయన నుడుగణములమరె
విటుఁడురానైదురేగువేడ్కయామినిగందమలఁదెనాఁదూర్పునఁదెలుపుదనరెఁ
బతియిడుతమిస్రనఖరేఖపగిదిఁగిరణ। మధిపుజాగున నిశయొల్లనన నళిరుతి। కినుకఁబియుబాయఁతుపయూర్పులనుదావలను। వెవకుతమిచూపనఁజకోరవితతిచెలఁగె

## చంద్రోదయ వర్ణనము.

చ॥ సమయపయోనిధిన్ బాడమిసర్వములోఁగొనఁజేరుకాలకూ

టముప లేఁజీఁకటుల్లనులుగడల్వేలసెక్కదను పేత ఫేనబృం
దముఁబలేఁదారకల్యావలిచె దానిగ్రహించు మహేశ్వరుండు నాఁ
గమలవిరోధియొప్పె మెడకప్పనఁగప్పెఁ గళంకమత్తఱిన్॥ ౫౭.

మ॥ జలజాతాప్తునిజోడు కోడెయగుటన్ జంద్రుండు దాఁబుట్టు ని
చ్చలపుం గెంపున బ్రహ్మభూయము వళత్కుస్ఫాగ్నినీశత్వమున్
దళుకుం గప్పనఁ గృష్ణభావమును దోనల్ దాల్చి సారస్వతో
జ్జ్వలదభ్యున్నతి నాని మించుఁగని యొన్ జంచత్కళాపాళియై॥ ౫౮.

సీ॥ కరసాన వికచపంకజనన శ్రేణికిఁ గమ్మడీఁదుకు వేలకాండమునకుఁ
జలువఁదెచ్చిన దీము చంద్రకాంతమ్ములకు గ్గుగిన్నె చకోరయూథములకు
సూతికాభవనంబు సురవధూరాజికి నాకర్షణంబు సుధాంబునిధికి
నరిపలాయనసూత్ర మరికదంబమునకు సంజీవకరణంబు శంబరారి
కనఁగఁ బొగడొందె మానినీజనవితాన। మానసానూనసంధానమానవార్ధి
దానసంశోషణకళానిధానఘనవి। ధారఘువరుఁడు మింటసుధాకరుండు॥

మ॥ ముకుళత్పంకజపుంజగర్భములు సంపూర్ణేందు భీతిన్ దమో
నికరంబుల్ వడిఁజొచ్చి యందరుణకాంతిన్ గాంచి డాఁగంగ నే
గుకడన్ దొంగల చేతిబాధయనుచున్ గూపెట్టు చందంబునన్
బ్రకటంబయ్యెఁ దదీయగర్భగతశుంభద్భంభరీఝంకృతుల్॥ ౫౯.

మ॥ రజనీకాంత వియత్తలంబు చవుటన్ రక్క్యాల్పు దీపాళిసిత
ధ్వజకాదంబము మంచు పేరరవబర్వన్ నిండుజాబిల్లి పూ
రజపుంగుప్పను నత్తమిల్లి పొదలన్ రాల్నున్న పెంధూళి రీ
తి జగా వెన్నెలమించెఁ బాంథజనతాదృగ్బాష్పసంపాదియై॥ ౬౦.

గీ॥ చుక్కకొవ్విరి మేల్కట్టు చొక్కటంపుఁ। జవలు చవికలొ చంద్రికా చంద్రవదన
చెలువు పై కొనజాఱువిచ్చిన్న హార। గళితమణివారమన హైమకణములొలసె॥ ౬౧.

సీ॥ అరివర్గవర్ధనం బనుచితంబనుచునో యలజక్కవల తాపమార్పదయ్యె
సద్వస్తుబయలు బుచ్చంగ రాదనుచునో రిక్కగుంపుల నేర్పరింపదయ్యె
రాజచిహ్నమడంపరాదు గానను చునో కలువ నెచ్చెలి కప్పఁ గప్పదయ్యెఁ
బంకజోజ్జృంభణ బాగుగాదనుచునో యెసఁగఁ దమ్మికి మోద మొసఁగదయ్యె
నననిఖిలలోకములకు శైత్యంబుఁ గూర్చి। యడరి వస్తుల నెల్లఁ గన్పడ నొనర్చి
నలుపులను గప్పి విరులకుఁ జెలువు గుప్పి। వెలసెనిస్తంద్ర చంద్రికావిలసనంబు॥

# పంచమాశ్వాసము.

## వెన్నెలవచనము.

మఱియు నప్పుడు వెన్నెలనిజనాయకసందర్శనానందకందళితబాష్పజల బిందుసందోహాస్పందితంబులగు నయనంబులచందంబున నందంబులగు నమలదమరందనిష్యందంబులఁ గ్రందుకొను నిందీవరబృందంబుల సందులసందడించునిందిందిరవారంబుల ఝుంకారంబులు శిశిరకరుండుకరఖరనఖర శిఖరంబులంజులుకంటఁగవజక్కవనిక్కఁగబ్బిగుబ్బలునొక్కఁతఱి వెడవెడఁబొడముసీత్కారంబుల వడువునఁగడలుకొనఁ బరవశయగు నిశా విశాలలోచనచెదరఁబాఱిననెఱికురులందవిలికొను క్రొవ్విరులసంచునమించు తరుచ్ఛాయలమించుగలపొడవెన్నెలలు తాప నివారకంబులగు పటితకోరకంబులనియేఱుకొన గమకించి చేతికిఁదగులకున్న విన్ననగుముగుదకన్నెలఁగని ప్రకాపకనవ్వుప్రౌఢజవ్వనులఁజేరజపుటారజపు నవ్వులపేరఁ బెడబొబ్బలిడు వెడవిలుకానిధాకలఁగుందుడెందంపు టరవిందంబులఁబొడమిన వియోగాగ్నిపొలుపుఁదెలుపుపొగలవగలఁగనుపట్టు చట్టంపువెట్టనిట్టూర్పుదట్టంబులెచ్చటంజొరసందులేమిఁదమకుడొకారంబుఁజొచ్చు కటికిచీఁకటిబాగునమెలఁగలోఁగొనునిగనిగలతొగలమగలని వగలవెగడు విటులమొగములనల్లనల్లనవెల్లివిరియువెల్లఁదనములతోనల్లిబిల్లిగాఁగలసి యుల్లసిల్లుచు, సుధాకరుండుచెంగలువకేదారంబులకుఁ దీర్చినతేటపన్నీటికాలువలజాలువలె ధళధళనివెలివెలుంగుచలువలజలజలనఁ దొఱఁగు సలిలములు జొట్టినీరుచిచ్చుగొని యంచులసంచరించు రాయంచబోదలవాకుగాముక్కునఁ బక్కఁపక్కునఁబొడువనొక్కించుకవిచ్చుమెట్టనెత్తమ్మిమొగడలవెడలుకట్టావివెట్టుగిలిపొలయలుకఁగలికిచిలుకలకొలుకులుమనములు బెగ్గడిలఁజులుకంటఁబొలసి వారలయలుక లపనయించి ప్రాణనాయకులంగూర్చిరతాంతతాంతలగు నాకాంతల కుచలికుచంబులంబుట్టు సన్నచెమటలఁబదునైన సారఘనసారగంధసారచర్చలసేదఁదేఱి మధుమత్తమత్తకాశినీ వదనవాసితాసవంబులు వారలుపతులతోడఁ గూడిపొత్తారగించిలాహిరిఁగొని పథికయువజనముల మీఁదనిగుడి శిశిరసుఖంబులగుటవారిహృదయంబులఁగ్రమ్ముకొనినమదనాగ్నిఁ బైఁకినెగయించుజాడఁదదీయబాహాంతరస్థలస్థాపిత కహ్లారదళపుటాంతరస్థగితసరాగపరాగపుంజంబులరేఁచికొనుచు మీఱినమలయవలయనిలయూనిలాంకురంబులనెక్కి వియోగులపైదండు వెడలు నుద్దండుండగుకుసుమకోదండుండొకర్ణాంతంబుగాఁదిగియు నెడముష్టిబిగువున వెడలురసదాళి చెఱకు

వింటిరసముతో నెయ్యమున వియ్యమందుచు నత్యంతసౌహార్దంబులుగల వారలంబోలెనతిత్వరితగతిజలకములువట్టి చలువలుగట్టనిచ్చి యిష్టాహారంబులసంతుష్టులంజేసి గంధసారకస్తూరికాదివిలేపనంబులనలంకరించి కపురంపువిడియంబులొసంగి పాదసంవహనాదికంబులఁ బతులనిదురవుచ్చిగమకమ్ములగు తమకమ్ములు తమకునెత్తులువెట్ట నలఘుతరసాహసైకసహాయులగు తాపికస్త్రియలదాఁపుల సంకేతస్థలంబులకుం జేరి యంతకుమున్న యచ్చట నిలిచి తమరాకకెదురుచూచుచుఁ జందమామఁజూడుచునాడుచున్నుండు ననుంగుబోజుఁగులంగని యుప్పొంగి సరససల్లాపంబులంగొంత తడవుప్రౌఢ్దుగడపి మదనకదనపరాయణలై యాలింగనాధిక్షేపణకేశాకర్షణచుంబనమణితరణితాదికంబులన్ జొక్కి రతిసల్పియంతసురతాంతతాంతలై యెడఁగలసి యన్యోన్యనఖక్షతాలోకనముల నితరేతరమధురాధరక్షతసందర్శనంబులఁబరస్పరసురతవైపరీత్యవైయాత్యపాండిత్యకథనంబులనిరంతదురంతరతికాంతసామ్రాజ్యంబేలుసట్లుఁరి పెఱమగలచే నంపించుకమఱలు నపుడు భయంబుగదిరినమనంబుల బెదరి బెదరి నలుదిక్కులఁ గనుంగొనుచు వచ్చుతఱి వెంటవెంటవచ్చునిజచ్ఛాయలంగని తమ్మనంతనంతఁజూపెట్టుకవచ్చునొంటనితమ్మికంటులని యప్పట్టునగట్టువాతనంబులు గనుపట్టతమనేరిమివారిపైనారోపించిచిక్కితిరిమాచేత నింకమిమ్ము నాగడమ్ము సేయకవిడువమనిపెదపెదమాటలాడు సమయంబున నప్పలుకులాలించి భటీనంజనుడెంచుతలవరులంజూచి తెలిసితప్పించుకొనన్ వలంచి కల్లుఁద్రాగుడుజగరాగజంతలజాడదోఁపమునుపటియట్లపలుమఱుంబలుకుచునాడుచునందందుకుఁ బాటఁబాడుచు వారింగికురించిమెల్లమెల్లననిజగృహంబులంజేరి జారచోరాహ్వానమంత్రంబులకరణి మెఱయు గుఱుకలనాడవెలుంగక నిదిరించునాయకులప్రక్కల గ్రుక్కుమిక్కనక పవళించి విటకృతనఖక్షతాదికములు పతులకుఁదేటపడకుండమఱుఁగువెట్టుందలంచినిదురమంపునంబలెనట్టునిట్టుఁ బొరలివారలలేపిచెన్నకితమిరేఁపివారు మాఱుఁజెనకిన మునుపటివన్నియును వారిచేఁతలుగానెన్ని యపుడు నడుపు కుచాదినఖక్షతాదికంబులన్నియుం జూపి పెద్దలుగన్న నేమందురోయనక నిటువలెదుండగంబులుసేతురా యనుచు బొమలుముడుచుకొనిపేకినుకఁబూనుతమ్ముఁదిలకించి తమసాశీల్యంబులకుమోదించి మదిమెచ్చుచు నేటికిమానేరములు మన్నించిదయఁజూడుండనిపాదప్రణామంబులుసేయు విభులననుగ్రహించుట సూచించుటకుంబోలె

వారియవివేకంబులకునవ్వుయిత్వరీజనంబులనవ్వులతో మవ్వంపుఁ జెలిమిఁబూ
నుచ్చుగగనమను నేడాకుటనఁటిచప్పరంబున నుప్పరంబెగసి తెప్పలుగా నా
ప్ప రాలుకపురంపురజంబులసరణి సమయ మాయానారాయణి నెలఫ్రులుఁ
గుపలుకుచిలుకనూఁకలబంతిసాగించి వడ్డించుధారాళమధురసుధారసధా
రరీతిఁ బగలుఖరకరాలోకసంతప్యమానదేహలగు దశదిశావరారోహల
యవయంబులనలంమచందనంబుఘాతివిజృంభించె నయ్యవసరంబున॥ ౬౩.

## వెన్నెట సీమంతినీకాంత యలయుట.

క॥ రాకాకోకారివదన । చీకాకై కానఁబడినచిత్తాబ్జమునా
ళీకానీకాతిధిమా । ర్వీకానేకాస్త్రశస్త్రవిదళితమైనన్ ॥ ౬౪.

ఉ॥ సీయను దైవమారమెటు జేసెననున్నగుబాటువచ్చెనా
హాయను నెవ్వరింపుకుసహాయమునన్ గడతేరుటెట్టులో
కోఁయను దీనికింతయనుకోవలెనాయను జీవమింత తీ
పాయను నిప్పుడుందెగువఁబాసినలోకమునవ్వదే యనున్॥ ౬౫.

క॥ అనితనమనమునఁదమకము । ఘనఁగొనఁగాఁజాఱుఁబైటబిగియించితటా
లునఁదెలివెన్నెలబయలికిఁ। జని జీవితవాంఛవిడిచిసఖులుదలంకన్॥ ౬౬.

సీ॥ కనుమొఱంగకదృష్టిఁగంజారిపైనిల్పి గెలివిమైవికచపంకేజవదన
చెనుఁజూపకెదిరించువెలికిగప్పినగాడ్పు మొలకకుఁదెగువనంభోదవేణి
యొకయింతచాటుఁగోరకవెన్నెలకెదుర్చుఁగోదకకచక్రవక్షోజయుగళ
వాయోడకనదర్చువరకీరడింభము నతిసాహసమునబింబాధరోష్ఠి
యుసురుఁదెమ్మెరలీమేనమసలుచునికి।నకటవలరాచవిచ్చుఁజల్లార్పఁదరమె
యనుచునుసురసురనుచునత్యంతపరమ। పావనగుణాఢ్యపున్నాగపదముఁగదియ॥

క॥ అటువలెఁదెగువకుఁజొరఁబడు । కుటిలాలకబిగిచిపట్టికొందఱుచెలువల్
నిటలాలకములుచక్కఁగ । ఘటియింపుచుఁదోడితేరఁగా నచ్చోటన్ ॥

మ॥ నెలఱా తీనియ మేనుఁజేర్చికలకంఠీరత్నమేడ్చెన్ వదా
కులకాషాయవిలోచనాశ్రుకణముల్ గుప్పించిచన్గబ్బిగు
బ్బలఁజిత్రింపఁగ నాత్మమానసపథప్రాణేశసంరోధని
శ్చలకందర్పశరాసనస్థిరతరజ్యాజాత నాదంబునన్ ॥ ౭౦.

క॥ అనుగుంజెలియపుడొక్కతె । కనికరమునఁజేరనరిగికనుఁగవఁదనమా
త్తనివలిపెచలువపయ్యెద । కొనకొంగునఁదుడిచిముడిచికురులిట్లనియెన్ ॥

చ॥ నడుపకుమమ్మ యీతెగువ నాయముఁదక్కి కులస్వభావము

ల్గిడపకుమమ్మ నీదుసరిలేమలుజూచి నగంగఁడాల్చి వే
రడపకుమమ్మ చన్నుఁగవయందపుగండపుఁబూఁతయంఘ్రిలన్
దడపకుమమ్మ కాఁకఁబడితల్లడమందకుమమ్మ మ్రొక్కెదన్ ॥ ౭౧
క॥ అనిబుజ్జగించియొయ్యన । నెనరంటినమనముతోడ నెచ్చెలిపలుకుల్
దనలోఁ గుములుచు నీమం। తనిపైనిగనిగవెలుంగు నెలఁగనిపలికెన్॥

## చంద్రదూషణము.

మ॥ రవిఁ దీవ్రద్యుతియంద్రుడు పావకుని నారా మంటమారంద్రు వా
రివిధంబుల్ పెనుపంజుక్రిందిదివియల్ రేరాజ నిన్నెన్నుచో
నవునాఁడావక తేజమేర్పాకసమీ యజ్జ్వాల్పఁడబ్ధింబడున్
భవనంబుల్ వడిఁజొచ్చునిచ్చశిఖిదీపశ్రేణిదంభంబునన్॥ ౭౨.
సీ॥ తనువెండితోడుబంపెనాదక్షజామాతయఖిలలోకైకసంహరణగరిమఁ
బాలువెట్టెనొపట్టఁబడికృపీటభవుండుకల్పాంతభవదాహకరణమహిమ
దాఁచఁబెట్టెనొహార్ధిఁదలుచుచోమిత్రుండుకరశైత్యసముదగ్రగౌరవంబుఁ
గైకొన్కఁజేసెనో కనిపూర్వశైలంబుకఠినతరాకారగర్వపటిమ
బాళిబంధుతమైత్రిసద్భక్తిఁజంద్ర । యటులగాకున్ననిట్టిసంహారణదాహ
కరణకరశైత్యసాతత్యభరణకఠిన। తాచరణశక్తినీయందుఁదనరుటెటుల॥
క॥ హరునఱకాలంజొరఁబడి । శిరమునకున్ వెడలెనీదుసితఖండముచం
దురయదిసెలవడినేఁడున్। దొరఁగెడుఁబులినీరు గాంగతోయముపేరన్॥
చ॥ అమృతకరుండవంచునినునంటసుధాకరుఁడంటనేతద
ర్థమె యటులైననీకరముతాపముఁగూర్చునెదానికన్యప
క్షమమృతకారికాఁడనుటకాదు వియోగులనీవుచంపుటన్
క్షమపయినింతకన్నమృతకారియెలేఁడనియంటచంద్రమా॥ ౭౩.
గీ॥ గంగయొద్దున నుదుపాళిగడపఁజాలి । యలరుతలబోయతలమిన్నవైననీవు
పుడమిరామోపకారివై నడచుటుచిత। మెడసిరామాపకారివై నడువఁదగునె॥
ఉ॥ ఓరిమృగాంక నాజడకునోడినరాహువుకెన్కనంకమున్
జేరవిసంబునీయొడలఁజేరఁగఁగోరలకొద్దినొక్కెదు
ర్వారనిజత్వదీయకరవారవిషంబులనొంచసాగెఁబె
న్వేరముఁబూనియిప్పుడిదినీదగునేతగఁజూడకెమ్మెయిన్॥ ౭౪.
మ॥ ధరచక్రద్విజవైరమూని గురుకాంతంగూడి కల్నీళ్ళకున్
కరముల్సాచి సరోజినీచ్ఛదనరేఖాజాతరూపాహృతిన్

గరమొప్పారి మధుప్రియాంగభవసాంగత్యంబునన్మించి ని
ష్కరుణన్ గ్రుమ్మరునిన్నుఁ జూడనఘమౌఁ గాఁబూర్ణదోషాకరా ॥ ౯౯.

సీ॥ ఘనఖరాహవముఖంబునసంచలించి సారస్వతప్రాప్తవర్ధనముఁ గాంచి
నక్షత్రవరవర్తనములఁ జెంపువెలార్చి యుత్పలోత్సవవృత్తినుదుటుమీఱి
యయుతభైరవవితానాతిశాత్రవమూని చక్రద్విజాసహ్యాచర్యఁబూని
యలమహానటవతంసాచారములఁబొంది నిజకళాదఖ్యాతినెగడుఁజెంది
తగుకళంకివియించుకదాతవగుట । రాజవనుచునుమఱిద్విజరాజవనుచుఁ
బలుకుటనుగాదెయేటువంటిప్రాజ్ఞులైన । కవులకెంతయుఁదిరిపెముల్దవిలియుంట ॥

చ॥ అవనిభవత్కళాది విజయాధికశక్తులుమాకుఁదెల్పనీ
దవుద్విజరాజభావమునకర్థముతేటపడంగద్వంద్వసం
భవమనికాకయున్నఁగనుపట్టునెఁచీకటితప్పసేఁతపు
ట్టువుఁగలనీకళంకముముదుంగకనావటమైసుధాకరా ॥ ౧౦౧.

మ॥ అకటా నీరజసూతిశ్రీహరికిజ్యేష్ఠాపత్యమైమేనమా
మకుగండంబుగఁబుట్టినన్నజనులాత్మన్మోదమందంగనో
ర్వకజైవాతృకుఁజేసెనిన్నునతఁడేఁపఱదన్నునాయొచ్చమొం
డకయుండంగసుధాకరా విరహిణీదౌర్భాగ్యమే శాంతిగన్ ॥ ౧౦౨.

గీ॥ అయ్యమాదర్శనంబునీవందునపుడు । అయ్యమాదర్శనంబునీవందితనుచు
నయ్యమాదర్శనముచల్లనయ్యెఁజంద్ర । పూర్వమగుపక్షమిటుడించిపోవుకతన ॥

వ॥ ఇప్పగిది నిందించుచు వేదనాదోధూయమానమానసయగుచునున్న యెడ ॥

క॥ వెన్నకుఁబన్నులువచ్చెన । నన్నెలధవళకిరణరదనమ్ములమేనె
ల్లన్నమలెనశేయనియ । కన్నియనాకసకియచేరిగారవమలరన్ ॥ ౧౦౩.

గీ॥ ముక్కుపచ్చలారకెక్కిచకోరంపు । నిసువుమెసవుకరమునిశితమనుచు
నేకువాఁడిచేసియిపుడేలపలికెదు । వీనివిధముఁజెలియవినుముతెలియ ॥ ౧౦౪.

మ॥ పవనాశ్వంబుహరింపఁగా మనుజటాపాళింజగత్ప్రాణమౌ
త్రివిరోధించితదశ్వమున్గానియె నీ రేఁప్రొద్దుదానిన్మొదన్
దవులంగట్టిఖవీధిద్రిప్పివడినాతండబ్ధిఁద్రోయింపనీ
నివెసన్ వచ్చెనొకాక రాజెటులఁదీండ్రించునృగాంకంబునన్ ॥ ౧౦౫.



### మన్మథదూషణము.

చ॥ అనియొకయింతనెమ్మదికిహాయిజనింపఁగఁబల్కునెచ్చెలిన్
గనుఁగొనివానిఁబోవిడిచికందినెపంబునవీనిఁజేరితా

ననయమయోగినీజనమహంకృతిఁబాపఁగబోధసేయునీ
మనసిజుఁడంచునల్కఁబొడమన్ జెలిమారుగుఱించియిట్లనున్॥ ౭౭.

మ॥ అకటా నిద్దగట్టార్పఁగంఠగతసర్వానీకముంబంపువె
ట్టకనీనెచ్చెలినెచ్చెలిన్ దన లలాటజ్వాలిఁబంపెంబురాం
తకుఁడెంతేనదిచంపుఁజంపదనిడెందానన్విచారంబుఁజే
యకసర్వజ్ఞత నేతిబీఱగతినస్వర్థంబుగా మన్మథా ॥ ౭౮.

మ॥ భ్రమసర్వజ్ఞుఁడువేదబాహ్యుఁడనుటల్ భావించిచూడన్ జదీ
యమతంబాగమసిద్ధమాకతననానా లేకసర్వజ్ఞుఁడా
త్మమహోఫాలశిఖిన్ బశూభవదమందత్వద్వపన్ వ్రేల్చిసాం
తముగానిష్టి యొనర్చునే తలఁపనాత్మప్రీతిగా దర్పకా॥ ౮౦.

క॥ లలిఁగొప్పెక్కించితిమధు । పుల శుకుల నడుగుపఱచితి పుష్పాస్త్రా మా
లలకునుమంపంబులు వా । పలకును పీఁటలనుమాటబళినిజమయ్యెన్॥ ౮౧.

క॥ కలవారిబిడ్డవైనన్ । గలిగిభుజింపవలేఁగాకగర్వించి యనా
థలనేపుడురే మదనా । మలయుచుమతిసేదుమదముమంటంగలియన్ ॥ ౮౨.

ఉ॥ పుట్టినతావులంజెఱుపఁబుట్టినమాత్రననహ్నిసామ్యమే
పట్టునఁజేయరాదతఁడుపట్టినఁగానిదహింపలేఁడుకే
ల్మట్టకఁగాల్పఁజాలుదువులోవెలినేనుఁగుదోమవాసియా
గట్టిగనీకునాతనికిఖండితకాముకదర్ప దర్పకా ॥ ౮౩.

క॥ నీయాశరజాతికిసరి । యైయుండెడుమాధవుండుహానినునావ్వన్
జేయకకూడుటయదిగా। దే యబలలపూజ యాదిదేవతనూజా॥ ౮౪.

సీ॥ హామహాదేవారివగుచుఁగ్రుమ్మరునిన్నుదండింపఁడేలకోదనుజహంత
మధుసహాయమునఁబల్మాఱుఁద్రిమ్మరునిన్నుమడియింపఁడేలకోమధువిరోధి
గ్రహరాజమిత్రతఁగాంచిమించిననిన్నుఁవాడింపఁడేలకోదైత్యభేది
యాదిమరుద్వృత్తిహంకరించిననిన్నుసదలింపఁడేలకోయసురవైరి
శిష్టరక్షణంబుదుష్టశిక్షణమును । నతనిబిరుదమునకునమ్మచెల్ల
యాత్మజాతమోహమాదేశమయ్యెనో । యేముసేయుపూజయోమనోజ॥

మ॥ అకటా యోరిమనోజ నీజనకుఁడాహాపుట్టునిర్భిన్నరే
ణుకరైనట్టికృపాణినీకొసఁగినిన్నున్ సంప్రదాయంబుఁద
ప్పకయుండన్నడిపింపఁదవ్విధముదెల్పన్నోపలుఁగాకున్నని
ట్టికృపాహీనతచిత్రమట్టిబలుపట్టింబందిఖండింతువే ॥

క॥ సరసిజనయనలఁదఱమెదు । కరణిందలుమ్సఁగ రొందుగాఁగాయజశం
కరునింబగఁగోననిన్నా । పురఘస్మరుఁడింత బూదిబొట్టుగఁ జూడక॥ ౯౮.

సీ॥ అవివాహమున నమించు నగ్నిభట్టారకు స్వాహావధూటితో సంఘటించి
పరమహంసస్ఫూర్తిఁ బరఁగు భాస్కరునకు ఛాయాలతాతన్వి జాయఁ జేసి
దండియై ధర్మవర్తన నుండు యమునకుఁ గుంతీలతాంగిపైఁ గూర్మిఁ జేర్చి
పాశుపతఖ్యాతిఁ బ్రబలు మృత్యుంజయు నవనీధరతనూజ నంటఁ బెనచి
కెరలి యీలీల ననుచితక్రియల నడుపు । నీకు నేఁడకటకట నిర్నిద్రగరిమ
భువనజాతవిరోధియు బోధఁ జేసి । వెంటఁదిరుగంగ నుడుగుదు వేమనోజ ॥

చ॥ హరి యుదరానఁ బుండువలె నంగజ నీవు జనింపఁ గ్రొంచభి
ద్ధరుఁడను వెజ్జుఁ జేసి కనుకుంపటి మంటలఁ గ్రాఁగుఁ జూపు గ్రొం
బరుసపుఁ గ్రోవలూఁది ననుమానక వేసెలవారితత్ప్రభూ
దరగత లోకమంటి వెతఁ దార్చెదవంయకుమందుబుట్టమిక ॥ ౯౯.

### మలయమారుతోపలంభనము.

వ॥ అనుచు మదనునిందించి తదీయవాహనంబగు మలయానిలంబుపైనలుకపొడమి॥

చ॥ తనువనిచూడ కెంతయు సదాశివుఁడష్టతనుండు నిన్నుఁ బా
యనిరుపఁ జూచి పాంసులుఁడవంచుఁ గదా యహికోరపాలుగా
నానరిచె నిర్దయుండగుచు నాచ్చెమువచ్చినఁ బండితోత్తముల్
దనువుఁ బరిత్యజించుటుచితంబగుఁ గాదె సమీరయారయక ౧౦౧.

మ॥ అతనుస్యందన గంధవాహ విరహవ్యాలోలబాలాపురా
కృతదుష్కర్మపుజీవనౌషధము శక్తింగాక నేజెల్ల నే
గతినీకుం బ్రతుకంగవచ్చు భిదురోగ్రస్ఫారధారాముఖో
ద్గతిఁ గాలాహిముఖాగ్నికల్పగరసంతాపంబులక్ మ్రగ్గక ॥ ౧౦౨॥

ఉ॥ దయ్యము వేఱు పేరుకుచితంబగు సోఁకుడు సోఁకు సేఁతలో
యొయ్యనఁ దెల్పఁ బాలుపడియుండుఁ బ్రభంజనశక్తియుండఁ గక్
దయ్యమనంగ వేఱెకలదా ధరనొక్కటమమ్ము నేఁచఁ గా
దయ్యమవీవ భీరుజనదారుణకారణ యో సమీరణా ॥ ౧౦౩.

చ॥ కలువలవిందు నెన్నడిమికందు నెపంబున నేఁడు బూదిలోఁ
గలయు మనోజు మేనియెముకల్ల లితున్వర పేరనీచతక్
గిలుబుచుఁ దోడుబోతుగతి గిట్టినవానిఁ బిసాసిఁ జేసి బా
లలపయి బంపు పెట్టి వెతలంబరుపందగునా సమీరణా॥ ౧౦౪.

క॥ మునివాహనుఁడై నహుషుం । డనుభూవరుఁడుఁదొలుత భవదాహారముగ౯
మనుగతిశుకవాహనతం। గనుమరుఁడున్నిన్నుఁగోరిలఁగలఁడుసమీరా॥ ౧౦౫.
ఉ॥ చక్రిసుతుండతం డహితచక్రివినీవు కుమారగుర్వస
హ్యాక్రమఁడాతఁడీవుపరమాప్తకుమారగురుండ వాహతా
ప్తక్రుధశంబరుండతఁడు పాలితశంబరవాజివీవు న్యా
యక్రియఁ బాయసేయకుమనా పవనా హరిసూనుసంగతుల్॥ ౧౦౬.
మ॥ బళిరే చంప వహింప నొంప వెఱపింపంగోరి సర్వజ్ఞ ను
జ్జ్వలదేహంబులలోన నొక్కరుఁడవై వైశ్వానరస్నేహివై
జలజాప్తోద్భవమందిరాలయుఁడవై సామంతమాంసాశివై
వెలయంగోరుటలెల్లఁ బాంథజనవిద్వేషార్థమే మారుతా॥ ౧౦౭.
గీ॥తొలుతజగమొంటిఁజనిమంటఁగలుపునీకుఁ। గొంపజెఱుపరిపొరుగునుగూడెనిప్పుడు
కొంకయొకయించుకయులేకనింకనెన్ని । కొంపలెత్తించనున్నావొకో సమీర॥౧౦౮.
క॥అనిమదిఁజింతిలుసీమం । తినిచెవులకునింపుసొంపు నిపుణోక్తులచే
ననుఁగుఁజెలుల్ చెలిఁగరుణిం। పనిమరుబలములకునయ్యుభయముందోఁప౯॥
సీ॥ ఘనకైశ్యయనినీవుచెనకరాకుసమీర భుజగరోమావళిపుప్పుఁబోఁడి
మీనాక్షియనినీవుమీఱకుకోకంబ చంద్రికాహాసయీచంద్రవదన
బింబోష్ఠియనినీవుబెదరింపకుశుకంబ సాంకవామోదయీసన్నుతాంగి
కంజాస్యయనినీవుకలహింపకుమృగాంక స్వర్భానువేణియీవనజపాణి
శ్వాసవచనాస్యవక్షోజబాంధవముల । బంధువులుగానమీకుఁజెప్పంగవలసె
నట్లువినకయున్నఁబరువులిడుటయొగరి । పడుటవదరుటకందుటఫలముసుమ్ము॥
వ॥ అని పలుకుచుంజేరి తమలోన॥ ౧౧౦.
మ॥ మరులెచ్చంగడునొచ్చునెచ్చెలియ నీమాటెల్లఁబోవిడ౯స్వయం
వరమందిచ్చకువచ్చునాథు నిజభావార్థిస్వయంగాంచిసం
స్థిరపుంబ్రీతివహించి తేపె సుఖవార్ధిందెప్పలందేలునం
చురయంబొప్పఁగశైత్యవస్తువులురాసుల్ గూర్చియొక్కన్నడి౯॥ ౧౧౧.
సీ॥ విరహాగ్నికీలలువెడలిపైపైనిండుకైవడిఁదోఁపఁజెంగావిఁగట్టి
యాదలకెక్కుమోహపుచేటిసురువులసరణిగన్పడవేణివిరులఁజుట్టి
వడిఁగ్రుమ్మువిటగినవలరాచకరికొమ్ముగతిమించబిసముఁజన్గవఘటించి
మదినున్నపతిఁగూడనాదవుఘర్మజలంబుపసఁగాంచుగల్వపూరసముఁజమిరి
వెన్నెలబయళ్లఁదొట్టుబల్వెట్టఁబుట్టు । బొబ్బలడఁగంగఁబూసినబూదిపోల్కిఁ

బాదలఁబన్నీటఁ మెదపుపుప్పొడియలంది । చెలులు శైత్యోపచారముల్ జేసిరేలమి॥ ౧౧౨.

## వేకువవర్ణనము.

ఉ॥ ఆయెడఁబంచబాణసముదగ్ర సమగ్ర జయోగ్ర దోస్సమా
ఖ్యాయితచిత్రసేనతనయాతనుసంభృతపాండిమాహృత
చ్ఛాయతఁబోలెనెంతయునుజక్కవలొక్కటజోడుగూడ వే
వేయురియాడఁ దోఁడ రహిపీడె వినిర్మలసాంద్రచంద్రికల్॥ ౧౧౩.

సీ॥ జలజాప్తమందేహసమితిఁజూడఁగఁగోరిచనుదెంచునారదమునియనంగ
నీరేజసంభవాకారంబుననుదోఁచురవిఁజేరనిల్చుశారదయనంగ
ధవుఁడైనలోకబాంధవుఁగూడిరతిసల్పిచనుదెంచు సితసరోజినియనంగ
ఘనకళంకినిఁజంద్రుఁగనకుండఁజాటుగా నరుణునకిడువెండిహరిగయనఁగ
వెన్నెలముసుంగుదొలఁగమేల్పొన్నతూర్పు। కలునకంటివజ్రంపుముంగరయనంగ
జక్కవలుగేరఁగలువలచెక్కుజాఱఁ। జొక్కుతరమైనవేగురుజుక్కపొడిచె॥

మ॥ ధరణీశ్బాణిని నెత్తఁబట్టె నాకసూత్రంబేర్చితొల్దొల్తమ
ద్వరకంఠప్రభవస్వరంబనుచు తేవంజంకదాటించుచున్
గురుకంఠస్వరయుక్తిమైఁదగవెసన్ గోయంచుఘోషించు వై
ఖరిఁబుంజుల్క్రొఅసేన్ ద్రిలింగగతిఁజెక్కసారెకల్లార్చుచున్॥ ౧౧౪.

చ॥ తనపతి రాఁగలండిపుడుతామరచూలివిధంబుఁదాల్చియా
తనికడకేగుచో నతని తన్వివిధంబువహింపఁగావలెన్
పనకనిపల్కుచేడియవిధంబు వహించె శుచిప్రవీణతన్
గనుప్రభలేనిచో సితముగైకొను చెట్లుప్రభాతదీపముల్॥ ౧౧౫.

మ॥ పతియస్తంగతుఁడైనచో ననుగమింపన్ యుక్తమేపట్టునన్
సతులౌవారికినంచుఁజంద్రుఁడుసనన్ దారప్రభాతాగమో
న్నతసంధ్యారుణిమచ్ఛలాహితచితిన్ వార్లెన్నిజంబట్లుగా
నితరేన్ జంద్రుఁడుగ్రుంకఁగన్పడకయున్నే తారకానీకముల్॥ ౧౧౬.

శా॥ కోకోక్కోరతిశాస్త్రచర్యయనుచున్ ఘోషించుచందంబునన్
గాకోక్కోయనికూసెఁబుంజులుమెఱుంగుంజుక్కలేలాలకున్
గాకోక్కోయనవేగుఁజుక్కపొడిచెన్ గ్రుంకెన్విధుండేది ది
క్కోక్కోకోమలకైరవాళికనఁగా నుద్యత్ప్రభాతాగతిన్॥ ౧౧౭.

మ॥ వనజశ్రీలహరించియేగుచుఁ దదావాసంబులజ్జారతాఁ
జినుమంటల్ దవిలించెనాఁ గొలఁకులొప్పెన్ వేకువన్ సంజ చా

యి నభోవీథిని తేఁట్లు దోఁచెఁ బాగ చాయన్యానిసీడల్ భయం
బునఁ బాతాళము దూఱఁ బాఱెడు తమఃపుంజంబునా రంజిలన్। ౧౧౯.

## ⟶ సూర్యోదయ వర్ణనము. ⟵

సీ॥ మొనకట్టు నెత్తమ్మి మొత్తమ్మునకు రచ్చపట్టు రమానభూపరివృఢునకు
దారికట్టు కువేళపళకదంబమునకు నడ్డపెట్టు సీసాంకకాంగనలకు
వాకట్టు నెలపుల్గుమూఁకకుఁ గెంపుసాపటబొట్టు ప్రాగ్దిశాపద్మముఖికి
గనకట్టు కౌశికఖగసముత్కరమునకాటపట్టు త్రయీరహస్యమునకు
నాలమునగిట్టువీరులకమరరాజ। పట్టణము మెట్టుజాలువాపసిఁడి మెట్టు
పెట్టుజిగిదొట్టు చనుపోల్కి పెట్టుచుట్టు। మట్టిమెడఁ దోఁచెఁ దొలిగట్టుపట్టుతుదను॥
మ॥ అతినిద్రంబడి లెమ్ము లెమ్ము నెడిచాయం దొంటి లేఁదెమ్మెరల్
రతిఁ గూపెట్టు రథాంగజాతి రుతిపేరన్ జేరి మేల్కొల్ప నా
యతపద్మేక్షణమాలికల్ దెలచిభృంగారావదంభాచ్యుత
స్తుతిఁ గావించి ప్రభాతవేళ జిగిమించున్ బద్మినీసంఘముల్॥ ౧౨౧.
మ॥ సరసీజాహితుఁ డొక్కపక్షమున భాస్వద్యోగపారీణుఁడై
పరిపూర్ణద్విజరాజభావము వహింపం జూచి చక్రౌఘముల్
పరిపూర్ణద్విజరాజభావము వహింపంగోరియో తామన
స్వరబోధంబున మించె వేగుతతి భాస్వద్యోగపారీణతన్॥ ౧౨౨.
చ॥ ఇనుఁడరుదెంచు వేళయని యింపుజనింపఁ బ్రభాతవేళఁ బ
ద్మినులు మిళిందగానములు తేటపడన్ వడిఁ గేలనెత్తు కాం
చనపరికీర్ణపూర్ణకలశంబుల నంగను పట్టిమించె నూ
తన వికచాబ్జపత్ర సముదంచిత యోగ రథాంగదంపతుల్॥ ౧౨౩.

## ⟶ స్వయంవరాగతరాజవర్ణనాదికవచనము. ⟵

వ॥ అట్టిసమయంబున నట స్వయంవరోత్సవంబునకుఁ జనుదెంచి నగరంబుచు
ట్టును దిగియున్న విశ్వవిశ్వంభరావర లోకంబు, కాల్యకృత్యంబులు నిర్వర్తించి, గం
ధమాల్యాలంకరణంబులు దివ్యాభరణంబులు నలవరించి, చతుర్విధ వాద్యంబులు మొర
య, బిరుదకథాకథన ప్రవీణులగు వందిమాగధులసంస్తుతులు నెఱయ, నిజవిజయసంకే
త నికేతనమ్ములగు కేతనమ్ములు మెఱయ, వేత్రధర హుంకారంబులు బెరయ, మత్త
మాతంగ తురంగ శతాంగభటతరంగంబుల బృంహిత హేషిత చంక్రియా కలకలమ్ము
లుదారయఁ దరియన్ జేసి చిత్రసేనమహీకాంతుండు కైచెఱఁబట్టి తెచ్చిన నవద్వీప
ద్వీపధరావర పురందరులకీర్తి ప్రతాపంబులు కరణిఁ దదుత్సవాలోకనాగత హిమాచల

కైలాసాచల సురాచల రోహణాచల సంతానంబులసరణి సీమంతినీకాంతా దిదృక్షాప
ర నరవర నికరహృదయ పుటవిపాటనంబునకు నుద్దండుండగు కుసుమకోదండుండుతం
డోప తండంబులుగా నాలికిరాసులుగాఁబోయు కుసుమకిసలయవిసరంబులయందంబున
నిరుపహతిస్థలంబగుట నచటినిఖిలభువనవిహారమాణ సౌభాగ్యలక్ష్ములు తమకు ఘటి
యించుకొనుమసృణ ఘనసార ఘుసృణజలపూరవిలేపనస్నిగ్ధంబులగు సౌధయూథం
బుల చందంబున వజ్ర మౌక్తిక పద్మరాగ విద్రుమచ్ఛటా సమంచలంబులగుమంచంబు
ల నధివసించుతతిశిరసావహించిన శృంగారరసంబు పగిదిమరకత మణిమయమకుటం
బుడంబునంబొదల దుష్టశిష్టజనశిక్షణరక్షణంబులు నెఱపుటకు విన్నపంబునకు డగ్గఱి
రౌద్రకరుణారసంబుల తెఱంగు పరంగిలాగి కెంపులపోఁగులబెడంగుఁజూప సీమంతినీ
కాంత నయనారవిందంబులకు నింపునింపలేని సౌందర్యంబులందగు రాజుల విలాసం
బుల రొదనిజహృదయ సదనుండగు మదనునకుఁబొడము బీభత్సరసంబు రుచిర వక్ష
స్థలంబునఁదోఁచిన విధంబున నీలంపుఁదాళి తళుకుసంఘటింపఁదనకుసరిగాని మరుని
యాకార రేఖలంగనుంగొనుసమయంబున నవయవ ముఖంబులంగనుపట్టు హాస్యరసం
బుక్రైవడిఁదారహారచ్ఛాయా నికాయంబునసందడింపఁగరగతంబగు వీరరసంబువడు
వునగోమేధికత్సరుద్యుతి స్ఫూర్జితకృపాణి పాణిరాణిల్ల భవదీయవిమతరాజన్య మాన
సంబుల నెపుదునెడబాయక నున్నదాననని పాదమంటుభయరసంబువైఖరివైడూర్యం
పుగండపెండెరంపు గండుమెఱయ పిడికిట నడంగునెన్నడిమి సోయగంబద్భుతాకా
రంబగుటఁదదద్భుతరసంబు సాకారంబైకనుపట్టు పోలికపుష్యరాగ పటుస్ఫుటస్థగిత
కటిసూత్రంబుచెన్నొలయ పొగరుఁదఱిగి నాడుమఱుఁగునంబరఁగు పగఱలంగావుమని
కరతలంబుల వ్రాలినశాంతరసంబురీతి మగవాతి హంవీరతాయెతుసొంపునింపఁ గళా
విలాసంబున సంపూర్ణ చంద్రబింబంబు జయించికైకొనిన దదీయనిస్తంద్రసాంద్ర చం
ద్రికలీల మందస్మితంబు ముఖారవిందంబున జెన్నొందు దళుకు నును తేటలధారాళమధు
రసుధారసధారలం గెలిచి చేకొనినఁ దన్మధురిమలాగునఁ దియ్యదనంబు పలుకులనెల
కొన నాప్తులతో సంభాషణంబు సలుపుచుఁదాన విద్యనభ్యసింపఁజేరిన లేఖతరుశాఖ
లాసించుజాడఁజెలికానికైదండఁ గొనుచుఁ జంద్రాంగదక్షమాతలేశ్వరుండొక్కమణి
మంచంబునఁ బర్వతశిఖరంబున వసియించు సింగంపుఁగొదమవైఖరి నధివసించియున్న
సమయంబునఁ జిత్రసేనధరారమణుండు చిత్రరేఖంగనుంగొని నీయనుంగునెచ్చెలియై
న సీమంతినిం దోకొని రమ్మనియానతిచ్చిన నవ్విలాసిని యంతఃపురంబునకుంజని వి
మలకుఁ దద్వృత్తాంతంబువిన్నవించి తదీయాజ్ఞఁ గైకొని సీమంతినింజేరి కైసేసి విజ్ఞాన
జనకుండగు నీజనకుండు నిన్నుఁదోడ్కొనిరమ్మనె స్వయంవరంబునకు విచ్చేయు.

 

దేవోత్తంస సుధామయూఖ విగళద్దివ్యామృతాస్వీత గం
గా వాఃపూర ఝుళంఝుళధ్వనికి ధిక్కారంబుఁ గల్పించుచున్॥ ౧౩౦.
ఉ॥ లాటవిభుం గనుంగొను విలాసవతీ మదను న్మహేంద్రశై
లాటవికు త్రిపుక్షత మృగాదిరవోదిత తేజు ఖడ్గ లా
లాట విలోచనాప్రతిమ లాస్యవికీర్ణ జటాహితాహ వే
లాటవిరోధి కంఠసముదంచ దసృగ్జలధారుఁ గోమలీ॥ ౧౩౧.
మ॥ నిరతోత్సాహుఁ డితం డమిత్రతతివింటే కొమ్మయీరాజు భీ
కరఖడ్గం బసుదానమందినది నిక్కం బాది నాత్మీయులౌ
ధరణీనాథులచే నటంచు మదిలోఁ దర్కించి తద్వక్త్రమా
దరవృత్తిన్ గలనేనిఁ గన్గొనరు ప్రత్యర్థి క్షమాపాలికల్॥ ౧౩౨.
సీ॥ సంతతసామ్రాజ్య సంపన్నుఁడగుమేటి యెల్లరాజులఁదాన యేలుతేఁడు
నిరతంబుగురుభక్తి నెగడురాజన్యుండు కంసుఁగుందునులేని ఘనయశుండు
సర్వజ్ఞసన్నుతిఁ జాలఁగల్గినధీర వరరూపవిభ్రమ వైభవుండు
జాతికెల్లను వన్నె సవదరించినరాజు కుజనుల శిక్షించు కోవిదుండు
మాళవాధిపుఁ డీతఁడో బాల చూడు । వీనితో సాటి సేయంగఁ బూని యహహ
తలఁపవచ్చునె యొక్క సౌందర్యవిభవ । మాత్ర నలరాజు రాజు మన్మథుని మధుని॥
మ॥ తరుణీ విక్రమశాలి యీనృపతి యేతత్ఖడ్గకృత్తారి భూ
వరవర్గంబు సురత్వమొంది సుమముల్ వర్షించు మున్నున్న ని
ర్జరు లెంతేని ప్రసూనవృష్టి గురియున్ స్వారాజ్య సౌభాగ్యతి వి
స్ఫురణం గూర్చిన మేల్తలంచి యితనిం బూజించు చందంబునన్ ॥ ౧౩౪.
సీ॥ ఈ రూపకందర్పుఁ జేరియుండఁగఁజుమీ యిల నందములకంద మేరుపడియె
నీ కళాపాంచాలు నెనసియుండఁగఁజుమీ నెఱనీటునకు నీటునివ్వటిల్లె
నీ మహీదేవేంద్రు నెలమిఁ జెందఁగఁజుమీ భోగంబులకుఁ జాల భోగమొదవె
నీ రాజపరమేశుఁ గోరి పొందగఁజుమీ నెగడుపాండితికిఁ బాండితిఘటిల్లె
నౌరయనియంచ మించు నపార వరక్ర । పా రమాపాల విభుని నేపాలవిభుని
తనుసామ్రాజ్యకరకటాక్షాంచలములఁ । జెలువుగను పట్టఁగనుఁగొం టెకలువకంటి॥
లలనామన్మథుఁ డీతఁ డేతదరిజాలం బార్తిమైఁ గానన
స్థలి బాలై చనుచుండి యెండలకు నోర్వంజాలకెంతే శిరం
బులపైఁ జెక్కిన పల్లవంబులు కడున్ బాల్పారు భస్మగ్గునన్
గలయంగా నఱకాలిమంట తలకెక్కం బారు చందంబునన్॥ ౧౩౬.

మనుటయు మనంబుననుల్లసిల్లి పరివేష్టిత సహస్ర మధుపాలకియగు పాలకి నెక్కి సకలదేశాధీశనూత్న చిరత్నరత్నకోటీర కోటిదివ్యన్మణి ఘనఘృణి వితాన కల్పిత విచిత్రవితానరంగంబునా నొప్పు స్వయంవరరంగంబుఁ బ్రవేశించియచట్టఁబల్యంకికా వరోహణంబాచరించి॥ ౧౭౮.

## స్వయంవరాగతసీమంతినీ వర్ణనము.

సీ॥ వలరాజుటెక్కెల గెలుచునేత్రములు నా వలరాజుటెక్కెలఁ గలమొగంబు
మెఱుఁగుఁదీఁగలమించునాఅపుచక్కనిమేను మెఱుపుఁదీఁగలమించుమెఱుపుఁగేలు
రసదాళి రుచిమీటు నాసపరికెమ్మోవి రసదాళిరుచిమీటు ముసురు కురులు
నగజాతిభూతిని నవ్వు పాలిండ్లు పన్నగజాతి భూతిని దెగడు నారు
కుందనము గేఁరు చెక్కు కుల్కుందన్నంబుఁ బల్లవమునవ్వు చరణ సంపల్లవంబు
రంజలఁగ మించు శుభగుణారామవాటి నిబిడరుచికోటి సీమంతినీ వధూటి ॥
సీ॥ తనలేఁత కెమ్మోవి తళుకుటీరెండల మోహంపు చీఁకట్లు ముంచుకొనఁగఁ
దనమోముజాబిల్లి గొనబు వెన్నెలలను హృదయారవిందంబు లెదురుకొనఁగఁ
దనమేని సంపంగి తావిపూఁగొమ్మను చూపుతుమ్మెదగుముల్ జుట్టుకొనఁగఁ
దన నీలధమ్మిల్ల దర్వీకరంబుపై వలపు టూరుపుగాడ్పులొలయఁదివుర
సొగసి యాశ్చర్యమునఁ దన సోయగంబుఁ । గాంతులెదనూరఁ గన్నుల కరువుదీర
రాణదనరారఁ గడునాయారంబు మీఱఁ। జూచునృపతులధైర్యంబుఁజూఱఁగొనుచు॥
క॥ నడ రత్నపుబొమ్మ గతిఁ । వెడవిల్తుని మత్తదంతి విధమున నచటన్
విడివడి తిరిగెడు రతి చెం । పుడు చిలుకబలెన్ సఖీసమూహావృతయై॥
సీ॥ తమ్ములఁ బెనఁగొన్న తరణిదీధితులునాఁ గరపద్మరాగ కంకణము లలర
గగనంబు వలగొన్న గాంగఝరంబునా మించుఁగొనున హీరకాంచి మెఱయఁ
గిసలయంబుల మూఁగు భసల జాలములునా నంఘ్రిల నీలంపు టందెలెసఁగ
గిరులపైఁ బొరలు నిర్ఝరుల తుంపురులునాఁ జనుదోయిముక్తికసరములమరఁ
బుష్పరాగంపు టుంగరములు గిరీటి। పచ్చ తాయెతుల్ పగడంపు బన్నసరము
నాలుగోమేధికపు మొలనూలి ఘంట । లడర వైదూర్యములతాళి బెడఁగుఁజూప॥
క॥ కలయఁగ నంతటఁ దనపై । నిలిచిన నిఖిలావనీశ నికర కటాక్షాం
చలధారంబునఁ బోలెం। బొలఁతుక యతిమందగమనమునఁ జనుదెంచెన్॥

## చిత్రరేఖ సీమంతినికి సకలదేశాధీశుల వేత్యేఱ వర్ణించిచెప్పుట.

శా॥ ఆవేళం జనువొప్పఁగా సకల దేశాధీశులంజూచి చా
చావైలక్షణి చిత్రరేఖ పలికెన్ సంధ్యాతినృత్య స్మరహ